# సర్వ సిద్ధాంత సౌరభము

## శైవము






'సాధనరహస్యా'ది బహు గ్రంథకర్తలు,

శ్రీ రామకృష్ణాశ్రమములు (బాపట్ల & భీమునిపట్నము)

సంస్థాపకులు :

పరమహంస - పరివ్రాజకాచార్య

శ్రీ అనుభవానంద స్వాములవారు

ఇరువదియేడవ కుసుమము

సర్వహక్కులు : ప్రకాశకులవి

తృతీయ ముద్రణ : 1986

వెల : రు. 20-00

---

"This Book is Published
With the Financial Assistance of
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
Under their scheme
Aid to Publish Religious Books".

---



ప్రతులకు :

శ్రీ అనుభవానంద గ్రంథమాల
బాపట్ల - 522 101 (గుంటూరు జిల్లా)

పరమహంస కార్యాలయము,
భీమునిపట్నము - 531 163 (విశాఖ జిల్లా)

ముద్రణ :

శ్రీ శారదా ప్రింటర్స్
బాపట్ల - 522 101

# తొలి పలుకు

అనుభవముతోకూడిన వచన రచనములు, సాధనా పటిమచే గలిగిన ఏకాగ్రతవలన సాధ్యము. ఆ ఏకాగ్రతచే జ్ఞానమును, 'ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి' అజ్ఞానముచే సర్వ విజ్ఞానములు కలుగుచున్నవనిగదా శాస్త్రము. అదికూడ పూర్వజన్మ సుకృతలభ్యమే!

శ్రీ అనుభవానంద స్వాములవారు, సకల సమన్వయావతార మగు శ్రీ రామకృష్ణదేవుని సర్వాదర్శమూర్తిగా, ఆరాధించిన మహనీయులగుటచేనేమో, వారి వచన రచనము లందు ఆ సమత్వము వ్యక్తమగుచుండును. ఆ సమత్వము వారి సకల గ్రంథములలో ప్రవహించుచుండును. అట్టి గ్రంథమే 'సర్వ సిద్ధాంత సౌరభము'. ఆ పేరులోనే ఆ సమరసత్వము వ్యక్తము.

"సర్వ వేదాంత సిద్ధాంత సారసంగ్రహము"ను శ్రీ శంకరులును, "సర్వ సిద్ధాంత లేశ సంగ్రహము"ను శ్రీ అప్పయ్య దీక్షితులును రచించినట్లుగా 'సర్వ సిద్ధాంత సౌరభము'ను శ్రీ అనుభవానంద స్వాములవారును రచించిరి. పుష్పముల సువాసన నాఘ్రాణించినవారు, ఆ కుసుమము ఎచ్చట నున్నదో అని అన్వేషించి, ఆ వృక్షమును కనుగొని సంతసించినట్లు సిద్ధాంతమను పుష్ప సౌరభమును గాంచినవారుకూడ గవేషణము సలిపి, ఆ సిద్ధాంత వృక్షరాజమును కనుగొని ఆనందించవలయునని శ్రీ స్వాములవారి ఉద్దేశము. ఏ పూవు విలువ సుగంధములు దానివే! అట్లే ఏ సిద్ధాంత విశిష్టత

దానిదే! ఆ సమత్వ గ్రహణమునకే, ఆచరణమునకే యీ 'సౌరభ' రచనము. ఆ సామరస్యముచే సంకుచితత్త్వము బాసి, పర మత దూషణములు మాని, విశాలమును విశ్వతోముఖము నగు ఆనందమును పొందనగును.

ఇదియే శ్రీ రామకృష్ణదేవుని ప్రత్యేక సాధనా విధానము! ఇదియే ప్రత్యక్ష అనుభవస్థితి! సాధనలనేకములు గాని అనుభవము ఒక్కటే! సిద్ధాంతములు బహుళములుగాని గమ్యమొక్కటే! సకలానుభవ స్వరూపుడైన శ్రీ రామకృష్ణుని సమస్త సాధనా విధానములను, సర్వమత సామరస్యమును, సకలానుభవ రహస్యములను వ్యక్తము చేయుటకే యీ శ్రీ అనుభవానంద గ్రంథమాలను శ్రీ అనుభవానంద స్వాములవారు సంస్థాపించిరి.

పాఠకులు దీనిని పఠించి మన మహర్షుల భౌతికాభౌతిక విజ్ఞాన సంపదకు వారసులై, మన ప్రాచీన భారతీయాధ్యాత్మిక సంస్కృతీ ప్రవాహమున పీదులాడి, యదార్థ భారతీయులై మనెదరు గాక!

ఈ గ్రంథ ముద్రణకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు రు. 7396-00 లు ఆర్థిక సహాయముచేసి, మా గ్రంథమాల కృషికి ప్రోత్సహించినందులకు వారికి మా కృతజ్ఞతలు.

మా బాజి

బ్రహ్మేశానంద

# సమర్పణము

శ్రీ రామాది దశావతారములకున్, శ్రీలక్ష్మి వాణి ఉమా
తారాశక్తులకున్, త్రిమూర్తులకు స్వస్థానంబుగానొప్పు నా
పారావారము, రామకృష్ణగురు, సర్వాధ్యాత్మిక స్థానమున్
ఆరాధించుచు గ్రంథమిచ్చెదను సర్వాధ్యాత్మికాన్వేషినై

శ్రీవిద్యా ప్రతిభాస్వరూపులు, మహోత్కృష్టానుభూతస్థితుల్
భావాతీతులు, తత్త్వసిద్ధులును, సర్వాధ్యాత్మికాచార్యులై
భావిన్ భూతము వర్తమానములలో భాసిల్లు తత్త్వజ్ఞులన్
భావించే నిడువాద గ్రంథమును సర్వాధ్యాత్మికాన్వేషినై

శుభమై, సుందరమై, సుఖప్రదమునై శోభిల్లు తత్త్వార్థ సు
ప్రభకన్వేషకులౌ ముముక్షులకు సర్వాధ్యాత్మికోత్కృష్టతా
విభవార్థంబు ననుగ్రహింపగల దేవిన్ 'సర్వ సిద్ధాంత సౌ
రభమున్' నేను సమర్పణంబిడుదు సర్వాధ్యాత్మికాన్వేషినై

నమో మహద్భ్యో నమో అర్భకేభ్యో
నమో యువభ్యో నమ ఆశినేభ్యః।
యజామ దేవాన్ యది శక్న వామ
మా జ్యాయసః శం సమా వృక్షిదేవాః॥

(ఋగ్వేద. 1. మం. 27 సూ. 13.)

గొప్ప దేవతలకు నమస్కారము, స్వల్ప దేవతలకుగూడ ప్రణామములు, యువకులకు నమస్సులు, వృద్ధులకు నమోవాకములు; మా శక్తికొలది నెల్ల దేవతల నారాధించెదము. పెద్ద దేవతల సంస్కృతిని మేము విస్మరింపకుందుముగాక !

# వి ష య సూ చి క

## ముఖప్రబంధము 1_46



## ఉపోద్ఘాతము 11_36



## శైవతత్త్వ ప్రాశస్త్యము 47_118



## శివుడు - వేదశాస్త్రములు 119_193

—

ఓం

శ్రీ శారదా రామకృష్ణాభ్యాం నమః

# సర్వసిద్ధాంత సౌరభము

## నవమ సంపుటము

### ముఖపరిబంధము

### శివాదర్శము

హే పార్వతీహృదయవల్లభ చంద్రమౌళే
భూతాధిప ప్రమథనాథ గిరీశచాప ।
హే వామదేవ భవ రుద్ర పినాకపాణే
సంసారదుఃఖగహనా జ్జగదీశ రక్ష ॥

శివనామావల్యష్టకం—౨

ఓ పార్వతీహృదయనాథా! చంద్రధరా! సకలభూత పాలకా! ప్రమథగణనాథా! కైలాసాధిపతీ! వామదేవా! భవా! రుద్రా! త్రిశూలపాణీ! సంసారదుఃఖకాననమునుండి జగదీశా రక్షింపుము. ఈరీతి సంస్తుతింపబడిన శాంతిసుఖప్రదాతయగు శివస్వరూపుడు

సర్వభూతాధివాసుడై, తా 'బ్రహ్మాద్యా_స్తంబ పర్యంతాం పశవః పరికీ_ర్తితాః। తేషాంహి నా_యకో యస్మాచ్ఛివః పశుపతి స్స్మృతః॥' చతుర్ముఖబ్రహ్మ మొదలు తృణము వరకుగల సర్వజీవులు పశువులని వ్యవహారము. వానికి నాయకుడగుటచే శివుడు పశుపతి యగుచున్నాడు. కావున సర్వ సమదృష్టికలవాడై 'స్మశానేష్వాక్రీడా స్మరహర పిశాచాః సహచరా। శ్చితాభస్మాలేపః స్రగపి నృకరోటీ పరికరః॥' సదా స్మశానవాటికల క్రీడయు, పిశాచ సహచర బృందమును, స్మశాన భస్మధారణయు, కపాల కంఠహారములును గలిగి, బాహ్యమునకు 'అమంగల్యం_శీలం' అమంగళ కరుడుగా దోచినను, 'నా_మైవమఖిలం ....స్మ_ర్తృణాం వరద పరమం మంగళమసి' (24) నీనామమును స్మరించువారికి సమ_స్త మంగళము కలుగుచున్నది. నీవు నీభక్తులకు మంగళము ప్రసాదించువాడవయితివని పుష్పదంతుడు శివమహిమ్న_స్తోత్రమున విశదపరచినట్లు, తన సమరస ప్రవ_ర్తనముచే అమంగళముగా గోచరించినను 'శం కరోతీతి శంకరః' అనురీతి సర్వజీవ కల్యాణమునే అతడు అనుగ్రహించుచున్నాడు. He is the very oul of gentleness, refusing none. Up here have gathered ou-d Him all those who were weary of earth, having ound no acceptance amongst the fortunate (1) అతడు శాంతమున కాధారము. ఆశ్రితుల నేరిని నిరాకరింపడు. అదృష్టవంతులలో గణింపబడక సంసారమునకు రోసినవారెల్లరు అతని చుట్టు జేరిరి. The serpents, whom all the world hates and

(1) Sister Nivedita: The web of Indian Life, p 202.

denies, come to Kailash, and Mahadev finds room for them in His great heart (1) లోకము ద్వేషించి త్రోసివేయు సర్వులు కైలాసము నాశ్రయించెను. తన మహదూర్పిపహృదయ పటిన మహాదేవుడు వానికి స్థానమును గాంచెను. and the tired beasts came-for He is the refuge of animals- and it is one of these, a shabby old bull, that He specially loves and rides upon (1) అటులే అలసిపోయిన జంతుజాలము లరుదెంచెను. అతడు పతికావున వానిలో నొక వికృత వృద్ధ వృషభము అతనికి ప్రత్యేక ప్రేమపాత్రమై వాహనముగ నయ్యెను. And here, too, come the spirits of all those men and women who are turbulent and troublesome and queer, the bad boys and girls of grown up world, as it were. All the people who are so ugly that no one wants to see them; those who do things clumsily and talk loudly, and upset everything though they mean no harm, and the poor things who are ridden by one idea, so that they never can see straight, but always seem a little mad - such are the souls on whom He alone has mercy. He is surrounded by them and they love and worship Him. He uses them to do His errands and they are known as Siva's demons (1) భయంకరులై, బాధాకరులై విచిత్రమైన, వయస్కులగు లోకమున పెద్దవారైన బాలబాలికలు నాబడు స్త్రీపురుషుల ప్రేతలు కూడ నచటికి చేరును. ఒక్కడైన జూడనొల్లని వికృతాకారులైనవారు, హాని తలంపకున్నను, బిగ్గరగా బ్రసంగించుచు, అసహ్యకరముగ

(1) Sister Nivedita : The Web of Indian Life p 202.

కార్యముల జేయుచు, వక్రదృష్టిగలవారై కొలదిగ నున్మత్తులవలె నున్న వారుగూడ నరిగిరి. అతనికి మాత్రమే అట్టివారిపై అను గ్రహము. అతడు వారిచే పరివృతుడై యుండ, వారతనిని ప్రేమించుదురు, పూజించెదరు. తన కార్య నిర్వహణమునకు వారి నాతడుపయోగించును. వారు శివుని ప్రమథగణము నాబడుదురు అని సోదరి నివేదిత శివుని అపార దయాస్వరూపమును స్మరించి, చిత్రించి మనముందుంచినది. అట్టి విశాల హృదయుడు జీవకోటినంతటిని ఆకర్షించుటయు ఆరాధింపబ డుటయందు ఆశ్చర్యమేమిగలదు? అతని మూర్తిమత్వ మసాధారణము, అద్భుతము ఆశ్చర్యకరము అట్టి అసమాన శివస్వరూపమే 'Siva embodies eternal India' శాశ్వత భారతి యనదగును, ఆ సువిశాల హృదయస్థానమున కెవరికి ఆశ్రయము దొరకదు! సర్వజీవుల కాధారమాతడేగదా! పుష్పదంతుడు వచించురీతి 'తవ తత్త్వం న జానామి కీదృశోఽసి మహేశ్వర! యాదృశోఽసి మహాదేవ తాదృశాయ నమోనమః॥' (శివమహిమ్న-40) కొంచమైనను నీతత్త్వమును మహేశ్వరా! నేను ఎరుగను. మహాదేవ! నీ వెటులగలవో అట్టి నీకు నమోవాకములు. అగమ్యమైన ఆమూర్తికి ప్రణామ సహస్రమ మాచరించి శరణు పొందుచున్నాము.

## సర్వ సిద్ధాంత సౌరభము

అట్టి సుప్రసిద్ధ విశాలహృదయశోభితులైన దేవతాగణమున శాకరమై, తదారాధన అనుసరణములయం దారితేరినదై, తదాకారా

కారకమై తత్త్వమై విరాజిల్లు మన భారతదేశమున అనాదికాలము నుండి సంతత మహాప్రవాహ రూపమున ప్రవహించుచున్న అపార సంస్కృతిస్వరూపమును మనమంత పరికించి. అద్దాని సువిశాలత్వమునే గాంచి, అసాధారణ మాధుర్యమునుగూడ చవిచూచి, అమందానందము పొంది, మన 'సర్వ సిద్ధాంత సౌరభము' పదిసంవత్సరములుగ సదా రాధన, అనుసరణ, వివరణములు గావించుచు అవిరళ కృషి గావించు చున్నది. అది విస్తారములైన కపిలాచార్యాది దర్శనకర్తలనాశ్రయించి, దర్శనసత్ప్రబోధసుధను ఆప్యాయతతో ఆస్వాదించి తన్మయము పొంది; సకలాస్తిక సాధన సిద్ధాంత శిరోభూషణమైన అద్వైత సంస్థితిని వేదాది సర్వవాఙ్మయసాగరము నుండి మథించితెచ్చి, మన కందించిన శ్రీ శంకరాచార్యాది ఆచార్యవర్యులను కృతజ్ఞతతో దర్శించి, వారిబోధలగ్రహించి, పైమరచి; అంత సగుణబ్రహ్మమునొక్క సర్వసద్గుణ పీయూషమును ద్రావి. దాని మాధుర్యమునందు మునుంగ శ్రీ రామానుజాది వైష్ణవాచార్యుల అద్వితీయ తత్త్వమును శరణొంది, మన 'సౌరభ' గ్రంథము ఇంతదనుక ధన్యత గాంచియున్నది తన సంకల్పరూపమైన షోడశ సంపుటములలో అష్టమము పొంది చాలవరకు సార్థకత నార్జించినది.

## శైవ ఖండము

కావున సంపూర్ణ భారతీయ ఆస్తిక సంస్కృతి స్వరూపమును సదా ఆరాధించు 'సౌరభము' ముందడుగు వేయుచు, యీ నవమ సంపుటముతో శైవశాక్త ఖండమున ప్రవేశించుచు. అందు ప్రస్తుతము

శైవ సంపుటమును జవిచూచి, అందలిపరిమళశోభను వ్యక్తపరుప యత్నించుచున్నది. శైవారాధనావిధానము భరతఖండమున నతి ప్రాచీనముగ వెలుగొందుటయు, నా శివతత్త్వ విచారణసమయముల ననేక సంశయములు వాటిల్లి వివిధ సిద్ధాంతములు ప్రబలుటయు, నందున శివరూపము కేవలము సాకార, సగుణములతో దృష్టిగాంచు భక్తులకు గోచరింపక, నిరాకార, నిర్గుణములగూడ నావరించి, అగోచరస్థాయిని బొందియుండుటయు గాననగును. ఈ సాకార నిరాకారములకు సంధిస్థానముగ సాకారమునుండి నిరాకారమునకు మార్గదర్శకముగ నొక చిహ్న స్వరూపమునుగూడ ధరించి 'లింగా' కృతితో మరియు ననేక సమస్యలకును, సందేహములకును శైవ మాస్పదమైయున్నది. స్థూ ల ము యి న కరచరణాద్యవయవాలంకృత మూర్తిమత్త్వము గల్గియుండుచు, నా స్థూల బుద్ధులైన భక్తులమాత్ర మాకర్షించి, ముక్తి నొసంగుచుండుటమాత్రమేగాక, సూక్ష్మమై సృష్టికి పూర్వస్థితియైన అండాకారమునుగూడ గ్రహించి, అవయవ పరిత్యాగ మున లింగన్యాయమున నిర్గుణ బ్రహ్మమునకు మార్గగామియో యనునటుల అండప్రతీకముగాని చిహ్నమై అనగాలింగమై సూక్ష్మరీతి ఆరాధనాపరము శైవము సాధించియున్నది. అంతట ప్రతీకమును గూడ విసర్జించి, అద్వితీయ నిర్వికార నిరాకార బ్రహ్మము తానై, శివుడు, అతి సూక్ష్మబుద్ధులకుగూడ నాదర్శమై యొప్పి, నిర్గుణముగ నుండుటయు నిందు గోచరము.

అందుచే నీశైవము మందాధికారులనుండి ఉత్తమాధికారుల వరకుగల సర్వ ముముక్షుకోటికి ఆలంబనమున కవకాశముల బ్రసా

దించుచు, సర్వుల నాకర్షించుచు, సర్వ మానవశరణ్యమై యొప్పారుట ముఖ్యవిశేషము. అట్టి సువిశాల శైవతత్త్వ విచారణము నీతొమ్మిదవ సంపుటమున గొలదిగ బ్రదర్శింప 'సౌరభము' ఉద్యోగించుచున్నది.

కాన ముముక్షుకోటి యథాపూర్వముగ 'సౌరభ' తాత్పర్యమును గ్రహించి, శైవతత్త్వ మాహాత్మ్యమునుగూడ నాస్వాదించి, అనుసరించి, అనందించెదరుగాక.

—[o]—

# సర్వసిద్ధాంత సౌరభము

## శైవ ఖండము

## శైవమత సిద్ధాంతము



కాలచక్రము ధరియించి సర్వజగతి
లయము నొందింప సాత్వికమయుడ నగుచు
నీలవర్ణుడ శివుడను నిశ్చయముగ
ననుభవానందుడన్........



# సర్వసిద్ధాంత సౌరభము

## ఉపోద్ఘాతము

## శివుడు - పారమార్థికత

Oh India ! for get not that the God
thou worshippest is the Grcat
Ascetic of ascetics, the all-
renouncing Sankara.

Swami Vivekananda 2

ఓ భారతీ! నీ వారాధించు భగవంతుడు సన్న్యాసులకు మహోత్కృష్ట సన్న్యాసియైన సర్వసంగపరిత్యాగి శంకరుడని మరువకుము. ఈ ప్రపంచమున జీవించుచు, నిందుగల నల్పసుఖమునకును బహుళమైన దుఃఖమునకు నతీతముగ శాంతిసంధానమొనరించి, తన్మయత ననుభవింప నొక్క భారతదేశమునకుమాత్రమేగాక సర్వప్రపంచమున మానవకోటికెల్ల నా దేవాధిదేవుడు మహాదేవుడు శంకరుడు మార్గమును జూపియున్నాడని పై వివేకానందుని వాక్యముల తాత్పర్యము. అందుచే తత్ఫలసిద్ధికై మానసవీధుల నా స్థితప్రజ్ఞుని పరంజ్యోతిగా నునిచి,

(2) Swami Vivekananda : The Vedanta Kesari, 1957. p 412.

చిత్తరథమునకు ఆతని సారధిగానుంచి, పయనము గావించుచో విస్ఫం దేహముగ నా శాంతి సౌధమును అధిరోహించి ఆనందింపగలమనియు నా స్వామి అభయహస్తము.

పై దృక్పథము కేవలము అలౌకికానందప్రాప్తినేగాక భౌతిక సుఖదుఃఖద్వయముమధ్యగూడ శాంతి సౌఖ్యముల బ్రసాదింపగలదు. ఈ విషయమును వివరించుచు, India's message is two-fold - activistic and meditative...But the meditative India was at the back of this activistic aspect...This dual aspect is the mesage of life too. Life comprises of both contemplation and action. And both are symbolised in the conception of Siva (3) ప్రవృత్తి నివృత్తు లనెడు ద్వివిధ సందేశమును భారతదేశము ఒసంగును. కాని ప్రవృత్తితత్వమునకు నివృత్తి భారతము ఆధారముగ గలదు. ఈ ద్వంద్వ తత్త్వము జీవితమున కొక సందేశముగూడ నగును. జీవనము యీ ప్రవృత్తి నివృత్తుల గలిగియుండును. ఈ రెండును శివతత్త్వమున సూచింప బడియున్నవి. ధ్యానవిమగ్నతనున్న శివుడు సత్త్వమునకు, సమత్వము నకు, శాంతమునకు, ధ్యానమునకు ఆదర్శము. కర్మధ్యానమును తొలుత గోరును. ధ్యానము కర్మగ రూపొందును. ఆలయములోని శివస్వరూపముగాని, చిత్రర్వుగాని will remind you that life is not at all activity, movement, race, it is contemplation, poise, absorption too (3) జీవనము కేవలము కర్మాచరణము గను, సంచలనముగను, పోరాటముగనుగాక, అది ధ్యాన నిమగ్నత,

(3) The Editor : The Vedanta Kesari, 1957, p 410.

సమష్టి, అంతర్ముఖత్వములుగగూడ నీకు స్ఫురింపజేయును. యథార్థమున ఆచార్య నగరాజరావు వాక్యములలో It is the contemplative that keep the world disinfected. They are the salt of the earth (4) ధ్యాననిష్ఠులే ప్రపంచమును దుష్టత్వమునుండి కాపాడుదురు. వారు యీ ప్రపంచమునకు సారభూతులు. అంధకారబంధురమైన ప్రపంచమునకు వారు జ్యోతులు. అట్టివారు లేని లోకము సంపూర్తిగ నంధప్రాయము. A world without the mystics is totally blind (4) అనియు నాతని విశ్వాసము.

ఈ యాంతర్యము నెరింగిన హిందూజాతికి వివేకానందుని వచనములచందము you will find one national idea- spirituality (5) పారమార్థికదృష్టి ఒకే జాతీయ దృక్పథముగ గాంచగలము. ఈ దృష్టిపరిణామమునకై ఏ యితరమతము నందును, యింత అపార కృషి గాంచజాలమనియు నా యతీశ్వరుని విశ్వాసము. అందుచేతనే India is the world's ancestral home of religious consciousness (6) పారమార్థిక స్ఫురణమున ప్రపంచమునకు బుట్టినిల్లుగ హిందూదేశము కీర్తిగాంచినది. దీనికారణముగ Hindu imagination long ago detached itself from the cycle of

(4) Dr. P. Nagaraja Rao : Introduction to Vedanta, p 67.
(5) Swami Vivekananda : The Complete Works, Vol. 2, p 370.
(6) Sadhu T. L. Vaswami ; The Vedanta Kesari, 1930, p 18.

physical beauty, to seek its fullest satisfacton of subtler realms (7) హైందవ మనోవ్రవృత్తి ప్రాచీన కాలముననే సుసూక్ష్మసంస్థితుల సంపూర్ణతృప్తి నన్వేషింప భౌతికసౌందర్య భ్రమణమునుండి విముఖత్వము నొందినది. అట్లనాధికాల. న ఆధ్యాత్మిక జ్యోతిని వెలిగించిన భారతి అతులానందుని విశ్వాసమున That fire she holds alive todoy. Her torch of spiritual culture must dispel the darkness of materialistic civilizations (8) ఆ జ్యోతిని సజీవముగ నేటికిని ధరించియున్నది, భౌతిక సంస్కృతీ నిమగ్న దేశముల నంధకారము నా యాధ్యాత్మిక సంస్కృతీ జ్యోతి నివారణ మొనరించును.

ఈ పరమసత్యమును గ్రహించియే నెహ్రూ పండితుడు, కార్య కర్తల సమావేశమును సంబోధించుచు, materialism is not the only thing that mattered to a nation. Spiritualism also ennobles a nation, India is proud of its spiritualism (9) జాతికి కేవలము భౌతిక తత్త్వముమాత్రమే ముఖ్యముగాదు, పార మార్థిక వ్యవస్థయు జాతిని శ్రేష్ఠత్వమునకు గొంపోవును. భారత దేశము తన పారమార్థిక దృష్టికి గర్వించుచున్నదని గట్టి హెచ్చరిక జేసియున్నాడు. బొంబాయి నగరమున భారతీయ విద్యాభవనమున ప్రసంగించుచు జవహర్‌లాల్ నెహ్రూ పండితుడు, హిందూదేశము

(7) Sister Nivedita : The Web of Indian Life, p 194.
(8) Swami Atulananda : The Vedanta Kesari, 1935 p 189.
(9) Pandit Jawahar Lal Nehru : Addres, Congress Legislature Party, Hyderabad, 20-7-1963

పారిశ్రామికముగ నభివృద్ధిపరుపబడునుగాని, on spiritual foundations (10) అది పారమార్థిక ప్రాతిపదికలపై నేర్పడునని నొక్కి చెప్పియున్నాడు.

ఎందుచేత ? Man is not exhausted by body and mind, In the complex of human personality, there is an element which uses both. yet is neither (11) మానవుడు దేహమనములతో బూర్తికాలేదు. క్లిష్టమైన మానవవ్యక్తిత్వములో నీ రెండింటి నుపయోగించుకొనుచు నా రెండునుగాని మరియొక తత్త్వముగలదు. కాన Man's never-eeasing effort to read the riddle of the sphinx and raise himself above the level of the beast to a moral and spiritual hieght finds a striking ilustration in India (12) పశుత్వమునుండి తానుద్ధరించుకొని, నైతిక పారమార్థిక ఔన్నత్యమును బొంది, సీక్లిష్టత్వమును విచ్ఛేదించు మానవుని నిత్య నిర్విరామ వ్యాయామము భారతదేశమున బ్రస్ఫుటక్రియ ప్రదర్శితము అవి రాష్ట్రపతి రాధాకృష్ణుని సత్యభాషణము. ఆ పారమార్థిక దృష్టియే లేనినాడు, లోకము అంధత్వమున మునింగి పోవునని విశ్వసించి, అఖిలప్రపంచ నేత్రవైద్యుల సమావేశములో బ్రసంగించుచు పండిత రాధాకృష్ణుడు శారీరక అంధత్వ

(10) Pandit Jawahar Lal Nehru : Address, Sardar Patel College of Engineering, Bombay, 20-8-1962.

(11) Dr. S. Radhakrishna : Address, A Seminar on Saints, g 2.

(12) Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p 766.

మును నిర్మూలించు కృషియేగాక we must also try to remove the spiritual blindiness from which we all suffer (13) మన మెల్లరము బాధాకరముగ ననుభవించుచున్న పారమార్థిక అంధత్వ నివారణమునకుగూడ మనము యత్నింపవలెనని ఉద్బోధించియున్నాడు. భారతీయ తాత్త్విక భావచారిత్రమున స్థూలమైన బాహ్యప్రపంచ మున కాధారముగ more real and more intangible which is the true home of the spirit, has been haunting the Indian race (14) అధికతర సత్యత్వమున అవిస్పష్టత్వముననున్న ఆత్మాధారక యథార్థ ఆశ్రయము భారతజాతిని వెన్నంటుచునే యున్నదనియు నా ఆచార్యవర్యుని కథనము. అట్లు మానవజాతి సృష్టి ప్రారంభమునుండి కృషిసల్పిన భారతిని సంస్తుతించుచు India has always pondered on the great problems of life, not of this life only, but also of the life Eternal. And the outeome of these meditations she offers to the world today' (15) ఈ భౌతిక జీవితమునకు మాత్రము సంబంధించినవేగాక నిత్య జీవనసంబంధము లైన గొప్ప సమస్యలనుగూడ భారతదేశము సర్వదా యోచించును. ఏతద్ధ్యాన ఫలితముల ఆధునిక ప్రపంచమున కామె యొసంగుచున్న

---

(13) Dr. S. Radhakrishnaan : Address Ophthalmologists Conference, New Delhi, 5-12-1962.

(14) Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p. 766.

(15) Swami Atuiananda : The Vedanta Keṣari, 1935, p 243.

దని అతులానంద స్వామి విశదపరచును. అట్టి ఆధ్యాత్మిక దృష్టియే లేకున్న. humanity would continue to face the risk of becoming crippled, if not totally destroyed 16 మానవ లోకము సంపూర్ణిగ నశింపకున్నను వికృతముగా నగు ప్రమాదము నెదుర్కొనుచుండవలసి యుండునని భౌతిక, పారమార్థిక సంస్కృతీ సమన్వయముయొక్క అత్యావశ్యకతనుగూర్చి రాజేంద్రప్రసాద్ మహాశయుడు నొక్కి వక్కాణించియున్నాడు.

అట్లుకానిచో, నీ భౌతిక పారిశ్రామిక అభివృద్ధి మాత్రము ఎంత సుఖశాంతుల మానవులకొసంగగలదని ప్రశ్నించి, మానవుని spiritual nature can and does satisfy our longing for the Greater Light or God 17 పారమార్థిక తత్త్వమే పరంజ్యోతి యగు భగవంతునికొరకు మన ఆకాంక్షను దృప్తిపరుపగలదని ఆచార్య ఋషి దరువాలా ప్రబోధము. ప్రపంచ ప్రఖ్యాత చరిత్రకారుడైన డాక్టరు ఆర్నాల్డు టాయిన్ బీకూడా ఢిల్లీ నగరమున బ్రసంగించుచు Religion is one of the spiritual necessities of human life, which mankind can never do without 18 పారమార్థిక జీవనము మానవుని అధ్యాత్మిక అవసరములలో నొకటి. అది లేక మానవుడు మనజాలడని ప్రస్ఫుటపరచెను. అటులే Religion

---

16. Dr. RaJendra Prasad : Address, Seminar on Science and Spirituality, Patna. 3-1-1963
17. Rusi J. Daruwala: The Indian Express, 8-7-1962
18. Dr. Arnold Toynbee: Statement New Dehi. 17-2-57

is living reality and is as much a part of our existence as some of our physical necessities on which the vital breath depends 19 ప్రాణమునకాధారమగు భౌతికావసరములవలె ధార్మిక జీవనము అత్యవసర సత్యము. ఎట్లన, ఆహారాదికము శరీరము యొక్క కండరములకు పుష్టి గలిగించుచుండుము, religion keeps the higher life in man going and it is in this higher life that man really lives 19 పారమార్థిక వ్యవస్థ మానవునిలో నున్నత జీవనవిధానమును అభివృద్ధి నొందించును. ఈ ఉత్కృష్ట జీవన స్థితిలోమాత్రమే యథార్థముగ మానవుడు జీవించుచున్నాడని ఆచార్య సురేశచంద్రసేన్ గుప్త స్పష్టపరచెను. అందుచే భౌతికజీవితమున కావశ్యకములైన ఆహారాదులకై మానవుడు కృషి సల్పుచున్నచందము, పారమార్థిక విషయపరిజ్ఞానమునకై యత్నించుచున్నాడు. అంతియగాక, ఆచార్య నగరాజరావు తాత్పర్యమున It is man that has given significance to life. The physical universe remained insignificant until man interpreted it. That is the uniqueness of man 20 జీవనము నర్థవంతము గావించినది మానవుడు. మానవుడు భౌతిక విశ్వమును బరిశీలించి అర్థము దెలుపునంతవరకు అది అనామకముగ నుండి పోయినది. మానవుని స్థితి అంతటి అసమానము అని ఘంటాపథముగ సృష్టిలో మానవుని అనివార్య స్థానమునుగూర్చి సువిదితము చేసియున్నాడు. అనగా నత్యంత బలీయమగు శక్తిసామర్థ్యముల బొందియుండి, సృష్టిలో నుండియు

19 Prof. Suresh Chandra Sen Gupta: The Vedanta Kesari, 1929, p 98.

*20. Dr. P. Nagaraja Rao: Introduction of Vedanta, p 10*

పీచేతనాచేతన సృష్టికంతటికి బ్రిమఖ వ్యక్తిత్వమునుగూడ గలిగియుండి, ఆ సృష్టినంతటిని దన మేధాశక్తిచే గ్రహించి నడుప గలుగుచున్న యీ మానవుడు, యీ సృష్టిలోగల అల్ప సుఖములకై లొంగి, అందే మునింగి, తన సంపూర్ణ వ్యక్తిత్వమును మఱచి, మరియు నంతకంటె మహాదాక్షణముగ, నీ సృష్టినంతటిని సృజించి, పెంచి, పోషించు నా విధాత పరమేశ్వరుని గ్రహింప యత్నింపకు డుట గడు శోచనీయము, మఱియు విచారకరము. కొంచెము వివేకము పరిణమించిన ప్రతి వ్యక్తికి బాహ్యమున సత్యముగ గోచరించు సృష్టి వైచిత్ర్యములలో అలౌకిక శక్తిసంపన్నుడైన నా పరమాత్ముని అతిలోక శక్తి సామర్థ్యములు తొంగిచూచుచునేయుండును. అంతియగాక, అచేతనములకొక రూపకల్పన మొనర్చి తన సౌఖ్యసంపదలకుపయుక్తము గావించుకొనుచు, పరమేశ్వరసృష్టికి బునఃసృష్టి గల్పించి, అనుభవించి ఆనందించు మానవుడు ఒకింతయైన దన సృష్ట్యతీతశక్తి నేల గ్రహింపజాలడు? అటులే తరతమ భావములనున్న వ్యత్యాసములుగాక, శక్తి సామర్థ్యములు తనకు పరమేశ్వరునకు జ్ఞాలవరకు సజాతీయములేయై యున్నవనియు, నందుచే దనలోగూడ నా పరమాత్మశక్తులిమిడి యున్నవనియు నెందులకు గుర్తింపలేకున్నాడు?

## దైవచింతనము

కాని పూర్వోక్త వాక్యములరీతి నీ కృషి అనాది కాలమునుండి భారతావని సదా సర్వథా జరుగుచునే యున్నది. అంతియగాక నా ఆకాంక్ష మానవ వివిధ ప్రవృత్తులలో నొకటిగ నుండుటయేగాక, అత్యంత

బలీయముగనున్నను, దాని యభివృద్ధికి సంపూర్ణ అవకాశమొసంగి, అది సంపూర్ణత్వము నొందుటకు భారతియే అతి ప్రాచీనమునుండి అసమానరీతి అవకాశముల నొసంగియుండుట సువిదితము. మన రాష్ట్రపతియు, the firm conviction that the pure stainless spirit, to know whom is life eternal, is one with the innermost soul of man 21. దేని గ్రహించుట శాశ్వత జీవనమగునో, ఆ పరిశుద్ధ వినిర్మల తత్త్వము మానవుని అంతరాత్మలో నేకమనునది అచంచలమగు విశ్వాసము అని నుడివియున్నాడు. అందుచే తనలో గోప్యముగను గొంతవరకు విస్మృతముగనున్న తన నిజతత్వ గ్రహణమునకై మానవుడు సహజముగ నారాటపడుచుండుటయు వ్యక్తము. అది జీవిత తృష్ణలలో ముఖ్యమై ప్రధానమైనదిగగూడ గ్రాహ్యము.

ఆ ప్రవృత్తిని గ్రహించి అభివృద్ధి గాంచజేయని దేశములు ప్రస్తుతకాలమున నా దేశములకేగాక, సర్వ మానవకోటికి ప్రమాద హేతువులై రాణించియుండుటయు గాంచనగును. స్కాట్లండు దేశములో గిల్డుఫోర్డు బిషప్ డాక్టర్ ఇవార్ వాట్కిన్సు మాట్లాడుచు, God has become, so to speak, a displaced person 22 భగవంతుడు బహిష్కరింపబడినట్లున్నాడు అని స్పష్టపరచియున్నాడు. భగవంతుని భక్తిలేని దేశముల పరిస్థితులు ముఖ్యముగా బ్రిటను

---

21. *Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol. 2, p 766.*

22. *Rev. Dr. Ivor Watkins: The Indian Express 4-9-1960.*

దేశమునుగూర్చి ఆందోళనము జెంది, సర్వశ్రేయోభిలాషియైన పీటర్ హావర్డు The age of Beasts may be upon us, Man has become an intellectual giant, but stays a moral dwarf. His brain has swollen. His hands grow strong, his heart is shrunken 23 అడవిమృగములయుగము మనపై వ్రాలవచ్చును. మానవుడు ప్రజ్ఞాస్థితులలో మహాకాయుడుగా నయ్యెనుగాని నైతికముగ మరుగుజ్జుగనే నిలచియున్నాడు. అతని మేధాశక్తి ఉబికినది, అతని హస్తములు శక్తివంతములైనవి. కాని అతని హృదయము ముకుళించుకొనిపోయినది అని వాపోయి, రానున్న ప్రమాదమును మానవకోటికి హెచ్చరించెను. అవును, ఒక బ్రిటనుదేశముననేగాక, సర్వేతర దేశములపైదృష్టి బరిశీలించి చూచినచో ప్రపంచమున సర్వసర్వత్ర నిదియేగదా పరిస్థితి. పిన్నలనుండి పెద్దలవరకు మంచి చెడ్డల వివేకముబాసిన ప్రవర్తనయేగదా! ఎచ్చట చూచినను తిరస్కార ప్రవృత్తులేగదా! ఎచ్చట జూచినను పెద్దలకగౌరవ వాక్యములేగదా! అట్టి పరిస్థితులలో నిక శిక్షణ ఎచ్చట? న్యాయ ప్రవర్తనలెచ్చోట? అంతయు నరాచకమేగదా!

దీనికంతటికి గారణమెయ్యది? ఫ్రాన్సుదేశస్థుడై జంతుశాస్త్రమున ప్రపంచప్రఖ్యాతి నార్జించి, భౌతికవిజ్ఞాన ప్రచారమునకుగా నేర్పరుప బడిన కళింగ బహుమానమును 1959 వ సంవత్సరమున బొందిన జీన్ రోస్టాండు ఉపన్యసించుచు, The awesome results of recent progress in science have placed mankind in a state of

23. *Peter Howard: The Indian Express, 10-11-1953.*

alarm. Now as never before, more and more appeals are made to our conscience, our reason and wisdom 24 ఈ భయంకర భౌతిక విజ్ఞానకృషి పరిణామఫలితములు మానవకోటిని ఒక ప్రమాదస్థితిలో నుంచివైచినవి. మన అంతరాత్మకు, బుద్ధికి, వివేకమునకు అసంఖ్యాకమైన విన్నపములు యిప్పటివలె పూర్వ మెన్నడునుగూడ వచ్చియున్నవికావు. But these lofty spiritual qualities cannot be improved suddenly - the West, intoxicated by material prowess and hypnotised by technological fever, has something to learn from the peaceful spirituality of the East 24 కాని అకస్మాత్తుగా నీ ఉన్నత పారమార్థిక గుణములు అభివృద్ధి చెందనేరవు. పాశ్చాత్య ఖండము భౌతిక సంపదతో మత్తెక్కియున్నది. భౌతికవిజ్ఞాన యంత్రీకరణముతో విషజ్వరగ్రస్థమై యున్నది. అది భారతాది పూర్వదేశీయ శాంతి సంధాయక పారమార్థిక తత్త్వమును గొంత గ్రహింపవలసి యున్నదనియు విష్కర్షగ పలికియున్నాడు మానవుడభివృద్ధిగాంచుచు, భౌతికముగ సృష్టికధినాయకుడై యున్నను, ఆ స్థితికలంకారమై, సర్వ శాంతికారకమైన ధర్మప్రవర్తనము లోపించినచో నిక నీ లోకమున సుఖశాంతులెచ్చట? ఈ పరమార్థమును గ్రహించిన మన రాధాకృష్ణ పండితుడుగూడ Dharma is something which is necessary to bind human society into one. No human being can be regarded as a complete human being unless he establishes communion in reality with himself and with his fellow-

24. *Dr. Jean Rostand: The Indian Express, 29-5-1960.*

beings. Dharma is something which brings out the essence in human beings 25 మానవ సంఘమును ఏకముచేయ ధర్మము అత్యంతావసరము. సత్యముగ దనతోడను, తన మానవజాతితోడను ఐక్యతను స్థాపించుకొననిగాని మానవుడు పరిపూర్ణుడుగా పరిగణింపబడడు. ధర్మము మానవునిలోని సారమును బహిర్గతమొనరించునని పలికెను.

## భా ర తీ య ము

అట్టి సద్ధర్మమునకాటపట్టగు భారతిని, జూచి, సగర్వముగ చక్రవర్తుల రాజగోపాలాచారి మహాశయుడు, భారతిలో నేడైన నచ్చీలము, దయార్ద్రిత, దానము, ధర్మము భూతదయాపరత్వములు గలవేని it is due to whatever remains of the old faith and the old culture 26 ప్రాచీన సంస్కృతి, ప్రాచీన మతశేషములే కారణమని భారతీయ విద్యాభవనములో స్పష్టపరచెను, అనగా మానవ సహృదయ శీలములకు ఆధారముగ భగవద్విశ్వాసము అవశ్యకమని వేరుగ వచింపనేల? ఈ తాత్పర్యమును గ్రహించియున్న అఖిల భారత కాంగ్రెసు కార్య నిర్వాహకవర్గముగూడ తన తీర్మానమున Mere material prosperity alone willnot make human life rich and meaningful. Therefore along with economic development ethical and spiritual values will have to be fostered. This alone will lead to the full development of

---

25. *Dr. S. Radhakrishnan: Address, The Indian Express, 18-11-1962.*

26. *Sri C. Rajagopalachariar: Address, Bharatiya Vidya Bhavan, Bombay, 25-12-1962.*

human recourses and character 27 కేవలము భౌతిక సంపన్నతమాత్రము మానవ జీవనమును ఐశ్వర్యవంతముగ అర్థవంతముగ నొనర్పజాలదు. అందుచే ఆర్థికాభివృద్ధికి దోడుగ నైతిక పారమార్థికమైన విషయములగూడ బోషింపవలయును. ఇదియే మానవ పరివర్తనముల సంపూర్ణ పరిణామమునకు మార్గదర్శకము కానగును. మతాతీత ప్రభుత్వమున నీ పరివర్తనము శుభదాయకము. అది ఆచరణమునకే ఏతెంచినచో మరల భారతి సంపూర్ణాధ్యాత్మిక సంస్థానాధిపత్యమును వహించి, పూర్వ పారమార్థిక చైతన్యమును బునరుజ్జీవింపజేసికొని, అలౌకిక సుగుణసందోహ భూషణాలంకృతయై Light will come again from the East 28. తూర్పుదేశము నుండి వెలుగు మరల రాగలదు అను టిండల్ పలుకుల యథార్థముగ నొనర్చును. అట్టి శుభోదయ కాలమునకు నిరీక్షించెదముగాక!

ఈ మహాకాలమునకై వేచియున్న అసంఖ్యాక మేధావంతులలో నొక్కడైన సి. డి. దేశముఖ్ మహోదయుడు, మానవుడు ఎడతెగని కృషితో ప్రాపంచిక పరిస్థితుల నభివృద్ధి గావించుకొనుచున్నాడు. కాని there is hardly any thing to show improvement in his spiritual make up. Such widening gap can spell disaster. The spiritual influence that has made, especially emanated from India, would give mankind a second lease of life 29 అతని పారమార్థిక నిర్మాణమున అభివృద్ధిసూచికమెద్దియు అభావము, ఈ మహదగాధము విపత్సూచికము. పారమార్థిక ప్రభావము

27. *Resolution: The All India Congress Committee' jaipur, 3-11-1963.*

23. Tyndall: The Influence of the East on Religion of R. Heber Newton, p 4

29. Dr. C. D. Deshmukh : Address, Arebindo Society, Jaipur

ముఖ్యముగ భారతావనినుండి జనించిన ఆధ్యాత్మిక తత్త్వమహిమ రెండవ పర్యాయము మానవకోటికి జీవనము నొసంగగలదు అని వచించి యున్నాడు. మరల నటులే అఖిలప్రపంచ బౌద్ధ మహాసంఘాధ్యక్షుడైన యు చాన్ టూన్ క్రొత్తఢిల్లీలో ప్రసంగించుచు, భారతిని కేంద్రప్రస్థానముగ నధిష్ఠింపజేసికొని, సంస్కృతీ పారమార్థిక విషయముల సామాన్యతను సాధించుకొని, ఒక కాలమున ఆసియాఖండమంతయు నుండెననియు, నందుచే I believe that we can re-enliven that culture and revive that spiritual heritage by rising above feelings of national boundaries once again 30 జాతీయ పరిధిభావముల కతీతముగ మరల ఎగసి, ఆ సంస్కృతి పునరుజ్జీవింపజేయ గలమని యును, ఆ పారమార్థిక వారసత్వమును పునరుద్ధరింప జేయగలమనియు నేను విశ్వసించుచున్నాను అని ప్రకటించెను. అపును, Hinduism is a common-wealth of systems and a fellowship of faiths. It represents a synthetic culture that takes hundreds of thousands of people through different paths to the same gole 31 హిందూమత మొక అఖిలసిద్ధాంత సమ్మేళనము ఒక సర్వమతైక సౌభ్రాతృత్వము వివిధమార్గములగమనించు శతసహస్రాధిక మానవుల నొకే గమ్యమునకు గొంపోవు సర్వసమన్వయ సంస్కృతీ ప్రత్యక్ష స్వరూపమని పండిత దేశాయి ప్రస్తుతించియున్నాడు గదా;

---

30. U. Chan Hton: Address, The Mail. 13-1-1959.

31. Sri H. M. Desai: Image Worship, Prabuddha Bharata, 1953, p 166.

పూర్వమేకాక నేడుకూడ in both hemispheres, India played the role of the prime guru 32 ప్రాక్ప్రతీచీఖండముల రెండింట భారతదేశము ముఖ్య గురు స్థానమును అలంకరించియున్నదని ఆచార్య రాఘవన్ యథార్థ వచనములు. కేవల మానసిక విశ్వాసముల దృష్టి గాంచక, but in realising - not believing, but in being and becoming 33 అనుభవించుట, నమ్ముటగాక, జీవించుట రూపొందుటయే భారతీయ పారమార్థిక తత్త్వమాహాత్మ్యము. అందుచే భారతీయులకు భగవంతుడు was no abstraction of attributes, but a living and knowable experience 34 అగ్రాహ్యములైన గుణ సందోహముగాక, సజీవ, గ్రహణసాధ్య అనుభవముగా సులభముగ బరిణమించెను. భారతీయునికి విశ్వము, దాని శక్తులన్నియు భగవద్రూపములు. In the sun and the wind, in the river's endless flow, and the waving of the forest tops, his is sensible of an aweful yet gracious Presence 35 సూర్యునిలో, వాయువులో నదుల నిరంతర ప్రవాహములో గానన శిఖరసంచలనములలో ఆశ్చర్య కరమును దయార్ద్రమును అయిన మూర్తిమత్త్వ మతనికి గోచరమని

32. Prof. V. Raghavan: The expansion of Anc e it Indian Culture The Vedanta Kesari, 1955, p 88.
33. Swami Vivekananda; The Complete Works, Vol. 1, p 11.
34. Prof. K. M. Panikkaf; Religious Movements, Triveni, p 14.
35. Prof. R. Heber Newton: The Influence of the East on Religion, p 10.

హెబర్ న్యూటన్ కొనియాడియున్నాడు. భారతీయుని పారమార్థిక దృష్టిలో నంతయు ఈశ్వరలీల. అంతటను నాతడే ప్రత్యక్షగోచరము. అదియేగదా బాహ్యాంతరముల నీశ్వర సందర్శనము గావించి, అలౌకికా నందమున మగ్నత నొందుట! The basis, the root, of Indian civilization is to find out within, - the soul, the self, in all creation 36 ఆత్మను అంతరమునను, సర్వసృష్టి యందును గాంచుటయే భారతీయసంస్కృతిమూలము, ప్రాతిపదిక అను అతులానందుని వచనము లెంత సమంజసములు! బాహ్యాభ్యం తరములగల సర్వము నాత్మగ కాకపోయినను ఆత్మప్రభావముగ గుర్తించుటయందుగూడ నెంత సమ్మోదము గోచరము! అట్టి సమ్య గ్దృష్టితో సమ్యగ్దర్శనముతో బోల్చిన ప్రాపంచికసైభవము లణుప్రాయ ములుగదా! హేయములన్నను అతిశయోక్తి కానేరదు. అందుచేతనే గదా ఉపనిషత్తులలో విషయనిర్ణయమున బృహదూప్యముదాల్చిన బృహదారణ్యకోపనిషత్తు ఆ పరమానందస్థితిని వర్ణించి 'ఏతస్యై వానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి' (4-3-32) ఆ పరమా నంద లేశముపై నాధారపడి సర్వ భూతజాలములు ఆనందపడుచున్న వని స్పష్టపరచియున్నది.

అట్టి సర్వోత్కృష్ట దృక్పథమును బెంపొందింప దాత్త్విక దృష్టి అవసరము. తాత్త్విక దృష్టియన బ్రతుమముననే సూచింప బడినట్లు యిహపర సాధనయోగ్య విధానమగుచున్నది. డాక్టరు

36. Swami Atulananda: The Vedanta Kesari, 1935, p 142.

సురేంద్రనాథ దాసుగుప్త వాక్యములలో it is a light which we should illuminate all the dark cornors of our being and us realize in this life, the ideals that are set up before by us our thought and wisdom 37 మన వ్యక్తిత్వములో చీకటి మునిగిన మారుమూలలకూడ కాంతివంత మొనరించి, యీ జీవితమునందే మనవిచార బుద్ధులచే మన ముందుంచబడిన ఆదర్శముల బొందింపజేయు జ్యోతియే తాత్త్విక విచారణము. అది కేవలము విశేషసంయుక్తమైన హేతువాదము కాక. to transform ourselves into perfectly wise beings, enjoying freedom from all bondage and the bliss has follows from it 37 పరిపూర్ణ విజ్ఞానవంతులముగ మనము రూపాంతరము నొంది, సర్వబంధములనుండి విముక్తులమై, తృప్తులమగ పరమానందము ననుభవించుట యగును అనియు నాతని వివరణము. అందుచే పండిత రాధాకృష్ణుని గాఢ విశ్వాసమున When philosphy is alive, it cannot be remote from the life of the people 38 తాత్త్వికదృష్టి సజీవమైయున్నచో నది ప్రజానీకము యొక్క జీవన విధానమునకు దూరముగ నుండజాలదు. ఎందుచేత? [illegible] దానికి has for its function the ordering of life and the guidance of action 38 జీవితము సక్రమమొనర్చి, కార్యనిర్వహణమును నడుపు కర్తవ్యము ఉన్నది, అంత రాష్ట్రపతి రాధాకృష్ణుని

---

37. Dr. Surendranath Das Gupta: The Cultural Heritege of India, Vol. 3, Intro. p 24

38. Dr. S. Radhkrishnon: Indian Philosophy, Vol. 2, p 770

వివేకవంత వాక్యములలో It sharpens the consciousness of human imperfection and thus deepens the sense of perfection in us 39 నది మానవ అసంపూర్ణత్వ స్ఫురణమును సునిశిత మొనర్చి, మనలోని పరిశుద్ధతను, సంపూర్ణత్వస్ఫూర్తిని బలవత్తర మొనర్చును.

అందుచే నెవ్విధినైన నేటి ప్రపంచసంక్షోభము నుండి మానవు నుద్ధరింపవలయునన్న, ప్రపంచవ్యాప్త యుద్బోధముచే, దాత్త్విక విచారణమును, తత్ఫలమైన సమరస మత జీవనవిధానమును ప్రచారమొనరించి, ప్రపంచవ్యాప్తముగ కారుమేఘములవలె నల్లుకొనుచున్న నాస్తికవాద పెనుభూతమును, తజ్జనిత అధర్మప్రవృత్తులను పారద్రోలి, ప్రపంచము శాంతిసౌఖ్యముల కాకరముగ రూపొందించ నుద్యుక్తుల మగుదుముగాక। అట్టి కార్యభారనిర్వహణమునకు అనాది కాలమునుండి పారమార్థిక గురుపీఠము నధిష్ఠించియున్న భారతి తన సహజ సంపూర్ణ తాత్త్విక ఔన్నత్య శ్రేష్ఠత్వ, జ్యేష్ఠత్వములతో మేల్కాంచి, ఆధ్యాత్మిక పరంజ్యోతియై సర్వమానవకోటికి అంధకారమును టోద్రోలి ప్రకాశము నొసగి విరాజిల్లుగాక। అందులకై సర్వ భారతీయులు ఏకముఖముగ నుద్యుక్తులై. బీడువారి శుష్కించిన మానవ హృదయముల ఆర్ద్రమొనరించి, ఉజ్జీవింపజేసి, ప్రపంచమున మానవత్వముతోబాటు దేవత్వమును ప్రసాదించి, 'స్వయం తీర్ణః పరాం తారయతి' అను సూత్రమునను సరించి, తాముద్ధరించుకొని, యితరుల

39. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol. 2, p 68

నుద్ధరింప బూనుకొందురుగాక! ఆ మహదాశయ సిద్ధికై పరమాత్ము డాశీర్వదించుగాక।

Believe in India, and in our Indlan faith. Be strong and hopeful and unashamed, and remember that with something to lake, Hindus have immeasurably more to give than any other people in the world 40 భారతిని విశ్వసింపుడు భారతీయతత్త్వమును నమ్ముడు. శక్తివంతులై, ఆశాపూరితులై, తలవంపులేక నిలువుడు. కొలదిగ స్వీకరించినను, ప్రపంచమున నితర జాతులందరికంటె హిందువులు అసంఖ్యాకముగ విషయమును నివ్వగలరను విషయమును సంస్మరింపుడు అను శ్రీ వివేకానంద స్వామి ఉద్బోధ యీ సందర్భమున నెంతయు సముచితము.

అట్టి సర్వతోముఖ పరిపూర్ణ భారతీయ సంస్కృతీ స్వరూపము తానెయై సర్వాకర్షణీయ మూర్తిమత్త్వమున సర్వాదర్శమై, నిత్య నిర్మల శాంతిసమాధి నిమగ్నచిత్తమున భారతీయ పారమార్థికాకాశమున బ్రత్యక్షమగుచుండు మహాదేవుడు శివశంకరమూర్తికి సదా నమోవాకములు. అతని గ్రహించుకొనినచో సంపూర్ణ భారతీయ సంస్కృతిగ్రహణము. అభివ్యక్తము. ఆమహత్తత్త్వమునుగూర్చి గ్రహింప యత్నించెదముగాక।.

---

40. Swami Vivekananda: The Complete Works, Vol. 5, p 232

# వేద - ఆగమములు

'ఆగతం శివవక్త్రాబ్జాద్గతం తు గిరిజాశ్రుతౌ। మతం పశుపతి శ్చైవ తదాగమ మిహోచ్యతే॥' శివముఖాబ్జమునుండి నిర్గళితమై, గిరిజాపార్వతిని శ్రోత్రగత గలదియై, పాశుపతమతమున కాధారమైనది ఆగమము నా బడును. అందుచే నీ ఆగమ సంచయమునకు 'ఆదికర్తా కవిస్సాక్షాత్ శూలపాణిరితి స్మృతః' అను సూక్తిరీతి ఆదికర్త సాక్షాత్ శూలపాణియైన శివుడనియే నిశ్చితార్థము. వైష్ణవమునగూడ ఆగమము పరమ ప్రమాణమగుటచే బూర్వోక్త శ్లోకమున 'మతం పశుపతిశ్చ' అనుటకుగా 'మతం వాసుదేవస్య' అనియు బాఠాంతరము గోచరము. ఇటుల శైవ వైష్ణవములకేగాక, ననాదికాలమున నాద్య శక్తిగూడ ముముక్షువుల నాకర్షించి, బాహ్యాంతరపూజా, ఉపాసనా విధానముల రూపొందించి, ఆ ప్రతిమా, ప్రతీకోపాసనా విధానముల గ్రంథస్థము గావించుటచే నా వాఙ్మయముగూడ నతి ప్రాధాన్యత నార్జించి, ఆగమములు నాబడి, సుప్రసిద్ధములై యొప్పారినవి. ఈ విధముగ త్రిమతముల నాకర్షించి, ఆవరించి, లయింపజేసికొనిన నీ ఆగమశాస్త్రములు 'ఆగమానామ ధర్మశాస్త్రాణ్యేవ' అగ మములన ధర్మశాస్త్రములనెడు ప్రశస్తి గాంచినపై శ్రీనివాస అయ్యంగారి వాక్యములలో The influence of the Agamas or Tantras, as they ars morc familiarly known, on Indian life has been profound 41 తంత్రములని అధికతర సామాన్యముగా తెలియబడు

41. Sri V. T. Srinivasa Iyangar: The Outlines of Hindu Philosophy, p 139-31

ఆగమముల ప్రభావము భారతీయ జీవనముపై అద్భుతము. అంతియ గాక అతని విశ్వాసమున The living Hindu religion of to-day from Cape Comorin to the remotest cornors of Tibet is essentially Tantric 41 కన్యాకుమారి అగ్రమునుండి టిబెట్టులోని మారుమూలలవరకుగల హైందవమత జీవనవిధానము నేడు ప్రధానముగా దంత్రశాస్త్ర నిబద్ధముగనున్నది. అందుచే స్మృతికర్త 'ఆగమోక్తేన విధినా కలౌ దేవాన్ యజేత్సుధీః। కలావాగమ ముల్లంఘ్య యోఽన్య మార్గే ప్రవర్తతే। నతస్య గతిరస్తీతి సత్యం సత్యం న సంశయః॥' బుద్ధిమంతులు కలియుగమున దేవతల ఆగమోక్తముగ నారాధించెదరు. అట్లుకాక ఆగమమును దిరస్కరించి అన్యమార్గగామి అయినవానికి సద్గతి అభావము. నిస్సందేహముగ నిది సత్యము యథార్థము అని మహానిర్వాణతంత్రము ఘంటాపథముగ బోధించినది. ఈ ఆగమ మాహాత్మ్యమున బ్రసిద్ధ అద్వైతాచార్యుడైన శ్రీ శంకర భగవత్పాదాచార్యుడుగూడ శైవము నాశ్రయించి శక్త్యారాధనతత్పరుడై యొప్పారుడుగదా ! దీన దానిబలీయ ప్రాభవము సువ్యక్తము. రామానుజాచార్యుడు వైష్ణవుడై యుండి, పాంచరాత్రాగమ సందోహమును బ్రామాణికముగ గ్రహించి, తన భాష్యాదిరచన కాలమున సపసర సమయముల వాని వాక్యముల గైకొనెను. అటులే ద్వైతమత సంస్థాపకుడైన మధ్వాచార్యుడుగూడ is so much under the Agama influence that his Bhashya is but a string of Agama texts with a few words thrown in here and there to connect them 41

42. Sri V. T. Srinivasa Iyangar: The Outlines of Hindu Philosophy, p 130-31

ఆగమ ప్రభావమున బూర్తిగనుండి, ఆగమ వాక్యములు దన భాష్యమున మూలగ గ్రహించి, అందందు వాని అనుసంధింప నితర వచనముల గైకొనెనని శ్రీనివాస అయ్యంగారి సమ్మతము.

భారతావని ప్రాచీనకాలమునుండి నిగమాగమములు నాద్వయము ప్రభావవంతములై సర్వముముక్షువుల కాధారమై అలంబన యోగ్యమై చెలరారియున్నవి. నిగమ ఆగమ పదములు ఏకార్థ ప్రబోధకములుగ బాహ్యదృష్టికి గానుపించినను, వేదము అపౌరుషేయము నా ప్రఖ్యాతి. అనగా మీమాంసా శాస్త్రము ననుసరించి, వేదము ఈశ్వర ప్రోక్తముగూడకాదు. నిత్యము సార్వకాలీనము. మరల వేదాంతాది శాస్త్రజ్ఞుల సిద్ధాంతమునకు వేదము ఈశ్వరకృతము, లేక సగుణబ్రహ్మదేవుని చతుర్ముఖ నిర్గతము. అదియు జతుర్ముఖ బ్రహ్మ నిర్మితముగాక అతని శ్రుతము అనగా, నాతడు తన ధ్యాననిష్ఠలో నా వేదచతుష్టయమును ఆలకించి, నాల్గు వదనములద్వారమున బహిర్గత మొనర్చియుండుటచే నవి శ్రుతులనాబరగినవి.

కాని ఆగమములు శ్రీ శివుని ముఖతః నిర్గమించి, ఉమాదేవి శ్రవణముల జొచ్చి, పశుపతిభూతనులై రాజిల్లినవి. అందుచేతనే నవి శివముఖమునుండి అగమములగుటచే ఆగమములైనవని తాత్పర్యము. కావున నీ విధముగ వేద ఆగమముల కీదృశ విభిన్నత్వము గోచరము మరియు the practices of Saivism began to develop variations, and this led to the growth of sub-sects at a very early stage. There also grew up a separate literature, highly

esoteric in character, the literature of the Agamas. The history of this growth is lost in obscurity; only the theories of the later age regarding it have come down to us 42 శైవసాధనా విధానములు నానాత్వముల నొంది, ప్రథమదశలలోనే శాఖోపశాఖల అభివృద్ధి కవకాశమొసంగెను. అంత ఆగమశాస్త్రములుగా, సంపూర్తి అంతరంగిక వ్యక్తిత్వమున ప్రత్యేక వాఙ్మయము పెంపొందెను. ఈ జనన పరిణామ చారిత్రము మరుగుపడినదై, కాలాంతర సిద్ధాంతములు మనకు అందియున్నవని ఆచార్య నీలకంఠ శాస్త్రి తాత్పర్యము. దీని ననుసరించి చూచినచో ఆగమశాస్త్రముయొక్క పుట్టు పూర్వోత్తరములు కాలనిర్ణయమున కతీతములని నిశ్చయింప వలసియుండును. అందుచే నివియు వేదములవలె ననాదికాలజనితములై, సమాన ప్రాముఖ్యము నొందియున్నవని స్పష్టము. శివాగమములవలె వేదముగూడ ఈశ్వరకృతముగ సిద్ధాంతులు సమ్మతించుటచే నీ వేదము గూడ శివాగమ శాస్త్రమే అనియు భాష్యకర్త నీలకంఠాచార్యుని సంభాషణము (బ్ర. సూ. భా, 2-2-28). 'వయం తు వేదశివాగమయో ర్భేదం న పశ్యామః। వేదోపి 'శివాగమ' ఇతి వ్యవహారో యుక్తః। తస్య తత్కర్తృత్వాత్।' వేద శివాగమములలోని భేదమును మేము గాంచము, వేదముగూడ శివాగమమని వ్యవహారము యుక్తము దాని కర్తయుగూడ శివుడేగదా అని అతని వాదము. మకుటాగమ

---

42. Sri V. T Srinivasa Iyangar : The Outlines of Hindu Philosophy, P 130-31

42. Prof. K. A. Nilakantha Sastri : The Cultural Heritage of India Vol. 4, p 69

శాస్త్రముగూడ ఆగమ తాత్పర్యమునుగూర్చి ప్రస్తావించి, 'వేదసారం ఇదం తంత్రం' అని వచించియున్నది. శివుడు వైదిక రుద్రుడే కావున The Sadiva Agamas are not opposed to the Vedas 43 శైవాగమము వేదవిరుద్ధము కాదనియు కొందరి తీర్మానము.

మరియు నాగమశాస్త్రము ఉపనిషత్తులవలె బ్రాహ్మణముల పరిణామములనియు, నందుచే వాని సంహితలని వ్యవహరింపనగు ననియు, నాగమ శాస్త్రావలంబకులు కొందరు వానిని సంహితలనియు బిలువజొచ్చిరి, ఈ విధముగ వాని వైదిక సంప్రదాయమునకు జెందిన విగ వారు నిరూపింపజొచ్చిరి. అయినను వేదములకు ఆగమము లకు ప్రసిద్ధ తారతమ్యము స్పష్టము. While the Yagas and the sacrements (Samskaras) were regulated by the Vadic texts, the temple worship was regulated by a special set of texts called the Agamas. Such Agamas were also recognised as forcing a part of the Vedas. Thus the poius Hindu continued the performance of the Yagas and also worshipped in the temples. They became fraternal institutions in the life of the nation 44 వైదిక శాస్త్రములు యజ్ఞయాగాది సంస్కారముల క్రమబద్ధ మొనర్ప ఆగమములనెడి ప్రత్యేక శాస్త్రములు దేవాలయ అర్చనా విధానముల గ్రిమరీతి నిబద్ధము చేసెను. ఆ యాగమములు ఒక వేద భాగమును వ్యక్తము చేయుచున్నట్లు

43, Sri K. Vaidyanadhan : The Indian Express, 26-4-1964
44. Prof. C. Kunhan Raja : Hindu Religion and Hindu Customs. p 11

గణింపబడెను. ఈ విధముగ ముముక్షుపైన హిందూ మతస్థుడు యాగ నిర్వహణము నొకవంకను, ఆలయముల నర్చనాదుల మరియొక దిక్కున నిర్వహించుచున్నాడు. జాతి మనుగడలో నీ రెండును సమవ్యవస్థలుగా నున్నవని ఆచార్య కుహ్నన్ రాజా వివరించి యున్నాడు. అందుచే ప్రస్తుత హిందూమతము is a blending of the two Paths, the Vadic and the Agamic 44 వైదిక ఆగమ మార్గద్వయ సంయుక్త స్వరూపముగా నాతని భావము. ఈ శాస్త్రద్వయమునకు గల వ్యత్యాసమును గుర్తించియున్న నీలకంఠా చార్యుడు తన భాష్యమున వేదాగమములకు సమ ప్రామాణ్యత్వమును ప్రతిపాదించియు, మొత్తమునకు నిగమాగమములు శివప్రోక్తములే యనియు నిశ్చయించి. 'అతశ్శివాగమో ద్వివిధః త్రైవర్ణిక విషయః సర్వ విషయశ్చేతి, వేద స్త్రైవర్ణిక విషయ స్సర్వవిషయశ్చాపరః ఉభయోరేక ఏవ శివ కర్తా' (బ్ర. సూ. భా. 2.2.38) అని సమగ్ర శివాగమము ద్వివిధము త్రివర్ణముల కన్వయించునది మొదటిది. సర్వవర్ణముల వ్యవహరించునది రెండవది. అందు వేదము బ్రాహ్మ క్షత్రియ వైశ్యవర్ణముల కుపయుక్తమనియు, ఆగమము సర్వవర్ణముల కొరకు నేర్పడినదనియు ఈ ఉభయము శివకర్తృత్వ సామాన్యముచే నేకమే అని సమన్వయపరచి యున్నాడు.

కాని కొన్ని పురాణములును మహాభారతముగూడ inclined to treat the Siva Agamas as non - Vedic pseudoscriptures (మోహశాస్త్ర) 45 శైవాగమముల మోహశాస్త్రములుగ భావించి

45. Prof. K. A. Nilakantha Sastri ; The Cultural Heritage of India Vol. p 69.

యున్నవి. ఉన్నతమైన వైదిక మార్గమునకు, వెడమార్గము ద్రొక్కి యున్న ముముక్షువుల దిద్దుటకై శివ కేశవు లిరువురు కృపారూప వ్యూహమును బన్ని, యీ శాస్త్రములకు కర్తలుగ వ్యవహరించి రనియు నందలి భావము కాలిలోని ముల్లును దీయుటకై మరియొక కంటకము నుపయోగించి, ఉభయము ద్రోసివుచ్చుట సామాన్యమైనట్లు, అవైదిక పథముల ద్రొక్కు అజ్ఞుల నుద్ధరింప మోహశాస్త్రములగు శైవాగమముల చిత్రించి, వారి సత్కర్మమార్గములకు నాకర్షించి, పిమ్మట అవైదిక మార్గములతోపాటు, శైవాగమ పరిత్యాగముగూడ నీ పురాణములు వాంఛించుచున్నవి. వాదమునకు సముచితమనిపించినను, అది సత్యదూరమనిపించును. ఆగమ సిద్ధాంతావలంబకులకు యిది విరుద్ధము. అట్టి వాక్యములు కాలాంతర ప్రక్షిప్తములై యుండనోపు.

ఆగమములగూర్చి అభిప్రాయము లెట్లున్నను. what—ever may be the origin of the Agamas, it is clear that they do not insist on sacrificial religion, but support a personal religion in which Vishnu or Siva or Shakti is equated with the Highest Reality. It has also support in the Upanishads 46 ఆగమముల జనకత్వము లెవ్వియైనను, యజ్ఞయాగాది కర్మావలంబనముల నవి శాసింపక, విష్ణు, శివ, శక్తి, దైవతములకు బరమార్థముతో సమస్థాయినొసంగి, ఆ వ్యక్తిగత మతతత్త్వమును అవి సమర్థించుటమాత్రము స్పష్టము, దీనికి ఉపనిషత్తుల ప్రమాణముగూడ గలదు. ఎటులైనను సామాన్యముగ

46. Dr. S. Radhakrishnan: The Brahma Sutra, p 67

నీయాగమశాస్త్రములు దేవాలయముల స్థలనిర్ణయము, విమాన గోపుర భగవత్ప్రతిష్ఠా వివరముల బ్రతిపాదించి శాసించును. అంతే నా అర్చామూర్తులకు నిత్యపూజ ప్రత్యేకపూజావిధాన నిర్ణయములు, తల్లోపములకు దగు ప్రాయశ్చిత్తాదికమును నెరింగించును. శైవా గమములు శ్రుతి చోదితముగ, భస్మ, రుద్రాక్ష, శివలింగధారణ, శివపూజా, శివలింగ ప్రతిష్ఠాపనములను, తత్తత్కర్మానుష్ఠాన, సాధన కుండ, మండప, శివాలయ, శివపూజావిధులను, శాంభవీదీక్షాది సంస్థాన ముల కలుగజేయును. వైష్ణవాగమ సందోహము, వైష్ణవాలయాది వివరముల ప్రతిపాదింప, శాక్తాగమసంచయము శక్తిపూజా ప్రతిష్ఠాది వివిధోపాయముల బ్రస్తావించును.

ఈ విధముగ శివ, కేశవ, శక్త్యాది ప్రఖ్యాత దేవతాశ్రయ విషయసర్వస్వములైన యాగమ శాస్త్రములు ఆ యా విషయముల ముముక్షుకోటికందించి ఆ యా విషయములచే బ్రోత్సహించి, భక్తిభావ ముల గదల్చి, పండిత శ్రీనివాస అయ్యంగారి వాక్యములలో The development of the Agama schools gave a great impetus to Bhakti by concentrating the attention on one Deva and this resulted in an extreme development of Bhakti a devotion that expressed itself in 'an absorbing love, a complete self-surrender 47 ఆగమసిద్ధాంత పరివృద్ధిచే ఒక దేవతపై దృష్టిని నిలిపి, గొప్ప భక్తిభావోద్రేకమును గలిగించినది.

47. Sri V. T. Srinivasa Iyangar: The Outlines of Hindu Philosoph, p 135.

సంపూర్ణ ప్రేమతత్త్వమును, సమగ్ర శరణాగతిని అది అభివ్యక్త మొనరించి, భక్తిభావ విజృంభణమును గలుగజేసెను. ఆ భక్తి అఖిల విశ్వమునకు జననియగు శక్తిని మాతృప్రేమతో నారాధించుటయందు గాని, మాధవ మహాదేవుల దండిగ నర్చించుటయందుగాని ఆ యా మత స్వభావమునననుసరించి, సగుణదైవారాధనమును బురిగొల్పి తీవ్ర భక్తి మార్గముల కవకాశ మొసగెను.

అందుచే గొన్ని ఉపనిషన్నిర్మాణమునకుగూడ నీ ఆగమ విధానము కాలాంతరమున గారణభూతమై పూర్వ ఉపనిషత్తులవలె పరబ్రహ్మ ప్రతిపాదకములుగాక, but are expressly Vaishnava, or Saiva, or Sakta in their tone Probably in many cases, but Agamas under the name of Upanishads Many of the Agamas themselves are called Upanishads though not included in the recognised 108 (48) పూర్తిగ వైష్ణవ, శైవ, శాక్తములుగ విధానమున గోచరించి, బహుళః అనేక సందర్భముల నాగమములే ఉపనిషన్నామముల వ్యవహరించుచున్నవి. అనేక ఆగమములు ప్రామాణికములైన అష్టోత్తరశత ఉపనిషత్తులలో జేర్పబడకపోయినను, ఉపనిషత్తులనియే వాకొనబడుచున్నవి.

అయినను భారతీయ సంస్కృతీ సౌధనిర్మాణమున వాని పాత్ర అమూల్యము, అద్భుతము. అవి చేబట్టిన విషయములు. అసమానములు

48. Sri V. T. Srinivasa Iyangar: The Outlines of Hindu Philosophy, p 129

ఈ విషయమున ఆగమముల నుతించుచు శ్రీనివాస అయ్యంగారు The contents of the Agamas are of un.qual value 49 ఆగమవిషయములు అసమానములు అమూల్యములు అని వాకొనును. ఎట్లు ? Here and there we meet with snatches of high philosophy, subtle psychologieal analysis of ecstatic mental states and valuable descriptions of centres of prana and lines of force in the subtle body 49 సమున్నత తాత్త్విక విచారణము, సమాధ్యవస్థ లోగల సుసూక్ష్మ మానసిక విమర్శనము, ప్రాణ చక్రములయొక్క అమూల్య వివరణము, సూక్ష్మశరీరమున శక్తిరేఖావ్యాఖ్యానములు అందందు మనకు గోచరము అని అతని విశ్వాసము.

ఆగమములు సామాన్యముగ జ్ఞాన, యోగ, క్రియాచర్యలు నాబడు చతుష్పాదములు కలిగియుండును. ఇష్టదైవమునుగూర్చిన పరిజ్ఞానము జ్ఞానము నాబడును. యోగమనగా చిత్తనిరోధమగును. స్థలనిర్ణయాదికమునుండి ఆలయవిగ్రహప్రతిష్ఠాదికమువరకు గల కార్యకలాపమంతయు క్రియయగుచున్నది. అనంతరఆరాధనాపద్ధతి తద్విధులుగూడి చర్యఅని వ్యవహారము. అందుచే సగుణదైవారాధన విషయసర్వస్వమే ఆగమశాస్త్రమన్నను అతిశయోక్తి కానేరదు.

ఈ విధముగ నుపనిషత్తులు నిర్వికార, నిర్గుణ నిరుపాధిక బ్రహ్మవిచారము గావించి, మానవచిత్తమును గ్రహమాన్యయమున

49. Sri V. T. Srinivasa Iyangar: The Outlines of Hindu Philosopqy, P 132

సుసూక్ష్మమొనరించి, ఉత్తమాధికారుల బ్రహ్మస్థితికి మార్గగాములగు చుండ, నీ ఆగమములు సాకార, సగుణ, సోపాధిక బ్రహ్మప్రతిపాదనము గావించి తదుపాసనావిధానముల, ముఖ్యముగ ప్రతిమాప్రతీకారాధనా పద్ధతుల విచారించి, ప్రతిపాదించి, శాసించి, ముముక్షువులచే ననుష్ఠింపజేసి, స్థూలముగ సర్వతోముఖ పారమార్థికాభివృద్ధి గావింపజేసి, వారి చిత్తముల సుసూక్ష్మమొనరింపజేసి, ఉన్నతోపనిషద్విధానమునకు దారిదీయునట్లు జేయుచున్నవని దోచెడిని. అందుచే ఉపనిషదాగమ శాస్త్రద్వయము సర్వవిధాధికారుల కుపయుక్తములై, సర్వవిధాభివృద్ధికి దోహదము గావించుచున్నదనుట సువిదితము. అంతియగాక, వేదభాగము బ్రహ్మనిర్వచనము తద్వివరణము గావింప యత్నింప, నీ ఆగమభాగము సాధన విషయముల బ్రతిపాదించి, సగుణబ్రహ్మప్రాప్తి ప్రథమమనను, నిర్గుణబ్రహ్మానుభూతి పిమ్మటను, పొందువిధానముల బోధించుననియు విజ్ఞుల తాత్పర్యము. అట్లు కాకున వేదమునందు సాధనప్రస్తావనముగాని, ఆగమములందు బ్రహ్మవిషయ ప్రతిపాదనముగాని లేదని యర్థము కానేరదు. కాని ప్రాధాన్యముగ నిగమమైన వేదము బ్రహ్మవిషయమునను, ఆగమము తత్ప్రాపణవిషయమునను ప్రామాణికములనినను ఉచితమే. ఈ విధముగ నీ ఆగమశాస్త్రము సర్వముముక్షుకోటికి, వారేయేసంప్రదాయములవారైనను, ఆ యా మార్గగమ్యముల సాధించు మార్గముల బోధించి, సిద్ధింపజేయునది కాపుట సాధకజీవనముల - ఆగమము అనివార్యముగ స్పష్టము.

ఆగమశాస్త్రములకు తంత్రములనియు నామాంతరము గలదు. తంత్రమన 'తన్యతే విస్తార్యతే అనేన ఇతితంత్రం' రక్షించు జ్ఞానమును వ్యాపింపజేయు శాస్త్రము తంత్రము నాబరగును. 'తనోతి విపులానర్థాన్ తత్త్వమంత్రసమన్వితాన్। త్రాణం చ కురుతే యస్మాత్ తంత్రమిత్యభిధీయతే॥' రక్షించునట్టి మంత్రమును, తత్త్వజ్ఞానమును ప్రచారము చేయునదిగాన తంత్రమనియు నర్థము.

ఈ తంత్రములు నాబడు ఆగమములు అసంఖ్యాకములనెడి ప్రతీతియున్నను, ప్రస్తుతము సుమారు అయిదువందలు ప్రచారమున గలవందురు. అందు శాక్తవిధానమునకు జెందినవి అరువదిఅరుండ, శైవమునకు ముప్పదిరెండుకాగ, వైష్ణవమునకు డెబ్బదిఅయిదు గలవందురు. ఇతరములు బౌద్ధాది యితర మతముల సంబంధించి యున్నవి. అటులే ఉపతంత్రములుగూడ గలవు. వాని యామలములు డామరములు, సంహితలు అనికూడ అందురు. సామాన్యముగ ఆగమములు సాత్త్వికములనియు, యామలములు రాజసికములనియు, డామరములు తామసికములనియు వ్యవహారము. అందు శాక్తమునకు మూడువందల ఇరువదిఏడు పరిగణింపబడ, నూటముప్పదిరెండు శైవమున కన్వయింపబడినవి. రెండువందల అయిదు వైష్ణవమునకు జెందును.

కొందరి పరిగణనమున శైవఆగమములు ఇరువదిఎనిమిది మాత్రము. ఇతరాచార్యులు రచించిన అనేక ప్రకరణగ్రంథములును, బ్రహ్మసూత్రములపై నీలకంఠాచార్యులచే నిర్మింపబడిన

భాష్యము, తమిళదేశమున నాయనారులచే వెలువబడిన అనేక పద్య గద్యాత్మిక రచనములు, మరియు, కాశ్మీరమున ప్రదికసిద్ధాంతమునకు జెందిన వసుగుప్తాచార్యుని నుండి అధినవగుప్తునరకు గల అనేక రచయితల గ్రంథములును, మహారాష్ట్రమున పాశుపత తత్త్వవిమర్శక గ్రంథకోటియు, ఆంధ్ర కర్ణాటకముల వ్యాప్తినున్న లింగాయత అనగా వీరశైవసంబంధ రచనములును శైవసంప్రదాయమునకు ప్రమాణ గ్రంథములు. మొత్తమునకు నీ గ్రంథములన్నియు శైవపరములై రాజిల్లినను, సిద్ధాంత, సాధనభాగముల పరస్పర విభిన్న శాఖలకు సంబంధించియుండుటచే, సర్వ ప్రామాణికముగాక పాక్షికములై యొప్పారినవి. కాని ఆగమములుమాత్రము సర్వ ప్రామాణికములై విరాజిల్లును.

ఆగమ గ్రంథములు ఉపనిషత్తులవలె సంస్కృతభాషా శాస్త్రములుగ నుండుటయేగాక, ద్రావిడ భాషలయందును, మరియు ననేక భారతీయ భాషందును గలవు. టిబెట్ దేశమున నా భాషలయందును, చైనా మొదలగు దేశములందు ఆ యా భాషలయందును సర్వవ్యాప్తముగ గోచరము. పూర్వోక్త 28 ఆగమములకు ఉపాగమగ్రంథము లనేకములుండి మొత్తమునకు సుమారు రెండువందల గ్రంథములుగ రూపొంది, ఆగమిక శైవము నాశైవమతశాఖను గల్పించెనని మజుందారు మహాశయుని తాత్పర్యము. 50

---

50. Prof. R. C. Mazumdar ; The Cultural Heritag of India, Vol, 4, P 51.

సంస్కృత ఆగమములలో ముఖ్యముగ మాలినీవిజయ, స్వచ్ఛంద, విజ్ఞానభైరవ, ఉచ్ఛుష్మభైరవ, ఆనందభైరవ, మృగేంద్ర, మాతంగ, నేత్ర, నైవాస, స్వాయంభువ, రుద్రయామలములు ప్రసిద్ధి గాంచినవి. ఈ శాస్త్రములు వసుగుప్తుని శివసూత్రములం దుపదేశింపబడిన అద్వైతభావముల నిరాసముకొరకుగా నేర్పడినవని యందురు. కాని అటుల భావించుటకంటె నివి అద్వైతభావములుగాక ద్వైతభావముల ప్రతిపాదించునవియై యున్నవి అని వాకొనుట ఉచితము. లేకున్న వసుగుప్తుని శివసూత్రములకు కాలాంతర నిర్మితములుగ నివి వ్యవహరింపబడును. అవి ఆయా సిద్ధాంతుల తాత్పర్యమునకు విరుద్ధము.

ముఖ్యముగ నీ ఆగమ శాస్త్రములన్నియు గొన్ని మత విభిన్నత్వముల గలిగియున్నను, గొన్ని సామాన్యవిషయముల గలిగియున్నవి. అవిసామాన్యముగ ముప్పదియారుతత్త్వముల బోధించును. కపిలాచార్యుని సాంఖ్యసిద్ధాంతమున, 'ప్రకృతేర్మహాన్ తతోఽహంకారః తస్మాద్గుణశ్చ షోడశకః। తస్మాదపి షోడశకాత్ పంచభ్యః పంచభూతాని' (సాం. కా. 22) ప్రకృతినుండి మహన్నామక బుద్ధియు, అద్దాని నుండి అహంకారము, దానినుండి పంచతన్మాత్రలతో ఏకాదశేంద్రియములు, గలసి షోడశకమును జనించినది. పంచతన్మాత్రలనుండి పంచ మహాభూతములు జనితములు నా దెలిపి, ప్రకృతినుండి పృథివీభూతము వరకు ఇరువదినాలుగు తత్త్వముల ప్రతిపాదించియున్నది. 1. ప్రకృతి, 2. బుద్ధి, 3. అహంకారము, 4. శబ్ద, 5. స్పర్శ, 6. రూప, 7. రస,

8. గంధ, 9. శ్రోత్ర, 10. త్వక్, 11. చక్షు, 12. జిహ్వా, 13. ఘ్రాణ, 14. వాక్, 15. పాణి, 16. పాద, 17. పాయు, 18. ఉపస్థ, 19. మనస్సు, 20. ఆకాశ, 21. వాయు, 22. అగ్ని, 23. జల, 24. పృథి వీతత్త్వములు ఇరువదినాలుగు కాపిలముచే వచింపబడియున్నవి. ఇందు ప్రకృతి బుద్ధులకు మధ్య గుణము నా తత్త్వమును జేర్చి, మొత్తమునకు వీని ఇరువదిఅయిదు తత్త్వములుగ రూపొందించి, పురుషుని ఇరువది ఆరవ తత్త్వముగ నీ ఆగమశాస్త్రము గైకొనినది. పురుషతత్త్వమునకు పైన పంచకంచుకము నా పంచ తత్త్వముల 'నియతి, కాల, రాగ, విద్యా, కళా, పంచకమును జేర్చి ముప్పదియొక్క తత్త్వములుగ నిర్మించి, వీనిపై మరల 'మాయా, శుద్ధవిద్యా, ఈశ్వర, సదాశివ, శివతత్త్వము'ల నైదింటిని జేర్చి, ముప్పదియారు తత్త్వముల నీ యాగమశాస్త్రము బోధించుచున్నది.

ఈ ముప్పదియారు తత్త్వములు మూడువిధములుగ విభజింపబడి యున్నవి. అందు ప్రథమము శివతత్త్వము ప్రత్యేకమై సర్వో త్తమస్థాయి వ్యవహరింపబడును. అంత సదాశివ, ఈశ్వర, శుద్ధ విద్యలు మూడును ద్వితీయ స్థానమునొంది, విద్యాతత్త్వము నాబడెను. శేషించిన ముప్పదిరెండు తత్త్వములును, ఆత్మతత్త్వము నాబరగును.

పైవిధముగ సాంఖ్యతత్త్వముల స్వీకరించి, మరియు నేకాదశక మునుజేర్చి, ముప్పదియారు తత్త్వములుగా రూపొందించిన ఆగమ శాస్త్రము శంకరఅద్వైతవాదమునగల ప్రపంచభ్రాంతి సిద్ధాంతమైన

మాయావాదమును, అనగా వివర్తవాదమును సమర్థింపక పరిణామవాద మునే అవలంబించును. అందుచే ఆగమసిద్ధాంతము రామానుజ విశిష్టాద్వైతమునుబోలి, కొన్నివిషయముల దానికి భిన్నమై, కొన్ని సమయముల శివాద్వైతము ప్రఖ్యాతి నార్జించియు, అద్వైత మూలసిద్ధాంతముల నిరసించుచు,తనప్రత్యేక స్థానమును ధారుణి దార్శనిక చారిత్రమున పొందియున్నది.

కావున హిందూశాఖల కన్నింటికి ప్రమాణభూతమయిన శ్రుతితో సహ ఈ యాగమముగూడ సమాన ప్రామాణికతను సాధించి, భారతీయ నిత్యజీవన పద్ధతిలో నొకముఖ్య అనివార్యస్థానము నధి ష్ఠించి విరాజిల్లుచున్నది. శ్రుతిరూప ఉపనిషత్తులు కేవలామ్ముష్మిక ఫలప్రాప్తికి జీవు సుద్యుక్తునిగ నొనరింప, నీ ఆగమ శాస్త్రసందో హము, అభ్యుదయ నిఃశ్రేయససిద్ధికై ముముక్షువునకు దోడ్పడును గదా! అనగా భుక్తి ముక్తి ఫలసిద్ధుల నుభయముల గంటలామలకము గావించి, ఆగమము సర్వాదరణీయమై, అవలంబనీయమై, వ్యాప్తమై, సర్వప్రామాణికమై, ప్రకాశించుటయందాశ్చర్యములేదు. అందుచే నీ శాస్త్రము భారతీయ జీవన విధానములో అనివార్య ఏకత్వమును బొంది, ఆసేతుశీతనగపర్యంతము ముముక్షుకోటి హృదయ పీఠముల నధిష్ఠించి, రాజ్యపాలనము సేయుచున్నది అని వాకొనినను అతిశయోక్తి కానే రదు. భారతీయ సంస్కృతీ వికాసమునకు అది అత్యంతసహకారి యునై రాజిల్లినది. వివరముల నింక ముందు గ్రంథభాగముల గాంచెదముగాక!

# శైవతత్త్వ ప్రాశస్త్యము

## శివతత్త్వము

శ్లో॥ అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రే
సురతరువరశాఖా లేఖినీ పత్రముర్వీ।
లిఖతి యది గృహీత్వా శారదా సార్వకాలం
తదపి తవ గుణానామీశ పారం న యాతి॥ 32

కాటుకకొండ మసి, సముద్రమే సిరాపాత్రము, కల్పవృక్షశాఖ కలము, భూమి పత్రముగ గలిగి, సరస్వతీదేవియే సర్వకాలము నీ గుణవర్ణనము జేసినను సమాప్తి నొందదు అని పుష్పదంతునిచే నుతింపబడియున్న శివమాహాత్మ్యము అవాఙ్మానసగోచరము. ఒకించుక నా తత్త్వమును గ్రహింప యత్నించి; గ్రహణాతీతమగుటచే 'నమస్తే నమస్తే విభో విశ్వమూర్తే, నమస్తే నమస్తే చిదానందమూర్తే। నమస్తే నమస్తే తపోయోగగమ్య, నమస్తే నమస్తే శ్రుతిజ్ఞానగమ్య॥' అనుచు నెత్తి యుచ్చస్వరమున బాడుచు, మైమరచి నిలిచిపోవలయునే గాని, అన్యక్రియాసాధ్యము కాదు. అయినను గొంత ఆ మూర్తిని గ్రహింప యత్నించెదము గాక.

The Saiva philosophy is, in a sense, typical of the ntire range of Hindu thought 51 ఒకరీతిగ శైవసిద్ధాంత

విచారము సంపూర్ణ హిందూభావక్రమమునకు ప్రతిరూపము కాన గును. 'కలౌ దేవో మహేశ్వరః' కలియుగమునకు దేవుడు మహేశ్వరుడని కూర్మపురాణము నుతించునట్లు శివుడు తన రూపగుణ కార్య పరంపరలచే సర్వ జీవకోటి సాక్షించి 'శివో బ్రహ్మా శివో విష్ణు శ్శివో రుద్ర శ్శచీపతిః। శివో వహ్ని ర్యమ శ్చైవ నిఋతి ర్వరుణ స్సవః।' (.28) శివుడే బ్రహ్మ, శివుడే విష్ణువు, శివుడే రుద్రుడుగూడ నై యున్నాడు. ఆ శివుడు ఇంద్రుడును, అగ్నిదేవుడును, యముడును, నిఋతియు, వరుణాది దేవతలునై యున్నాడను 'శివతత్త్వ సుధానిధి' యను స్కాందపురాణాంతర్గత సనత్కుమార సంహితయందుగల గ్రంథముయొక్క వచనములకీతి శివుడు సర్వదేవతాస్వరూపుడగుటయేగాక, నిర్గుణాత్మకమైన ఆ పరబ్రహ్మముగూడ నాతడే యని 'ఏతద్వస్తు పరంబ్రహ్మ తద్వస్తు పరమశ్శివః। శివ ఏవ పరంబ్రహ్మ శాశ్వతః పరమశ్శివః॥' (3.21) శ్లోకతాత్పర్యము వ్యక్తము చేయుచున్నది. అతడట్లు పరంబ్రహ్మమైయుండియు 'ఏక ఏవ మహాదేవశ్చాన్యే దేవా స్తదంశజాః। ఏక ఏవ స్వప్రకృత్యా బహుధాః దృశ్యతే శివః॥' (3 అ) మహాదేవుడు ఏకమైయుండ నితరదేవతలెల్లరు అతని అంశజన్యులు. అతడు ఏకమైయుండియు, స్వీయ మాయాప్రభావమున నానాత్వముగ గోచరమని ఆ గ్రంథ తాత్పర్యము. అందుచేనా శివుడే 'సదాశివో౽క్షరో౽నంత స్సర్వవ్యాపీ నిరంజనః। తేనేదమఖిలం వ్యాప్తం జగత్స్థావరజంగమం॥' (4 అ) అక్షరుడనియు, అనంతుడై సర్వవ్యాపి యనియు, నందుచే నిరంజనుడైన యీతనిచే స్థావర జంగమాత్మక సృష్టి

అంతయు వ్యాపింపబడియున్నదనియు 'సుఖానిధి' ప్రగాఢ విశ్వాసము.

శివశంకర స్వరూపమును మనసా చింతించి, శ్వేతాశ్వతరోపనిషత్తు శివుని సర్వ స్వరూపత్వమును స్మరించి నుతించి, 'త్వం స్త్రీ త్వం పుమానసి త్వం కుమార ఉత వా కుమారీ। త్వం జీర్ణో దండేన వంచసి త్వంజాతో భవసి విశ్వతోముఖః॥' (4.3) నీవు స్త్రీ స్వరూపమవు. పురుషుడవు నీవే. నీవు యువకుడవు, యువతివి నీవు కర్రసూతగగొని వణకు వృద్ధుడవు. నీవు సర్వ స్వరూపుడవునై యున్నావు అని అత్యంత విపులముగ వివరించియున్నది. అటులే తర్వాత శ్లోకమున నా ఉపనిషత్తు శివుని చేతనాచేతన స్వరూపవర్ణనము గావించి తన్మయత నొందియున్నది. పైశ్లోకములు పరమ శివుని సర్వ స్వరూపత్వమును వర్ణింప స్కాందపురాణాంతర్గతమైన, శివగీతయు 'న చ స్త్రీ న పుమానేష న చైవాయం నపుంసకః। అమూర్తః పురుషః పూర్ణో ద్రష్టా సాక్షీ స జీవనః॥" (2-16) అని నిర్గుణత్వ ప్రతిపాదనము గావించెను. సర్వోపనిషత్తులెటు పరమ శివుని గీర్తించియున్నదియు ముందు గ్రంథమున జూచెదముగాక భగవద్గీతా శాస్త్రముగూడ శివప్రస్తావనము గావించి, 'ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః' అనియు స్తుతించియున్నది.

ఈవిధముగ పరాశర పురాణముగూడ 'సర్వకారణమీశానః సాంబః సత్వాదిలక్షణః। న విష్ణు ర్నవిరించిశ్చ న రుద్రో నాపరః పుమాన్॥' సత్వాది లక్షణోపేతుడైన యీశానుడు సాంబశివుడు సర్వ కారణుడగుచున్నాడు. కాని విష్ణు, బ్రహ్మ, రుద్రాదులు కానేరరు అని

వచించి 'శ్రుతయశ్చ పురాణాని భారతాదీని సత్తమ। శివమేవ సదా సాంబం హృది కృత్వా బ్రువంతి హి॥' శివంకరుడైన సాంబశివుని హృది ధరించి, శ్రుతి, స్మృతి, పురాణాదికము, భారతాదులు శివునే దెలుపుచున్నవి అని సర్వశాస్త్ర తాత్పర్యము శివుడగుటయే పక్కాణించు చున్నది.

పరమశివుడే యిట్లు సర్వశాస్త్ర తాత్పర్యముగ గేంద్రమై, విరాజిల్లుటకు గారణమెద్ది ? Siva is beginningless free from defects, (mala) the all-doer, the all-knower, removes from the individual soul (here called Anu from its limitation) the web of bonds that obscure its nature, (మృగేంద్ర అగమ -2. 1) 52 శివుడు అనాదికాలగతుడై నిర్మలత్వమున భాసించి, సర్వకర్తృత్వ, సర్వజ్ఞత్వాది లక్షణోపేతుడై, అణుత్వాది ఉపాధిగతుడైన జీవుని యావరించి, మరుగుపరుచుచున్న పాశవ్యూహమును దొలగించువాడై యున్నాడు. ఈ విషయమును స్పష్టపరుప యత్నించి, సోదరి నివేదితకూడ, He is the self - born, the eternally existent postulate of freedom and purity and light. He is the great teaching soul of things. His function is to destroy ignoran and wherever knowledge is achieved, He is 53 ఆతడు స్వయంభువు అయి, నిత్య సత్యస్వరూపుడై, స్వాతంత్ర్య

52. Sri V. T. Srinivasa Iyangar : The Outlines of Hindu Philosophy, p 152.

53. Sister Nivedita : The Web of Indiau Life, p 203.

నిర్మల జములకు ఆధారప్రతిపాదనము అతడే సర్వోత్తమ ఉప దేష్ట. అజ్ఞాన నిర్మూలనమే అతని కార్యము. ఎక్కడ జ్ఞానము గలిగినను అచ్చట శివుడుండును అని తెలిపియున్నది. శివుడు వైదిక రుద్రుని లక్షణముల గలిగి, సర్వ సంహారకర్తయైయుండియు, పరమ కృపామయుడుగా నుండును. మరియు నతడు తన శాంత్యాది సల్లక్షణములచే పారమార్థిక విషయముల ముముక్షువులలో రేకెత్తించి అనుగ్రహించుచున్నాడు. అంతియగాక A third aspect, perhaps the most ancient, is the ascetic Siva in the posture of Yogin, with an eye in the middle of his forehead, and dressed in skulls, and snakes. His mount is the white bull, Nandin, his essential symbol is linga 54 బహుశః అతి ప్రాచీనమైన మూడవ తత్త్వము; యోగముద్రలో ఫాలమున నేత్రధారియై, కపాల, సర్పముల ధరించియున్న యోగియగు శివుడు. అతనికి వాహనము తెల్లని వృషభము నందీశ్వరుడు, అతని ముఖ్యచిహ్నము లింగము అని ఆచార్య లూయీ రేనో పండితుని చిత్రణము.

అవును, అతడు శ్రీ నీలకంఠాచార్యుడు వచించునట్లు 'నిరస్త సమస్త దోష కళంక నిరతిశయ మంగళాధారత్వం హి శివత్వం' (బ్ర. సూ. భా. 1.1.4) సమస్త దోషములనబడు కళంకములు లేనివాడై, నిరతిశయ మంగళస్వరూపుడు కావుట ఆ పరమశివుడు

54. Prof. Loius Renou : The Civilization of Ancient India, — 22.

కావుట ఆ పరమశివుడు నిత్య నిరంతర యోగముద్రాధరుడై, ధ్యానసమాధిస్థితుడై, ప్రపంచాతీత సంస్థిత చిత్తమున విరాజిల్లు చుండుటయందు ఆశ్చర్యములేదుగదా! అట్టివాని గొల్చిన 'తస్య స్యాత్ఫలం జన్మముక్త్యైవ కరే స్థితా' (15) దాని ఫలితముగ ముక్తి కరతలామలకమని 'శివతత్త్వ సుధానిధి' ప్రతిజ్ఞ చేయుట యందును సంశయ మావంతయు నభావము. అందుచే 'సంసార వ్యాధి భేషజం, అనంతదుఃఖశమనం శివ ఇత్యక్షరద్వయం' (18. అ) సంసారమను వ్యాధికి పరమౌషధమును, అనంతమైన దుఃఖము నుపశమింప జేయునదియు నీ 'శివ' మను అక్షరద్వయ ముగ నా గ్రంథరాజము నొక్కి వక్కాణించినది. అట్టిచో 'శివ ఏకోధ్యేయః శివంకరః సర్వ మన్య త్పరిత్యజ్య' శివుడే ఏకరూపు డైన ధ్యేయ తత్త్వము. అతడు సుఖప్రదాత. అందుచే సర్వే తరమును త్యజించి. ఆతనినే ఆశ్రయింపవలయుననియు అధర్వ శిఖోపనిషత్తు ప్రకటించుచున్నది.

ఆ పరమేశ్వరునియందు భక్తి జనించుట సులభ సాధ్యము కానేరదు. కావున శివగీతయు 'కోటి జన్మార్జితైః పుణ్యైః శివే భక్తిః ప్రజాయతే (1-19-; 14-40) అనేక జన్మలలో నార్జించిన పుణ్యఫలితముగ శివభక్తి జనించును అని వచించినది. అట్టి భక్తియు 'శుద్ధ కైవల్య ముక్తిదం' (1-1) అనియు 'భవదుఃఖస్య భేషజం' (1-1) అనియు నా గ్రంథము కొనియాడియున్నది. పర్యవసాన వాక్యముగ 'బహునాత్ర కిముక్తేన యస్య భక్తిశ్శివే

ధృఢా। మహాపాపోప పాపౌఘకోటిగ్రస్తో విముచ్యతే॥' ( .20) పెక్కుమాటలవలన నేమి ప్రయోజనము? ఎవనికి బరమేశ్వరుని యందు నిశ్చలభక్తి కలుగునో వాడు మహాపాపములచేతను ఉప పాపములచేతను విముక్తుడగును అని కొక్కి వక్కాణించినదె. అంతియగాక 'అన్యాని శైవకర్మాణి కరోతి న కరోతి వా। శివనామ జపేద్యస్తు సర్వథా ముచ్యతే తు సః॥ (16.24) ఇతర శివకర్మల గావించినను, లేకున్నను, శివనామ జపమాత్రము జేసినచో ముక్తి నొందగలడు అని జపమునకు ప్రాధాన్యము నొసంగి యున్నది **శివగీతాశాస్త్రము.**

మరియు, విష్ణువలె జక్రవర్తిత్వము విరాజిల్లుచు, సదా స్త్రీజన ప్రావృతుడై, రాజాంతఃపురవాసియై సామాన్య మానవుల కందుబాటు లేనివాడై యుండునట్లుగాక, పరమశివుడు సదా యోగియై గజ, వ్యాఘ్ర చర్మాంబరధరుడై, స్మశానవాటికల నేకాంతవాసముః నుండి ఎల్లర కందుబాటున నుండుట నాతని కొక అలంకారము మరియు, విష్ణువునకు సామాన్య మానవులకు కష్టము లవగా హనమగుట కష్టమగునేమోగాని, సామాన్య మానవుకంటె సామాన్య జీవనమున, శీతోష్ణములమధ్య వాని కతీతుడై స్థిరసమాధి నిమగ్న చిత్తమున నున్న పరమశివునకు ఆ యా కష్టనిష్ఠురముల బాధ సులభగ్రాహ్యమై, క్షణకాల ప్రార్థనముతో భక్తుని అందదండగ నాతడు నిలుచును. అందుచేత నైయుండనోపు, అతనికి బోళా శంకరుడనియు బ్రతీతి గలదు. అనగా అల్పసంతోషియు నతడగు

చున్నాడు. త్యాగమునగత కష్టమును గ్రహించిన త్యాగి అగుటచే, ముముక్షువులు తన కొరకై యోకించక త్యాగ మొసరించినను, సంతోషమున వారి స్వీకరించు దయాసముద్రుడు శంకరుడని ప్రఖ్యాతి. కాన సర్వేతర దేవతాగణముకంటె నితడు సులభసాధ్యుడగుటచేత 'మహాదేవు' డనియు ప్రశస్తిగాంచెను.

Siva desires that all should know Him It is not merely the ambition of the soul to know God, but it is the desire of the Lord as well 55 ఎల్లరు తన నెరుంగవలయునని శివుని ఆకాంక్ష. జీవుడు భగవంతు నెరుంగ గోరుటమాత్రమేగాక, భగవంతుని కోరికకూడనదియే అని రాష్ట్రపతి, రాధాకృష్ణుని వివరణము, సృష్టి స్థితిశ్చ సంహారో తిరోభావోప్యను గ్రహః' (8. 20) సృష్టి స్థితి, లయ ములను కార్యత్రయమేగాక తిరోభావ అను గ్రహములుగూడ శివలక్షణములలో జెప్పబడి అవి ఆతని సహజధర్మములుగ గుర్తింపబడినవి. అనగా ముముక్షు వెంత తీవ్రముగ నా పరమేశ్వరు బొంద నాతురుడై యుండునో, ఆ పరమేశ్వరుడుగూడ నా భక్తుని తీవ్రతకు సాటియగు తృష్ణతో నా భక్తుని జేరగోరునని అనుగ్రహధర్మముయొక్క అంతరార్థము. మరియొక విశేషమున సృష్టిస్థితిలయ తిరోధానములు బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వరులకు అన్వయింప, సదాశివునకు మాత్రము అనుగ్రహ లక్షణము జెందుననియు విజ్ఞుల నుడి. సదాశివుడు

55. Dr. S. Radhakrishnan : Indian philosophy, Vol. 2, p 728.

సర్వదా కృపామయుడై భక్తుల బ్రోచు దీక్షా యుతచిత్తుడై విరాజిల్లుచుండునని ప్రగాఢ విశ్వాసము. పరమశివునిలో మరియొక ప్రత్యేకతయుగూడ నున్నది. శివదీక్షితుడైనవాడు కర్మవశమున రాగద్వేషాది దుశ్శీలుడై, ప్రాకృత జీవితమును గడుపుచున్నను, దేహపతనానంతరము వాని దోష సంచయ నివారణము గావించి, అనుగ్రహించి, తనలో శివుడు జేర్చుకొనుననియు తజ్ఞుల విశ్వాసము. అటులేగదా కాశీక్షేత్రమున దేహము వీడు సర్వమానవులకు తారక మంత్రోపదేశము గావించుచు, శివుడు వారి తరింపజేయునని వాడుక.

అట్టి అసాధారణ ప్రేమను బ్రదర్శింప నొక్క పరమ శివునకే సాధ్యము. Siva is full of grace and is waiting through successive aeons to recieve the recognition of the soul and his absorbing love. A personal tie binds the soul to God 55 శివుడు అనుగ్రహపూర్ణుడై, జీవునినుండి నైశ్రివనీయ ప్రేమను, ఆతని సంస్తుతిని బొంద ననేక యుగముల నుండి నిరీక్షించుచున్నాడు. కాన బరమశివుడు సర్వాకర్షణీయ దివ్యమూర్తియై, భక్తుని కష్టముల గ్రహించి బ్రోచు కరుణా స్వరూపుడై వెలుగొందుట నాతడు సర్వవిధముల మహాదేవుడనియు సర్వేశ్వరుడనియు సంస్తుతిపాత్రుడగుటయందాశ్చర్యములేదు,

మరియు నాతని స్వరూపముగూడ విశిష్టమై అసంఖ్యాక శిష్టత్వములతో గూడియుండుటయు గాంచనగును. పూర్వపచనము

55. Dr. S. Radhakrishnan : Indian philosophy, Vol. 2. p 728.

రీతి నా ధ్యాననిష్ఠుడైయున్న శంకరమూర్తి, అభ్యుదయ నిఃశ్రేయసిద్ధికై అవసరమగు క్రియాధ్యాన ప్రవృత్తుల బోధించును. జీవితమన యీ రెండు తత్త్వముల మేలికలయికగదా! ఆ పరమరహస్యమును తనలో మూర్తీభవింపజేసికొని, మనకు అతడు ప్రత్యక్షమగు చున్నాడు. జీవితాదర్శము అతని ప్రత్యక్షమూర్తిలో ద్యోతకమగు చున్నది. జీవిత నిత్యవిభిన్నత్వములలో, పోరాటములకు, అసంఖ్యాక సంక్షోభములకు మధ్యనున్నను, అతీంద్రియ ప్రవృత్తులలో, అతి లౌకికదృష్టులతో మేరువురీతి నిశ్చలముగా మానవుడు మెలగ నవకాశమును సాధ్యత్వమును మహాదేవుడు చాటి, తానే తదనుగుణ నిదర్శన రూపుడై యుండుటయు సర్వానుభవసిద్ధము.

The divine human representation of Siva is based on a grand conception. 56 శివుని దివ్య మానవాకృతి యొక మహత్తర భావముపై నాధారపడియున్నది. ఎట్లు ? అతనికి త్రిశూల మొకటి గలదు. దానితో శరీరత్రయముల అహంకార రూపమున నున్న త్రిపురాసురుని అతడు సంహరించెను. త్రిశూలమునకు వైరాగ్య, జ్ఞాన, సమాధులు అంగములు. అతనికి జ్ఞాననేత్రముగ మూడవ కన్ను గలదు. ఈ నేత్రత్రయ సహాయమున నతడు భూత, భవిష్య, ద్వర్తమానముల గ్రహించి సర్వజ్ఞుడగుచున్నాడు. అత డీవిశ్వమున, సత్య, శుద్ధ, దయా, ధర్మములు నాబరగు చతుష్పాదములు గల ధర్మదేవతయగు శుక్ల వృషభముపై బర్యటించుచుండును.

56. The Editor. The Vedanta Kesari. 1958, p 162.

కాలమును శశిరూపముగ ధరించి, కాలధరుడుగూడ నగుచున్నాడు. సర్వవిభేదముల నడచి, ఏకత్వమున సర్వమును లయమొనరించిన భస్మమును దేహముపై నాత డలంకరించెను. నానాత్వమును లీనము గావించుచు అద్వైతమున స్థిరుడై యున్న వాడుగదా శంకరుడు ! అతని హస్తభూషణముగ నున్న లేడి వేదములకు చిహ్నము. దాని పాదచతుష్టయమే వేదచతుష్టయము. వేదముల కధినాథుడు శివుడేయని తాత్పర్యము. ధర్మరక్షకుడు కావుటచే. ధర్మదేవత నే వృషభాకృతి వాహనముగ స్వీకరించెను.

అంతియగాక, నంది ధర్మమునకేగాక, నిత్యతృప్తిరూప ఆనందమునకు చిహ్నము. అందుచే ప్రాపంచిక విషయముల దృష్టుడై, విముఖుడై, శివాభిముఖముగ భక్తుడు శరణాగతి నొందినచో శివసాక్షాత్కారము లభ్యము అని అర్థము. ఆ నంది శుద్ధ శ్వేతవర్ణము గలది. లోహిత, శుక్ల, కృష్ణవర్ణములు రాజస, సాత్విక తామసగుణవర్ణములగుటచే శివసన్నిధాన మహాభాగ్యము గోరు భక్తుడు, రాజస, తామసముల బోనాడి, సత్త్వగుణాభివృద్ధిని గాంచినగాని సాధ్యముగాదని దీనరహస్యము. చంద్రునిధరించి, చంద్రలక్షణములైన జ్ఞానసుధలను శివుడు భక్తుల కొసంగును. అతడు గజచర్మధారి. గజము మాంద్యమును తమస్సును సూచించును. అనగా శివుడు తమోగుణరూప మాంద్యమును స్వాధీనపరచుకొని, దాని కతీతమున వ్యవహరించువాడు. త్రికాలములు నాబరగు త్రిశూలధారియై కాలమును స్వాధీనము జేసినవాడు అనియు తాత్పర్యము. ఢమరుకను ధరించి, నాదబ్రహ్మము తానేయనియు,

నందుచే సర్వసృష్టి కాధారము తానేయనియు శివుడు సూచించు చున్నాడు. ఇన్నియున్నను సర్వవిషయ విదూరచిత్తుడు కావుటచే సర్వాతీతుడై దిగంబరుడై యలరారుచున్నాడు అనియు గొందరి భావము.

శివానంద సరస్వతీ స్వామి తాత్పర్యమున శివుని త్రిశూలము త్రిగుణసూచికమై, ఆగుణత్రయముచే శివుడు సార్వభౌముడై విశ్వ పాలనము గావించుచున్నాడు. శబ్దబ్రహ్మ మనబడు ఓంకారరూప ఢమరుకను ధరించి, అతడే శబ్దబ్రహ్మమనియు, సర్వభాషాకర్త యనియు వ్యక్తపరచును. మనస్సున కధిష్ఠానమగు చంద్రుని ధరించి, తా స్వాధీన చిత్తుడనియు, గంగను ధరించి అమృత స్వరూపుడనియు, అహంకార వర్జితుడని సూచింప గజచర్మమును మేన ధరించియు, వ్యాఘ్రచర్మాసనముచే విషయ జయత్వమును శివుడు జూపించును. చంచలత్వము బోద్రోలినట్లు లేడిని గరమున ధరించెను. తన వివేక, నిత్యత్వముల నెరుకపరుప సర్పాలంకారముల స్వీకరించెను. నంది ప్రణవమును సూచింప, అద్వైతమును లింగము తెలుపుచున్నది. 57

ఆర్యులు ప్రథమతః హిమాలయముల బ్రవేశించి, 'అందు అవలోకించిన దృశ్యములచే నాకర్షితులై ఎట్లు మహాదేవుని జిత్రించు కొనినదియు సోదరి నివేదిత కన్య ఊహించికొని రచించినది.

57. Swami Sivananda Saraswati : Lord Siva and His Worship, p 36.

భస్మమును ధరించి ధ్యాననిమగ్నత నున్న యోగిపుంగవునిచందము ఆర్యులకు హిమనగము గోచరించినదనియు They are like - a great monk, clothed in ashes. lost in his meditation, silent, and alone 58 ఏకాంతమున నిశ్శబ్దమున ధ్యాననిమగ్నత భస్మధారియైన గొప్ప సన్న్యాసివలె అవి కనుపించెను. ఈ భావమున కేగుదెంచి, the Hindu mind began to work out all sorts of accessories and symbols, in which sometimes the idea of flame, sometimes of mountain, sometimes of hermit is uppermost - all contributing to the complicated picture of Siva, the Great God 58 కొన్నివేళల అగ్ని భావము, కొన్నిసమయముల పర్వతము, మరికొన్నికాలముల యోగియు, చిత్తమున దోప తదనుగుణ చిహ్నములను ఉపకరణములను హిందూ మేధాశక్తి చిత్రించుకొనుచు; నివియన్నియుగలిసి మహాదేవుడైన శివుని స్వరూపమును సమాప్తినొందించెను. ఎట్లన, The wood was borne to the sacrifice on a bull; Siva possesses an old bull, on which he rides 58 యాగమునకు సమిధల వృషభముపై గొంపోవుదురు. తా నెక్కుటకు వాహనముగ శివునకు ముసలి ఎద్దుగలదు. పర్వతములపై చంద్రుడు ప్రకాశించును. so He bears on His forehead the new moon 58 అట్లు పూర్ణచంద్రుని నుదుట ధరించును. శివుని ఆకారము ఏ అగ్నిబోవోల్చి. Looking closer at the flame, however, one thing was clear It was white, but it had a blue throat - we see it even when we light a

58. Sister Nivedita : The web of Indian Life, p 198-200.

match ! and in order to bestow a blue throat upon Siva the following story arose 58 అగ్నిని పరిశీలించినచో నొక విషయము స్పష్టము. అది శ్వేతవర్ణము, కాని దానికి నీల కంఠము గలదు. అగ్గిపుల్లను వెలిగించినను మనము గాంచగలము. అట్లు శివునకు నీలకంఠమును గలిగింప దేవాసురగణములు క్షీర సాగరమును మథించుట, అందు హాలాహలము జనించుట, దాని శంకరుడు మ్రింగుట మొదలగు గాథ ఏర్పడినది. ఆ ఘట్టమును భావించుచు నివేదిత సోదరి, He smiled gently at their dilemma and their fear, and stooping down He put His hand into the waves, and bade the poison flow into the hollow of His palm. Then He drank it, willing to die, in order to save the world 58 అతడు దేవతల భయసంశయములకు మందహాస మొనరించి, ముందునకు వంగి, తరంగములలోనికి హస్తమునుంచి, తనకరతలమున ప్రవేశింప నా విషమున కాన నిడెను. అంత బ్రహ్మాండమునుద్ధరింప, మరణమునకు సంసిద్ధుడై అతడు దాని త్రాగెను. But that which would have have been enough to destroy all created beings. was only enough to stain His throat, hence He bears there a patch of blue for ever 59 కాని సృష్టినంతటిని నశింపజేయగల ఆ విషము అతని కంఠమున నొక మచ్చనుమాత్రము చేయగలిగెను. అందుచే నచట అతనికి నీలవర్ణమగు మచ్చ నిత్యముగ నుండిపోయినది అని సోదరి

58. Sister Nivedita : The Web of Indian Life, p 198-200.
59. Sister Nivedita : The Web of Indian Life, p 202.

చిత్రించియున్నది. Sometimes He is entirely a personification of the Himalayas, as when the Milky - Way is made to fall upon His head, wander round and round among the tangled locks, and issue from them at last as the Ganges [59] ఒక్కొక్క సమయమున నాతడు సంపూర్ణ హిమాలయమూర్తి యగుచుండ, నాకసమందున్న తెల్లని నక్షత్రవీధి ఆతని శిరమున దుమికి, ఆతని జటాజూటమున మెలికలు దిరిగి తిరిగి, గంగానదివలె చివరకు బహిర్గతము అగుచున్నది.

అతని కృప అపారము. అతడు సౌమ్యత కవతారము. శరణుబొందిన వారి నేరిని అతడు నిరాకరింపనొల్లడు. ప్రపంచమున త్రోసివేయబడిన అదృష్టహీనుల కతడు శరణ్యము. సర్వులచే ద్వేషింపబడు సర్పాదికము కైలాసగిరి చేర, మహాదేవుడు వానికి నెలవు నొసంగెను. అటులే భూతగణములు అతని ఆశ్రయించి శరణువొందినవి. అతడు స్వచ్ఛమైన తెల్లని కాంతిగల వదనము కలవాడు. అందుచే నెల్లరకు సత్త్వాది సద్గుణసంపద నార్జింప నాతని యువ్వోధ.

ఈ విధముగ శివ వర్ణనము గావించి, ఆనందించిన సోదరి నివేదిత కన్య To them there is nothing in the world so strong and pure and all merciful as their Great God, and the books and poems of Hindus are very few in which he is not referred to with this passionate worship [59] హిందువులకు నీ ప్రపంచమున దమ మహాదేవునితో

---

59. Sister Nivedita : The Web of Indian Life, p 202.

బోల్చినగు కపణాలపు పరిశుద్ధుడు, బలపరాక్రమవంతుడు ఎవరను అభావము త్రిపురశక్తి ప్రపత్తులతో నాతడు సూచింపబడని గ్రంథము గాని స్తోత్రము గాని హిందువులకు శూన్యము అని వాకొనినది. అప్పను, ఆ యున్మత్తశేఖరుడైన పరమశివుని భావించి, యున్మత్త బొందనివారెవ్వరు !

శివాలయమున ప్రవేశింపగనే ఎదుట బలిపీఠ, నందీశ్వరులు కనుపించెదరు. మన అహంకార మమకారములు నా బలిపీఠమున నర్పించి, పాశవిముక్తి నొంది, నందీశ్వరునివలె పశుత్వమును వ్యక్తిత్వమును బాసి, పశుపతియైన శంకరునకు సర్వార్పణము గావించుకొన నాదేశముగ రహస్యార్థము.

ఆగమశాస్త్రముల ననుసరించి, శివుని రూపకల్పనము బహుధా గోచరము. అందు ముఖ్యమైనవి అనుగ్రహమూర్తి, యోగమూర్తి, శాంతమూర్తి, నృత్యమూర్తి, సంహారమూర్తులుగ పంచవిధములు. ఈ మూర్తుల నందందు ప్రతిష్ఠించి, ఆలయముల నర్చించుచుందురు. కాని ఈశ్వర రూపము లింగాకారమే ప్రశస్తము. ఆ లింగతత్త్వ రహస్యమును గ్రంథాంతరమున గాంచగలము.

## శైవ మతము

The worship of Siva, and Sakti may be regarded as the oldest form of Indian theistic religion 60 శివశక్తి

60. Prof. R. C. Mazumdar ; The Cultural Heritage of India, Vol 4, p 32.

ఆరాధనము భారతీయ సగుణదైవార్చనా విధానములలో అతి ప్రాచీనమైనదిగ బరిగణింపబడును. ఇదే భావమును విల్సన్ పండితుడు గూడ వ్రాసియున్నాడు. The worship of Siva continues, in fact, to be what it appears to have been from a remote period, the religion of the Brahmans Sambhu is declared by Manu to be the presiding deity of the Brahmanical order and the greater the number of them, particularly those who practiee the rites of the Vedas, or who profess the study of the Sastras, receive Siva as their tutelary deity, wear his insignia, and worship the linga either in temples. The example of thc Brahmans and the practice of the ages maintain the veneration universally offered to the type of Siva [61] బ్రాహ్మణమతకాలము నాబడు అతి ప్రాచీనకాలము నుండి సత్యమున శైవారాధనము కలదు. శంభువు బ్రాహ్మణ మతస్థులకు ఆరాధ్య దైవముగను ముఖ్యముగ వైదికకర్మ నిష్ఠులును, శాస్త్రాధ్యయన పరులును ఆ శివుని నిష్టదైవముగ స్వీకరించి, అతని చిహ్నముల ధరించి, దేవాలయాదులలో లింగార్చనము గావించెదరని మనువు ప్రకటించెను. బ్రాహ్మణుల ఆదర్శము, ప్రాచీనకాలగత ఆచారము యీ శివారాధన విధానమును బోషించినవి అని విల్సను రచించెను. అందుచే విజ్ఞుల తాత్పర్యమున నీ శైవము అతి ప్రాచీనమని వోచును. ఆ విషయము నింకను ముందు గ్రంథమున గాంచెదముగాక ।

ఇట్లు దేశకాలపరివ్యాప్తమైన సిద్ధాంతము భక్తకోటి నాకర్షించి,

61. H. H. Wilson : Hindu Religions, p 125

బార్నెటు అభిప్రాయమున No cult in the world has produced a richer devotional literature, or one more instinct with brilliance of imagination, fervour of feeling and grace of expression 62 ఇంతకంటె అధికతర భావవిజృంభణము, భక్తి, మృదుమధుర శైలితోగూడిన భక్తివాఙ్మయమును ప్రపంచమున నే యితర మతమైనను నిర్మించియుండలేదు. ఆ మతరచనము లతులములై దక్షిణాపథమున ద్రవిడ వేదమనిగూడ కీర్తిగాంచుట గానందగును. అట్లు యీ శైవము ప్రపంచ ముముక్షుకోటిని సర్వకాలముల ను త్తేజిత మొనర్చుటకు దగు సాహిత్యమును నిర్మించి మహోపకారము గావించియున్నది. ఈ శైవ తాత్పర్యగ్రహణమునకు జ్ఞానము గలుగుననియు 'జ్ఞానోత్పత్తేస్తు కారణంవినా యేన శివజ్ఞానం న జాయేత కథంచన' (యజ్ఞ వైభవఖండ - 18 అ) అట్టి జ్ఞాన ముత్పన్నమయినగాని శివసంబంధ జ్ఞానము కలుగనేరదని సూతసంహిత వక్కాణించినది.

అటులే శివసాక్షాత్కార సాధకునకు 'ఆగమార్థను సంధాయీ రాగమోహాదివర్జితః। ధ్యానజ్ఞానసమాయుక్త' 'ఆరాధ్యతే స్తేవ కథ్యతే' ఆగమార్థము దెలిసినవాడు, రాగమోహాదికముల ద్రోసినవాడు, ధ్యాన జ్ఞాన సంలగ్నచిత్తుడు, ఆరాధ్యు డనబరగుననుచు అధికార నిర్ణయము గావింపబడియున్నది. అట్టి శివసాక్షాత్కారవంతుడే అత్యాశ్రమి అనియు అతని ఆచరణమే పాశుపతశైవమనియు మహాభారత

62. Dr. Barnett : The Heart of India, p 82

మోక్షధర్మ పర్వమునందు నిరూపితము అనియు, నిటులే అత్యాశ్రమి శబ్దము పాశుపతదీక్షితుని కన్వయమనియు శైవుల తాత్పర్యము. వారి అభిప్రాయమున 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' (ముండకము) శ్రుతియు నత్యాశ్రమియై, బ్రహ్మవిద్యోపదేష్టయగు పాశుపత వ్రతునే సూచించుననియు, అటులే మాండూక్యశ్రుతి 'ప్రపంచోప శమం శాంతం శివమద్వైతం మన్యంతే స అత్మా స విజ్ఞేయః' (7) అనుచోట శివునే స్మరించుచున్నది. 'కారణం తు ధ్యేయః సర్వైశ్వర్యసంపన్నః సర్వేశ్వరః శంభు' అని అథర్వశిఖో పనిషత్తు, 'హిరణ్యనిధి పద్వైతం చతుర్థం బ్రహ్మవిష్ణురుద్రాతీతం' అని భస్మజాబాలోపనిషత్తుగూడ సర్వాతీతమైన శంకరు బ్రతి పాదించుచున్నట్లు నమ్మకము. ఉపనిషత్తులు ఎట్లు శివునిగూర్చి తెలుపుచున్నవో ముందు చూచెదముగాక !

నీలకంఠాచార్య నిర్ణయమున 'అజ్ఞానప్రభవం దుఃఖం జ్ఞానం తస్య నివర్తకం। సర్వవేదాంత వాక్యానాం శ్రవణం తత్ప్రవర్తకం॥' (బ్ర. సూ. భా. 1.1.4) దుఃఖము అవిద్యా జన్యము. అది జ్ఞాన ముచే నివర్తింపబడును. వేదాంతవాక్య శ్రవణముచే జ్ఞానము ప్రవర్తించును అను ఉపనిషత్సూత్రమును పఠించి, 'శ్రవణంనామ వాక్యానాం వైదికానాం పరాత్పరే। ఉపక్రమాదిభిర్లింగైః శివే తాత్పర్యనిర్ణయః॥' ఉపక్రమాది షడ్లింగములచే వైదికవాక్యములను బరాత్పరుడైన శివపరముగా నన్వయించుటయే శ్రవణము నాబరగును అని నిశ్చయించెను. వేదతాత్పర్యము శివపరమని అతని గాథ

విశ్వాసము. అందుచే శ్రవణ, మనన, నిదిధ్యాసలద్వారమున శివ సాయుజ్యమును బొందుట మానవ కర్తవ్యమని ఆ యాచార్యవర్యుని తాత్పర్యము. ఈ యర్థమునే 'అతః శివ ఏవ పరంబ్రహ్మ మోక్షకామైర్ధ్యాతవ్యో జ్ఞాతవ్యశ్చేతి' (బ్ర.సూ.భా 1.1.4) అందుచే శివుడే పరబ్రహ్మము. మోక్షకాములచే శివుడే ధ్యానింపదగినవాడు గ్రహింపబడవలసినవాడు అని ఘంటాపథముగా పలికియున్నాడు.

## శంకరాచార్యుడు - శైవము

పైవిధముగ సర్వ శాస్త్రసమ్మతమును, అఖిలశాస్త్ర ప్రతిపాదితము నాబరగు నీ శైవము భారతమునగల ముఖ్యాచార్యవర్యులచేగూడ అనుష్ఠింపబడినట్లు స్పష్టము. అద్వైతసిద్ధాంత ప్రబోధకాచార్యుడైన శంకర భగవత్పాదుడు మనసా శైవమునే అనుసరించెను. శృంగేరి సంప్రదాయమువారు రేవణసిద్ధ సంప్రదాయము ననుసరించెదరు. రేవణసిద్ధుడు ప్రముఖ శివాచార్యుడు. అతడు శంకరుని జ్ఞానవైరాగ్యాది లక్షణముల కానందించి, చంద్రమౌళీశ్వర స్ఫటిక లింగమును బహూకరించినట్లు చరిత్ర. అందుచేతనే యగును, నేటికిని శృంగేరీ శంకరపీఠ సంప్రదాయమువారు వైష్ణవము ననుసరింపక శివపూజాదుల నాచరించెదరని కృష్ణశాస్త్రి వాదము. 63 ఈ విధముగ అద్వైత మతాచార్యుడైన శంకరునకు హృదయతః శివభక్తి యుండి, శైవ పూజావిధానమును ప్రోద్బలము గావించి, పీఠమున

63. Rao Bahadur H. Krishna Sastri : Introduction of the Sivatatva Ratnakara.

దన అనుయాయులయందు పరమ శివారాధనము నవలంబింప జేసెను. అందుచే స్మార్తమతము నా సంప్రదాయమువారు, శంకరాను చరులై శైవతత్త్వావలంబకులై యొప్పారిరి. దాని ననుసరించియే ఆ పీఠసన్న్యాసులును, తదనుచరులును, శివపంచాక్షరీ మంత్ర జపానుష్ఠానపరులై, భస్మరుద్రాక్ష మాలాలంకృతులై యలరారుట గమనార్హము. కావున స్మార్తులుగూడ దదాలంబనమునే గావించు చున్నారు అని శైవాచార్యుల వాదము.

కాని శంకరపీఠ సన్న్యాసులలో నొక ప్రత్యేకస్థితి ద్యోతకము. రుద్రాక్ష భస్మధారులై పంచాక్షరీ జపము నవలంబించియు, వారు నారాయణాష్టాక్షరీ సంస్మరణమును గావించుచు, శ్రీచక్రాదిక శాక్త ఉపాసనావిధుల ననుష్ఠించుచు, తత్త్వమస్యాది మహావాక్య శ్రవణాదికముచే జ్ఞానసముపార్జనము గావించుచు, శివ, గణపతి, విష్ణు, సూర్య, శక్తులు నా బంచాయతన పూజావిధానమును నెలకొల్పి, సర్వమత సామరస్యమును ఆ సన్న్యాసులు ప్రదర్శించిరని దోచును. అందుచే నా సాంప్రదాయిక సన్న్యాసుల, ప్రసిద్ధములైన ఏ మతమునకు అన్వయింప సాధ్యముకాదేమో! అయినను విష్ణుమూర్తి తదవతారముల నర్చించుటకంటె నా సన్న్యాసులు శివు నారాధించుట యందు అభిలాష నెక్కువ ప్రదర్శించుచుండుట విదితము.

శంకరునకు బూర్వము భాష్యకర్తయైన బోధాయన మహర్షియు, దన బ్రహ్మసూత్ర భాష్యమును శైవపరముగ నిర్మించి, శివవిశిష్టా ద్వైతమును బ్రతిపాదించెననియు శైవుల విశ్వాసము. ప్రాచీన

జైనాచార్యుడైన హరిభద్రుని తాత్పర్యమున, న్యాయ వైశేషిక దర్శనకర్తలు, గౌతమ కణాదులు, శైవమతావలంబకులనబరగిరి వారు శివుని తపస్సుచే మెప్పించి శివానుగ్రహమున దమ దర్శనముల నిర్మించిరని వైశేషిక భాష్యకర్త ప్రశస్తపాదుని భావము.

## శివుడు - మహాదేవుడు

పురాణయుగమున, ప్రఖ్యాత శివోపాసకులు రాక్షసులనబరగు అతీంద్రియ అమమానుషశక్తులలో ప్రబలము. శివధ్యానతత్పరులై తీవ్రవతపోదీక్షాదక్షులై శివుని మెప్పించి, అసమాన వరముల బొంది, అజేయ శక్తిసంపన్నులై నాటి ప్రపంచమును గదలించు శక్తి సామర్థ్యముల గలవారుగ రూపొందిరి. అది యంతయు శివభక్తి మహిమా విశేషమే.

మరియు బురాణముల బరిశీలించినచో, శ్రీమహావిష్ణువు అనేక అవతారముల దాల్చుచు, దా శివభక్తుడై శివ ప్రతిష్ఠాదుల గావించుచు, శైవమతాచార్యుడై విలసిల్లెను. అందుచేత శైవమునకు గూడ శివాచార్యుల పరంపరలో నారాయణునకు ప్రముఖస్థానము గలదు. ఈ విషయము భాగవత, హరివంశాది పురాణముల ప్రస్ఫుటమని శైవుల విశ్వాసము. శివుడు మానవ ప్రపంచమున నెవ్విధమైన అవతారముల నెత్తక, భక్తుల నెల్లవిధముల రక్షించుచు, దేవతలకుగూడ వండదండగ వారి కష్టకాలముల నిలువబడుట పురాణము లందును స్పష్టము. శ్రీమహావిష్ణువు మత్స్య కూర్మ

వరాహాది యవతారముల నెత్తి, కర్తవ్యనిర్వహణానంతరముగూడ దన యమరత్వమును విస్మరించి, తన అవతార సంబంధ బాంధవ్యముల మునింగియుండ, సదాశివుడే అతని నిజతత్త్వమును బోధపరచి, దేవత్వమునకు ఉద్ధరించియున్న గాథలు పురాణములలో వ్యక్తము. అమృత సముపార్జనమునకై దేవాసురులు క్షీరాబ్ధి మథనము గావింప, నందు వెలువడిన ప్రచండ హాలాహలమునకు విష్ణ్వాది దేవతలు భయభ్రాంతులై శివు నాశ్రయింప, నా విషమును మ్రింగి, తన గళమున నుంచుటచేగదా గరళకంఠుడనియు నీలకంఠుడనియు, నామము ప్రఖ్యాతమయ్యెను. ఈ విధముగ మహాదేవుడు, సత్యముగ సర్వదేవతల కధిదేవుడై, సదా తన నిజతత్త్వమును విస్మరింపని సహజస్థితినుండి, సామాన్య మానవులమాత్రమేగాక, సామాన్య దేవతలనేగాక, శ్రీమహావిష్ణువునుగూడ గష్టములనుండి యుద్ధరించినట్లు అసంఖ్యాక గాథాలహరి బోధించుచున్నది. అందు చేతనే అతడు శాస్త్రముల మహాదేవుడనియు, ఉపనిషదాది వైదిక గ్రంథముల మహేశ్వరుడు, సర్వేశ్వరుడు మొదలుగాగల సర్వోత్తమ పదజాలమున సంబోధింపబడియున్నాడు. అతని మహిమ వర్ణనాతీతముగదా!

## శైవము - విశ్వవ్యాప్తము

కావున నీ మహేశ్వరుని అర్చావిధానము ఒక భరతఖండమునమాత్రము వ్యాపించి యుండజాలక, రాధాకృష్ణ పండితుని వాక్యములలో The devotion of the Saivas is more virile

and masculine than that of the Vaishnavas 64 వైష్ణవుల కంటెను శైవుల భక్తి అధికతర శక్తివంతము పౌరుషమునై యుండుటచే దేశదేశాంతరములగూడ వ్యాపించెను. The towering spires of some of these majestic temples bear testimony to the pervasive and beneficent influence of Saivism which is one of those Hindu cults that have transformed the lives of large sections, not only of the Indian people, but also of others such as the inhabitants of Java and Bali, Champa and Combodia 65 భారతీయ ప్రజానీకమున గల అధిక సంఖ్యాకుల జీవితములనేగాక, జావా, బలి, చంప, కంబోడియా దేశములగల జనసందోహములగూడ రూపాంతర మొనరించిన హిందూమతశాఖలలో నొక్కటగు శైవము యొక్క సర్వవ్యాప్త ఉపయుక్త ప్రభావము కొన్ని సమున్నత దేవాలయముల గోపురశిఖరములు నిరూపించుచున్నవని ఆచార్య మహాదేవన్ అభిభాషణము. చంప, కంబోడియా దేశములకు శైవమే ప్రభుత్వమతముగ స్వీకరింపబడెను.

అతి ప్రాచీనకాలమున, వామన పురాణగాథల ననుసరించి హూమణో (కీ అ) శైవ ప్రాధాన్యము గోచరము. చతుర్ముఖ బ్రహ్మదేవుడు తా వర్చించుకొనుటకు సువర్ణమయ లింగాకారమును నిర్మించి, ఆరాధించి, ఆనందించి, అయ్యానందమును వెల్లడి

64. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p 729.
65. Dr. T. M. P. Mahadevan : Prabuddha Bharata, 1953 p 131.

ష్రేయ శ్వేతవర్ణలింగము బ్రాహ్మణులకును, రక్తవర్ణలింగము
త్రియులకును, పీతవర్ణలింగము వైశ్యులకును, కృష్ణవర్ణ లింగము
ఎలకును నిర్ణయించి నిర్మించెను. ఆ యా వివిధ లింగార్చనా
నకు చతుర్ముఖుడే నాలుగు శాస్త్రములగూడ నేర్పరచి,
ఖుత్ర పుత్రుడైన శక్తిమహర్షికి ప్రథమమునొసంగి, తృతీ
ఆపస్తంబమహర్షి కొసంగెను. ఆపస్తంబుని ముఖ్యశిష్యుడు
వాడు వైశ్యుడైయుండియు, మధ్యధరా సముద్రమందుగల
అను ద్వీపమునకు పాలకుడై ఆ ప్రాంతముల శైవారాధనా
ప్రచారము గావించెను. అతని నామమే గ్రీసుదేశ చారిత్ర
'బాకూస్' అని వ్యవహరింపబడుచు, నతని నొక దేవతగ
చుచు, గొన్నివేళల నతనినే శివునిగ పూజించుచుందురు. 86

ఆ ద్వీపమునుండి శివలింగారాధనము గ్రీసుదేశమునకు బ్రాకి,
యూరపు ఖండము నంతటిని ఆక్రమించెను. ఈజిప్టుదేశమున
దైవమైన 'ఓరిసిస్' బాకూస్‌యొక్క రూపాంతరము. అచ్చట
'హీబస్' అనియు, అతని భార్యను 'హీబే' అని శివాదేవిని,
అని గౌరిని, లేక 'డెమిటర్' అనగా దేవమాత అనియు
చెదరు. వారి దైవమైన బాకూస్‌కు గజ, వ్యాఘ్రములనిన
గలదు. అతడుకూడ 'త్రైర్సను' అనగా త్రిశూలమును
ఒక పానపాత్రను చేనుంచెను. ఈ వర్ణనమంతయు

---

of. Bhudeb Mukerje: Indian Culture and Its Antiquity, p 13.

శివుని కన్వయముగదా! పాశ్చాత్యఖండముల లింగాకృతిలో నారాధింపబడు దేవతాగణముల నామధేయములు సంపూర్ణముగ శివునకు అన్వయించును. ఆసియా మైనరులో బూజ్యమైన Chemos 'ఖెమోస్' శివుని పరనామమైన 'క్షేమేశ' శబ్దము. అతడే ఈజిప్టులో Khema 'ఖేమ' అనబడును. అనగా 'క్షేమ' అని సంకోచింపబడిన క్షేమేశుడు అగును. Molock Morodock మోలక్, మోరడక్ శబ్దములు శివుని నామమైన మృడక శబ్ద రూపాంతరములు. Adonais 'అడోనైస్' అను నామము అర్ధనారీశ్వర పదముయొక్క భ్రష్టరూపము. Sabazeus' 'శబజియస్' అనుపదము 'శవశాయి' అను శివనామమే. ఆఫ్రికాదేశమున Langaba 'లంగబా' అను శబ్దము 'లింగదేవుని రూపాంతరము. 66

ఈరీతిగ నీ శైవము అతి ప్రాచీనకాలముల భరతఖండము నుండి ఖండఖండాంతరముల వ్యాపించి, ఎల్లెడల ఆదరమునుబొంది, అధికసంఖ్యాక ముముక్షుజనులకు దారణోపాయమై వెలుగొందుట గాంచనగును. శైవము అతి ప్రాబల్యమున జారిత్రాత్మక యుగమునకు బూర్వమే, దక్షిణ అమెరికా, మెక్సికో మొదలైన ఖండముల గూడ వ్యాపించి శివనామమునకు బర్యాయముగ Huitzlipochtii 'హైట్ జ్లి పోచ్ట్లి' అను పదమును బొంది, బొలీవియా దేశమున బ్రహ్మాండమైన కైలాస ఆలయమును, మెక్సికోలో జారిత్రాత్మకమైన గొప్ప శివాలయమును నిర్మించి, మరియు ననేక స్థానముల

66. Prof. Bhudeb Mukerje: Indian Culture and its Antiquity, p 13.

అసంఖ్యాక దేవాలయముల సృజించి, ఆరాధించి, తన ప్రభావము నా యా దేశముల వ్యాపింపజేసికొనినది. 67 అటులనే చైనా, జపాను, మంగోలియా, టిబెట్, దేశముల మాత్రముగాక రష్యా మొదలగు దేశములగూడ నొకకాలమున ఆక్రమించి, అంతట తానెయ్యై, నిత్య ప్రత్యక్ష అరాధ్యమూర్తిగ శివుని రూపించి, ప్రఖ్యాతి గాంచియున్నది. ఇంతటి సర్వ ప్రపంచవ్యాప్తి మరి యేయితర భారతీయ మతమునకు లేదనియే రూఢిగ వచింపనగును. శివశంకరుని సమ్మోహనతత్త్వము ప్రతిభావంతముగదా !

Thus Saivism flourished, with minor differentiations from Pre-Vedic times, and its exponents hailed from the North as well as from the South 68 ఈ విధముగ వేద పూర్వకాలమునుండి శైవము అల్ప విభేదములతో నభివృద్ధి గాంచి, ఉత్తర హిందూస్థానమునుండి మాత్రముగాక దక్షిణాపథము నుండిగూడ ప్రవక్తల గాంచియున్నది. పతంజలి కాలమునకు బూర్వము 'శివభాగవతులు' అను శివమతానుయాయులున్నట్లు పతంజలి మహాభాష్యము (2. 78) తెలుపుచున్నది. నాటికేగాక నేటికిని శైవము భారతావని The living system which exercises at the present day - a marvellous power over the minds of the great majority of the Tamil people. It is the most elaborate influential, and undoubtedly

67. Sri Chaman Lal : Hindu America, p 105.
68. Sri Kumaraswami : The Cultural Heritage of India, Vol 4. p 98

the most intrinsically valuable of all the religions of India 69 ఆధునిక కాలమునగూడ, తమిళ దేశమున సుధిర సంఖ్యాకుల హృదయములపై తన అద్భుత ప్రభావమును జూపించు సజీవ సిద్ధాంతముగ నున్నది. అది విస్తారము, ప్రభావంతమును నై భారత దేశమున సర్వేతర మతములకంటె సారభూతమై అమూల్యమునై రాజిల్లుచున్నదని శ్రీనివాస అయ్యంగారి నిర్ధారణ వచనము. అవును, భారతదేశమున సుప్రఖ్యాతములై ప్రతి భారతీయుని సదా ఆకర్షించు మహాక్షేత్రములు కాశీ రామేశ్వరములేగదా. భారతికి అవి ఉత్తర దక్షిణముల నెలకొని, సర్వభారతిని శైవ మతావలంబినిగ గావించినవన్నచో అతిశయోక్తి కానేరదు.

అటులే ఆ మహాదేవుడు సర్వ ప్రపంచమునకు మూల కేంద్రమైన కైలాసగిరినే నెలవుగ గైకొని, తన దివ్య పారమార్థిక జ్యోతుల సర్వవిషయ ప్రాపంచిక దుఃఖోపశమన కిరణముల, యావత్ప్రపంచగత ముముక్షువులపై ప్రసరింపజేయుచు, దానావందగిరిపై నిత్యప్రపంచోపశమ నిర్వికార నిర్వికల్ప, నిరామయ, నిరతిశయ, ఆనంద, చిద్విలాసమునమునింగి యుండుటయు దీన గమనార్హము. కైలాసపర్వతరాజము, అసలు విశ్వమునకే మూల కేంద్రమేమో అగ్రాహ్యముగదా! ఆ ధవళగిరిపై నున్న, ఆ ధవళ తేజోమయమూర్తి నుండి ప్రసారిత మగుచున్న ప్రశాంత నిర్మల చంద్రికావంచయము ఏరి హృదయముల దరింపజేయదు!

69. Sri V. T. Srinivasa Iyangar : The Outlines of Hindu Philosophy, p 151.

ఆ రహస్యము నెరింగినవారు ధన్యులు, అదృష్టవంతులు. 'తస్మాత్సర్వం పరిత్యజ్య శంకరం భజ సర్వదా। సమాహితమనా భూత్వా కురు శంకర చింతనం॥' (1. 5) అందుచే సర్వేతరమును త్యజించి శంకరుని సదా భజింపుము. సమాహిత చిత్తమున శంకరు ధ్యానింపుము అని 'శివతత్త్వ సుధానిధి' ప్రబోధ.

## శివలింగ తాత్పర్యము

'సంధ్యారంభ విజృంభితం శ్రుతి శిరస్థానాంతరాధిష్ఠితం। సప్రేమభ్రమరాభిరామ మసకృత్సద్వాసనా శోభితం। భోగీంద్రాభరణం సమస్తసుమనః పూజ్యం గుణావిష్కృతం। సేవే శ్రీగిరిమల్లికార్జున మహాలింగం శివాలింగితం॥' (50) శా॥ 'సాయంకాల విజృంభితంబు; శ్రుతిశీర్ష స్థాననిష్ఠంబు; స। ద్గేయాభ్యున్నత వాసనంబు; భ్రమరాతిప్రేమపాత్రంబు; సం। యుక్తాయుత్సుమనః ప్రపూజ్యము; గుణోద్ధామంబు; భోగీంద్రభూ। షాయుక్ఛ్రీగిరిమల్లికార్జునశివేచ్ఛాలింగమున్ గొల్చెదన్॥' (భమిడిపాటి వెంకట సుబ్రహ్మణ్య శర్మ) అని శ్రీ శంకర భగవత్పాదాచార్యస్వామి శ్రీ శైల మల్లికార్జునస్వామినిగూర్చి ప్రార్థించియున్నాడు. శివస్వరూప చిహ్నమైన మహాలింగమూర్తిని సంబోధించి స్తుతించుట యిందు గోచరము. సాక్షాత్తు శివునిమూర్తిని లింగాకృతిలో యతిసార్వభౌముడు దర్శించి అర్చించుట యిందు కానగును. ఆ లింగాకారము కరచరణాది అవయవభూషితముకాక, అండాకృతినున్నను, శంకరునకు అందు

శివానుభూతియే గలిగినట్లుగూడ ద్యోతకము ఎందుచేత ?

## లింగ ప్రాశస్త్యము

శివమహాపురాణమున విశ్వేశ్వరసంహితలో పరమేశ్వరుడు నందికేశ్వరునకు బోధించుచు, తన లింగతాత్పర్యముగ 'సకలత్వ మతో జ్ఞేయ మీశత్వం మయి సత్వరం। యదిదం నిష్కలం స్తంభం మమ బ్రహ్మత్వబోధకం॥ లింగలక్షణ యుక్తత్వాన్మమ లింగం భవేదిదం। తదిదం నిత్యమభ్యర్చ్యం యువాభ్యా మత్ర పుత్రకౌ॥' (9.42) అందుచే నేను సగుణరూపుడనగు నీశ్వరుడనని ఎరుంగవలెను. ఈ నిర్గుణ స్తంభము నా పరబ్రహ్మతత్త్వమును వ్యక్తపరచును. ఇది లింగచిహ్నములు గలదగుటచే నాకు లింగమై (గురుతుగనై) యుండగలదు. ఓపుత్రులారా! ఈ శివలింగము మీరు నిత్యపూజాయోగ్యము అని వివరించి, అందు నీ లింగము తనకు చిహ్నముగ స్వీకరింపబడెననియు, నది శుద్ధ బ్రహ్మతత్త్వమున నన్వయించుననియు దెలిపెను. అప్పటనే 'మదాత్మక మిదం నిత్యం మమ సాన్నిధ్యకారణం। మహత్పూజ్య మిదం నిత్యమభేదాల్లింగ లింగినోః॥' (9.43) ఈ లింగము నా స్వరూపమైయుండ నా నిత్య సన్నిధికి హేతుభూతము కాగలదు. లింగలింగులకు భేదము లేనందువలన యీ లింగము మీకు మిగులబూజనీయము అని తెలిపి, తన లింగతాదాత్మ్యత్వమును శివుడు విశదీకరించెను. శక్తి శక్తిమానులకు భేదము కానట్లు గుణగుణులకు వ్యత్యాస మభావ మైనట్లు శివ లింగములకు తారతమ్యము శూన్యము. తనకు

ప్రతిమాకారమునుగూడ నున్నను, యీ ప్రతీకాకారమునునున్న లింగా రాధనను మాత్రమే ముఖ్యమని శంకరుడు అచట వచించుచు, 'లింగంబేరం చ మే తుల్యం యజతాం లింగముత్తమం। తస్మాల్లింగం పరం పూజ్యం భేదాదపి ముముక్షుభిః॥' (7.37) నా ప్రతిమయు లింగము సమానములై యున్నను, నుపాసకులకు లింగమే ఉత్తమము. అందుచే ముముక్షువులకు ప్రతిమా పూజనముకంటె లింగార్చనమే యుత్కృష్టమైనది అని కైలాసవాసుడు ప్రతిమకుగంటె లింగమునకే ప్రాధాన్యము నొసంగెను. ఈ లింగశ్రేష్ఠత్వమును మరియు నుగ్గ డించుచు, 'లింగ మోంకార మంత్రేణబేరం పంచాక్షరేణ తు' (7.33) పంచాక్షరీ మంత్రముచే ప్రతిమను అర్చింప, కేవలోంకారముచేత లింగార్చనము గావింపవలయునని శివుని ఆదేశవాక్యము. అందుచే, నీ పురాణవచనములచే, శివునకు ప్రతిమ, ప్రతికోపాసనాదులు రెండును గలవనియు, అందు కరచరణాది అవయములుగల ప్రతిమారాధనము, తద్వివర్జితమై నిరవయవమైన లింగపూజా విధా నముకంటె నల్పమనియు విదితము.

ఈ విషయమునే వివరించుచు పండిత ప్రసన్నకుమార ఆచార్య

Rudra, of the Vedas, has thus developed into the great and powerful god Siva. He is worshipped in two forms. Siva is represented as a fair man with five faces, and four arms, seated in profound thought, bearing a third eye on the fore head surmounted by the moon's crescent, and matted locks gathered up into a horn like form, which contains a symbol of

the Ganga. A necklace of skulls hangs round his neck, and he puts on a garment of skin of a tiger, a deer, or an elephant. He is generally accompanied by his bull Nandi 70 వైదిక రుద్రుడు శక్తివంతుడును మహాత్ముడును ఆగు శివుడుగ పరిణమించెను. అతడు ద్వివిధరూపములలో దర్శింప బడును. చతుర్భుజములతో, ధ్యానసమాధిలో ఆసీనుడై, ఫాలనేత్రుడై చంద్రమౌళిధరుడై, గంగాచిహ్నముగల జటాజూటధారియై, శివుడు సుందరమూర్తిగ చిత్రింపబడును. అతని కంఠమున కపాలమాల యుండును. వ్యాఘ్ర, మృగ, గజచర్మములలో నొకదాని వస్త్రముగ ధరించును. సాధారణముగ నతడు నందితో గలిసి యుండును. Although as Rudra or Mahakala he is destroying and dissolving power, he is auspecious (Siva Sankara) because the distinction implies reproduction. As the reproduction power, he is represented by his symbol, the linga or phallus 70 రుద్రుడు మహాకాళుడై వినాశనకరుడను, లయకర్తయునై యున్నను, అతడు శివశంకరుడై పునర్జన్మ కారణ మగుటచే శుభకారకుడు అగుచున్నాడు. అతని, పునర్జన్మ హేతువుచే లింగాకృతితో నాతడు సూచితము అని వచించెను. ఆ విధముగ శివుడు ప్రతిమ, లింగాత్మకముగ ద్వివిధ మూర్తుల ధరించి పూజింపబడుట స్పష్టము. ఈ మూర్తిద్వయము సుప్రసిద్ధము.

అయినను 'సర్వేభ్యః పుణ్యకర్మేభ్యః శ్రేష్ఠం లింగస్య దర్శనం' (శివతత్త్వసుధానిధి_18 అ) సర్వ పుణ్యకర్మలలో లింగ దర్శనము శ్రేష్ఠమనియు 'లింగస్యాభ్యర్చనేనైవ సర్వపాపక్షయో

(1). Mahamahopadhyaya Dr. Prasanna Kumar Acharya : Glories of India, p 161

భవేత్' (శి.త.సు.ని. 19 అ) లింగార్చనముచే సర్వపాపక్షయము జరుగుననియు, 'లింగార్చనా త్పరో ధర్మో నాస్తి నాస్తి జగత్త్రయే। లింగార్చనా త్పరం శ్రేష్ఠం న భూతం న భవిష్యతి॥' (శి.త.సు.ని-18 అ) జగత్త్రయములో లింగార్చనముకంటె శ్రేష్ఠమైన ధర్మము అభావమనియు, అంతకంటె శ్రేష్ఠతరమైనది భూతభవిష్యత్కాలముల శూన్యమనియు స్కాందపురాణము తెలుపుచుండ, 'లింగ సంపూజనం ముఖ్య మలాభే ప్రతిమాదిషు' (101-104) ప్రతిమార్చనము కంటె లింగపూజ ముఖ్యమని పద్మాది పురాణములును, లింగేతు పూజతే సర్వం అర్చితం స్యాచ్చరాచరం। తస్మాత్సదార్చనం కార్యం లింగస్య సుమహాత్మనః॥ న హి లింగార్చనాత్కించిత్ పుణ్యమభ్యధికం క్వచిత్। ఇతి విజ్ఞాయ యత్నేన పూజనీయ స్సదాశివః॥' లింగ పూజనముచే సర్వచరాచరములు పూజింపడును. అందుచే మహాత్ములకు లింగార్చనము కార్యము. కొంచమైన అధికపుణ్యము లింగార్చనమున కంటె అన్యమున లేదని గ్రహించి, యత్నపూర్వకముగ సదాశివుని పూజింపవలయునని అన్య పురాణములును అతి సుందరమూర్తిమత్వము గలిగిన సర్వాకర్షణీయ శివస్వరూపమును అముఖ్యముగావించి, యీ లింగాకృతి నేల గ్రహింపవలెను? ఇట్లు శాస్త్రములు మహాత్ములు లింగస్వీకరణము గావించుటయందు గల రహస్యమేమి?

లీయతే గమ్యతే యత్ర యేన సర్వచరాచరం। తదేవ లింగ మిత్యుక్తం లింగతత్త్వపరాయణైః॥' సర్వ చరాచర సృష్టి యంతయు దేనికొరకు గమనించి, ఎందు లయించు చున్నదో

దానినే లింగమందురని లింగతత్త్వపరాయణులచే వచింపబడును. అనగా యీ సృష్టి ఎందు లయించునో, ఏది సర్వభూతజాలములకు గమ్యస్థానమో అయ్యదియే లింగము అని దీని తాత్పర్యము. 'లయనాత్ లింగముచ్యతే' అనియు సూత్రము. Linga means emblem, symbole. It is the refuge or repository of the entire universe 71 లింగమనగ చిహ్నము. సర్వ విశ్వమునకు ఆశ్రయస్థానమే లింగము అనియు వివరణము.

## లింగము - అండము

అదియునుగాక Symbols are signs for expressing the invisible bymeans of the visible or sensuous representation 72 ప్రత్యక్ష ప్రదర్శనమూలమున అప్రత్యక్ష తత్త్వమును వ్యక్తపరచు చిహ్నములు లింగములు నాబడును అని యతీశ్వరానందుల వచనము. The Lingam is like an egg, It represents the Brahmanda. Whatever that is contained in the Brahmanda is in the Lingam. The whole world is in the form of Lord Siva. The world is Lingam also is the form of Siva 73 లింగము అండాకృతి గలది. అది బ్రహ్మాండమును సూచించును. బ్రహ్మాండములోని సర్వము లింగాకారమునందు గలదు. సర్వవిశ్వము శివాకృతిలో నున్నది.

---

71. The Editor : The Vedanta Kesari, 1957. p 415.
72. Swami Yatiswarananda : Prabuddha Bharata. 1954, p 533.
73. Swami Sivananda Saraswati : Lord Siva and His worship, p 206

విశ్వము లింగము. ఆ లింగమే శివస్వరూపము అని శివానంద సరస్వతీస్వామి వివరణము. దీనిని గొంచెము వివరించుచు లింగము సర్వ విశ్వముయొక్క మూర్తిమత్వమనియు, అదియే శివ తత్త్వమనియు తెలిపి, పండిత మజుందారు According to the derivative meaning of Lingam, it signifies the source of all 74 లింగ శబ్ద వ్యుత్పత్తి ప్రకారము లింగమన సర్వ సృష్టికి జన్మస్థానముగ గలదు. అవయవ విభాగ మావంతయు గోచరింపని అండమునుండి క్రిమి కీటక పక్ష్యాదుల శిశువులు సర్వావయవములతో బుట్టొందుచున్నట్లు సృష్టికిబూర్వము యీ సృష్టియంతయు అనుమాన ప్రమాణమున అండాకృతిలోనుండి అరుదెంచునట్లు అన్వయము. అట్టి ప్రథమ దశలో నామరూపాత్మక విశ్వము స్థూలముగ గోచరింపకున్నను దానికి సర్వకారణుడుగనున్న పరమేశ్వరుని యునికి అట నుండుటచే నా అండాకారమే పరమేశ్వరుడు అని నిర్ధారణము. అనగా సృష్టికిబూర్వము తాదాత్మ్యస్థితిలో అండాకృతినున్నటు విదితము. అంతియగాక సృష్టికి బూర్వము మాత్రమేగాక నామరూపాత్మక సృష్టియు బ్రహ్మాండము నాబరగుచు గోలాకృతినున్నట్లు అండాండ పిండాండ బ్రహ్మాండ శబ్దములచే స్పష్టము. అది లింగాకారమునకు అభిన్నము. అండము అనినను లింగమన్నను ఏకాకృతియే గదా! అందుచే లింగాకృతిలో నుండి పరమేశ్వరునితో నవినాభావస్థితి నున్న విశ్వమే లింగాకారము

74. Pandit C. Munuswami Mudaliar : The Origin of the World, (Translation) P 214.

అగుచున్నది. అందుచే నద్దాని సూచించుచు, అద్దానియం దంతర్గత ముగ వ్యాప్తముగనున్న పరమశివుని అన్వయించుటకై లింగము చిహ్నముగ నున్నదనియు అర్థము.

## లింగ - లైంగికము

కార్యముననుసరించి కారణమునుగూర్చి తీర్మానించు రీతి నను మానప్రమాణమందురు. ఘటమునుగాంచి, కర్తయగు కుమ్మరిని గుర్తించుచందము సృష్టిని గాంచి, దానికి గర్తయొకడుండవలయు నని అనుమానించుటయు గలదు. దాని అనుమానప్రమాణమందురు. దానినే లైంగికప్రజ్ఞ యనియు నందురు. ఆ కర్త అగోచరుడుగ నున్నను అతని కార్యమైన ప్రపంచము ప్రస్ఫుటము. అందుచే నీసృష్టి అతనిని సూచించు గాన నిది అతని చిహ్నముగ ననగా లింగముగ స్వీకరింపబడును. అటులే సర్వ సృష్టి, స్థితి, లయ కారణుడుగ నొకడుండవలయునుగాని, అతడు ప్రత్యక్షేంద్రియములకు అగోచరుడౌటచే అతని సూచికముగ ప్రత్యక్షగోచరమై యున్నను, సామాన్యరూపములకు గల అవయవాదులులేని అండాకృతి ఆతని చిహ్నముగ నుంచి అర్చించుట పరిపాటి అయినది. ఆ చిహ్నమే లింగముగ వ్యవహారము.

వేదాంతగోచరమైన నిర్గుణబ్రహ్మము అవాఙ్మానస గోచర మగుటచే, ప్రథమ సోపానముగ 'అదౌ బ్రహ్మత్వ బుద్ధ్యర్థం నిష్కలం లింగ ముత్థితం' (౭. ౩౭) నిర్గుణ బ్రహ్మ బుద్ధిని

జనింపజేయుటకునై శివలింగ ముద్భవించెను అని శివ మహాపురాణ సూతసంహితా వాక్యము. 'సకలం నిష్కలం చేతి స్వరూపద్వయ మస్తి మే' (9-30) నాకు సగుణ నిర్గుణ రూపములు రెండును గూడ గలవు. 'పురస్తాత్ స్తంభరూపేణ పశ్చాద్రూపేణ చార్భకౌ।' (9.31) ఓపుత్రులారా, నేను మొదట నిర్గుణ స్తంభాకారమున, పిదప సగుణ స్వరూపమున నావిర్భవించితిని అనియు బురాణ వాక్యములు. అనగా 'అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమా పరికల్పితా' అజ్ఞానులు భావించుకొనుటకు బ్రతిమాదులు కల్పింపబడుచుందము నిర్గుణ నిర్వికార బ్రహ్మము. ముముక్షుజనోద్ధరణ కార్యదీక్షగై కొని అగోచర స్థితినుండి లింగాకృతితో నిరవయవ మూర్తిమత్వమును బొంది, తర్వాత పూర్తిగ స్థూలముగ సావయవమూర్తిని దాల్చినట్లు యిందు సుస్పష్టము. అందుచేత నీ ప్రతిమా లింగరూపమున ద్వివిధాకృతి వెలసియున్న పరమశివుని, నీ రెండింట స్మరించి, పూజించుట లోకమున విదితము. మరియు నిర్గుణరూపం నామ అప్రాకృత దివ్యమంగళ విగ్రహవత్ సంకోచవికాసావస్థా రహితం-అమూర్త్యాత్మకం మహాలింగస్వరూపమేవ।' నిర్గుణరూపముగ అప్రాకృత దివ్యమంగళ విగ్రహమువలె సంకోచవికాసములులేక మూర్తిమంతముకాక మహాలింగస్వరూపమగును. 'సగుణరూపంనామ మూర్త్యాత్మకం కార్యబ్రహ్మరూపం భవతి' సగుణ రూపమనగ మూర్తిమంతమై కార్యబ్రహ్మ మగుచున్నది. అని వీరేశలింగారాధ్యస్వామి

76. శ్రీ మురిగొండ వీరేశలింగారాధ్య : పీఠిక, నీలకంఠీయ భాష్యము, పు 8.

కథనము. కవున శివుడు తన నిర్గుణత్వమున అరూపత్వమున లింగాకారమున ద్యోతకము.

## లింగము - శివాకృతి

ధ్యానముద్రయందున్న శివాకృతిగూడ దూరముననుండి లింగాకృతిగ గోచరించును. అట్టి ధ్యాననిమగ్నుల స్మరించి, సోదరి నివేదితయు The Lingam, after all is but a fragment of stone. Far better images of Mahadeva are those who come and go yonder, amidst the pressing crowd, the monks.... And finer still will these be, when retiring into the forest....they sit, even like this stone lingam, bolt upright in the shelter of tree or rock, lost to the world without, in solitary meditation 76 లింగము ఒక పాషాణఖండము మాత్రము. జనబాహుళ్యమునకుమధ్య వచ్చుచు బోవుచుండు యోగులు మహాదేవునికి యథార్థమైన చిహ్నములు, మిదు మిక్కిలి, అరణ్యముల కరిగినప్పుడు, వృక్షచ్ఛాయనో పర్వతఛాయనో నిశ్చలముగ కూర్చుండి, ప్రపంచాతీత ఏకాంత ధ్యానమున మునింగి, లింగాకృతిలోనున్న మౌనులు ముఖ్యముగ శివ స్వరూపములు అని వాకొనినది.

కావున A symbol is a figure of thought, and not mere a figure of speech. A symbol is a message expressed in code 77 చిహ్నము కేవలము భాషారూప అలం

76. Sister Nivedita: The Web of Indian Life, p 197.
77. Prof. V. A. Tyagarajan; The Vedanta Kesari, 1948, p 87.

కారము గాక, భావాత్మక అలంకారముగ స్వీకరింపవలెను. సాంకేతిక ముగ దెలుపబడిన సందేశమే చిహ్నము అని ఆచార్య త్యాగరాజన్ అభిభాషణము, పై మీమాంస ననుసరించి A symbol in an attempt to express the infinite in terms of the finite 77 అనంతమును బరిమిత రూపముల అభివ్యక్తము చేయ యత్నించు టయే చిహ్నము అనెడి అతని వచనము లెంత సముచితములు! ఈ సందర్భమున The truth cannot be expressed in words, and when words are used even by Sankara, acute minds can always find a loophole for attack 78 సత్పదార్థము పదముల వ్యక్తము కానేరదు. కాని ఆదిశంకరుల చేతనైనను బదము లుపయోగింపబడినచో, సూక్ష్మబుద్ధులు అందు లోపముల నెంచి ఆక్షేపింప నవకాశముండును అను డఫ్ ఆన్స్లి వాక్యము లెంతయు స్మరింపదగియున్నవి. వివరణములతో గూడిన భాషయే యా సత్యమును దెలుప నిర్వీర్యమై అసందర్భ వ్యాఖ్యా నములకు అవకాశమొసగుచుండ, నిక, చిహ్నము స్థూలమై. నిరవయవమైయుండ, నీ లింగభావమును నెట్టి అపోహలకు అవకాశ ముండును! ఉపమాన ఉపమేయములకు నేదోయొక విషయమున సామ్యముండునుగాని సర్వవిధాన్వయము అసందర్భము, అసాధ్యము గదా! ఇక లింగము పరాత్పరుని సంపూర్ణ వ్యక్తిత్వము నెట్లు అభివ్యక్తమొనరించి ఎల్లర సంతృప్తి పరుపగల్గును! చిహ్న

77. Prof. V A. Tyagarajan : The Vedanta Kesari, 1948, p 87.

78 Prof Douglas Grant Duff Ainslie : The Science of Yoga of Swami Yogananda, p viii

విషయమున A symbol is not an end in itself. It is like a mould, which an artist prepares in order to cast out. It is the abode of thought 79 చిహ్నము పర్యవసాన తత్త్వముకాదు, శిల్పమును రూపొందించుటకు బూర్వమున్న శిల్పిమానసవంటిది చిహ్నము. అది భావమునకు నెలవు అని ఆచార్య త్యాగరాజన్ హెచ్చరిక వచనములు. న్యాయముగ నాలోచించినచో, We think in symbols, we act in symbols, we live in symbols, we learn in symbols 80 మనము చిహ్నముల మూలమున యోచించెదము. సాంకేతికములతో వ్యవహరించెదము. వానిలో జీవించెదము. వానిద్వారమున జ్ఞానసముపార్జనము గావించెదము. అందుచే జీవితవిధానమే సాంకేతికరూపమై, మహాలింగ స్వరూపమై విరాజిల్లుట సత్యము. అయినను సాంకేతికములపై నాధారపడుచు, సాంకేతికములువినా జీవింపజాలక, మానవజీవితమే సాంకేతికమై యొప్పార, మానవుడు ఆ సాంకేతిక రూపములకే అపార్థముల గల్పించుకొని, అన్వయములకు దూరుడై అవస్థలగుందుట గమనార్హము.

## మహాలింగోద్భవము

'ఆ పాతాళ నభ స్థలాంతభువన బ్రహ్మాండ మావిస్ఫుర జ్జ్యోతిస్స్ఫాటికలింగ....' పాతాళమునుండి గగనపర్యంతము బ్రహ్మాండములన్నింటి నావరించియున్న శుద్ధ స్ఫటికాకృతినున్న మహా

79. Prof. V. A. Tyagarajan: The Vedanta Kesari, 1948, p 89.

80. The Editor: The Vedanta Kesari, 1957, 335.

జ్యోతిర్లింగమును ప్రస్తావించి, శివుని మహాన్యాసము స్తుతించు చున్నది. ఈ మహాజ్యోతిర్లింగ ఆవిర్భావ వివరణమే వాయు, లింగ, స్కాందాది శైవపురాణముల పేర్కొనబడి, సర్వేతర దేవతలకంటె, ముఖ్యముగ బ్రహ్మ, విష్ణు, దేవతలకంటె శివుడే అధికుడని నిరూపింప నుద్యుక్తములు. శివమహిమ్నస్తోత్రమున పుష్పదంతుడుగూడ, 'తవైశ్వర్యం యత్నాద్యదుపరి విరించిర్హరి రధః। పరిచ్ఛేత్తుం యాతావనలమనలస్కంధవపుషః। తతో భక్తి శ్రద్ధాభర గురుగృణద్భ్యాం గిరిశ యత్స్వయం తస్థే తాభ్యాం తవకిమనువృత్తిర్న ఫలతి॥' (10) కైలాసాధినాథా ! అగ్నిసమూహము వంటి తేజోరూపముగల నీ యైశ్వర్యమును నీ లింగాకారము యొక్క ఆద్యంతముల గ్రహింప నుద్యుక్తులై విరించి, అంత రిక్షమునకును, విష్ణువు పాతాళమునకు అరిగిరి. కాని విఫలులై తమ అశక్తతను గ్రహించి, అంత భక్తిశ్రద్ధాయుక్తులై గిరీశ నిన్ను ప్రార్థింప వారికి ప్రత్యక్షమై వారి ననుగ్రహించితివి అని స్తుతించెను. శివపురాణాంతర్గత విశ్వేశ్వర సంహితయు నీ గాధను వివరించినదై, బ్రహ్మ, విష్ణువుల యుద్ధ నివారణమునకై 'మహానల స్తంభ బిభీషణాకృతి, ర్బభూవ తన్మధ్యతలే స నిష్కలం॥' (7.11) నిష్కలుండగు పరమేశ్వరుడు భీషణమైన మహాగ్నిస్తంభ రూపమున నా బ్రహ్మ, విష్ణువుల మధ్య నావిర్భవించెను. ఈ విషయమును గ్రంథాంతరమున ప్రస్తావించుచు పరమశివుడు 'యత్పునః స్తంభరూపేణ స్వావిరాస మహం పురా' (9. 15 పూర్వము తేజోమయ స్తంభరూపమున నే నావిర్భవించితిని. 'రణరంగతలేఽ

ముష్మి న్యదహం లింగవర్ష్మకా। జ్యోంభితో లింగవత్తస్మాల్లింగస్థాన మిదం భవేత్॥' (9. 18) ఈ రణరంగమున నేను లింగరూపముగ (చిహ్నముగ) నావిర్భవించితిని. అందుచే నిది లింగస్థానమనబడును. మరియు 'అనాద్యంత మిదం స్తంభ మణుమాత్రం భవిష్యతి। దర్శనార్థం హి జగతాం పూజనార్థం హి పుత్రకా॥' (9. 19) ఓ కుమారులారా! లోకములు దర్శించి పూజించుటకై ఆద్యంతములు లేని యీ తేజోలింగము అల్పమగు నాకారమును గలది యగును. 'అనలాచలసంకాశం యదిదం లింగముత్థితం, అరుణాచల మిత్యేవ తదిదం ఖ్యాతి మేష్యతి॥' (9 21) అగ్ని పర్వతమువలె నీ లింగము ప్రాదుర్భవించుటచే నియ్యది 'అరుణాచల' మనుపేర ప్రఖ్యాతిగాంచును అనియు బరమశివుడు లింగ తాత్పర్యమును బోధించియున్నాడు. సాధారణముగ దీపికయు లింగాకృతి నుండుట సహజముగదా! అందుచే అగ్నిస్వరూపుడైన శివుడు దీపికాకృతి అనగా లింగాకృతి నొందినట్లు విదితము. కాని యీ దీపిక ఆద్యంతములులేని మహాజ్యోతియై యొప్పారుటచే, నది మహా స్థంభముగను, మహాపర్వతముగను నిట వర్ణింపబడియున్నది. దీపికకు మధ్యనుండు నీలస్వరూపము నీలకంఠుని స్ఫురింపజేయుట యందాశ్చర్యము లేదు. పై మహాజ్యోతిర్లింగ ఆవిర్భావము 'సకాలో మార్గశీర్షే తు స్యాదార్ద్రా రుక్షమర్భకా॥' (9 15) మార్గశిర మాసమున ఆర్ద్రా నక్షత్రమున ననియు, ఆదినమునే శివరాత్రి అనియుగూడ శివుని వివరణము.

జ్యోతిర్మహాలింగోద్భవ ఘట్టమును శైవపురాణములెల్ల చిత్రించినవి. స్కాందపురాణాంతర్గత సనత్కుమారసంహితలోని శివతత్త్వసుధానిధి ప్రకరణము, ఆ పురాణమునందేగల శంకరసంహితయందు గల శివరహస్య ఖండమునను, మరియు నింక నితర పురాణములలోగూడ నీ గాథ తెలుపబడియున్నది. అదెట్లు సంభవించెనో క్లుప్తముగ జూచెదము గాక.

పూర్వ మొక సమయమున బ్రహ్మ విష్ణువులు తమ తమ ఆధిక్యతను బ్రగల్భించుకొనుచు, ఆత్మస్తుతి, పరనింద గావించుకొనుచు, గయ్యమునకు దిగిరి. సృష్టిని గల్పించి, విధాతనగుటచే దా నధికుడనని విరించి వాదింప, సృష్టిని బోషించి, సక్రమలీల నుంచువాడ నే నధికుడనని మాధవుడు ప్రతిపాదనము చేయ, వారికి ఎట్టి తీర్మానము దోచక, వాదములచే నిర్ణయము సాధ్యముగాదని యిక యుద్ధమునకు బూనుకొనిరి. ఇటు ప్రపంచమున నాధిపత్యమునకై ప్రథమతః వాదములతో బ్రారంభించిన వీరి పోరాటము నైజమున కొట్లాటగ మారి, వివిధాయుధ పరంపరల నొకరిపై నొకరు ప్రయోగించుచు, తీవ్రయుద్ధమునకు గడంగిరి. అంత నా యిరువురు వారివారి ప్రత్యేకాస్త్రములగు బ్రహ్మాస్త్రి, చక్రముల, బ్రయోగింప నవి పరస్పరము ఢీకొని యుభయములు శక్తివంతములగుటచే మహోగ్రలీల బోరాటము సాగించుచు, నేరును పరాభూతము గానవకాశము లేకుంటచే, గల్లోలమును సృజింప బ్రపంచము సంక్షుభితమైపోయెను. అంత దేవేంద్రాది సురగణములు, మహర్షి

సంచయము పరమేశ్వరు నాశ్రయించి, సర్వమును వినిపింప, నంతయు బూర్వమే గ్రహించి యున్న శివుడు మందహాసమున వారి బంపి, తా నదృశ్యరూపుడై రణస్థలమున కేతెంచెను. విష్ణు బ్రహ్మల పరిమిత శక్తిసామర్థ్యముల వారికి వ్యక్తముజేయ సంకల్పించి, శివశంకరుడు ఆకస్మికముగ వారిరువురిమధ్య నొక అగ్నిస్తంభాకార మున ఆవిర్భవించెను.

స్తంభాకృతిగ ముందునిలచిన ఆ అగ్నిని జూచి విస్మయ చిత్తులై, విష్ణుబ్రహ్మలు ఒకరిముఖము నొకరు చూచుకొని, ఆ స్తంభ పరిమాణమును దలంచి, ఆశ్చర్యచకితులై, యుద్ధము ను నిలిపి, ఆ స్తంభస్వరూప నిర్ణయము గావించుకొన నిశ్చయించుకొనిరి. అందులకై బ్రహ్మ, హంసరూపము నొంది స్తంభ శిరోభాగమునకై యూర్ధ్వముగ బయనము సాగింప, విష్ణువుగూడ వరాహాకృతి దాల్చి, భూమిని ద్రవ్వుచు బాతాళమునకు బోవుచుండెను. ఇట్లు ఉభయులు యత్నించి యత్నించి, ఆ స్తంభాకృతియొక్క ఆద్యంతములగానక, చింతాకులితస్వాంతులై పూర్వస్థానము జేరి, ఆ మూర్తి రహస్యము నెరుంగ భక్తియుక్తులై పరమశివుని బ్రార్థించిరి. వారి భక్తికి సంతసించిన మహాదేవుడు ఆ అగ్నిస్తంభము మధ్య వారికి బ్రత్య క్షమై, వారివారి సంకుచిత శక్తులబోధించి, యెరింగించి, తనచే నియుక్తులై వారు తమతమ విధ్యుక్తకార్యముల జేయుచున్నారుగాని వారికి బ్రత్యేకత సుమంతయు లేదను రహస్యమును బోధించెను. యదార్థము నెరింగిన చతుర్ముఖ, విష్ణులు, తమ గర్వమడంగ

శివభక్తి పరాయణత్వమున దమ నిజ స్థానములకరిగిరి. పూర్వోక్త శివరహస్యము ననుసరించి, మాఘకృష్ణ చతుర్దశి తిథి నర్ధరాత్రి యనియు, నది అందుచే మహాశివరాత్రిగ బరిగణింపబడుననియు దెలుపుచున్నది.

ఈ పురాణగాధవలన నా జ్యోతిర్మయ స్తంభమే 'సర్వ పాప ప్రశమనం శివతత్త్వప్రదాయకం। సర్వదుఃఖోపశమనం తాపత్రయ నివారకం। తయోః కలహశాంత్యర్థం బ్రహ్మ విష్ణోర్మహేశ్వరః। మహాలింగ స్వరూపేణ హ్యావిర్భూతో యథాపురా। తాం కథాం కథయిష్యామి సర్వలోకైకపావనం॥' (17-అ) అను శివతత్త్వ సుధానిధి వచనము ప్రకారము మహాలింగముగ బ్రఖ్యాతినిగూడ నొందియుండుటయు విదితము. అందుచే శివప్రత్యామ్నాయముగ, శివస్థానమున శివసూచికముగ అనగ శివచిహ్నముగ దోచిన ఆ స్తంభము లింగము నాబడినట్లు స్పష్టము. అనగా నీ లింగశబ్దము నకు చిహ్నమనియే తాత్పర్యముగాని అన్యము గాదని శాస్త్రవచన సాధ్యము. అన్యార్థముల కిట ఎట్లును తాత్పర్యమావంతయు శూన్యము.

## లింగము - యాగ స్తంభము

లింగారాధనము కేవలము అనాగరికమై, అసభ్య శిశ్నపూజా పద్ధతి అని విమర్శించిన పాశ్చాత్య పండితునికి సమాధానముగ పారిస్‌నగరమున జరిగిన మహాసభాస్థలమున వివేకానంద స్వామి the worship of Siva lingam originated from the famous

hymn in Atharva-Veda Samhita sung in praise of the Yupa-Stambha, the sacrificial post 81 అథర్వవేదమున యూప స్తంభమును స్తుతించు ప్రముఖ మంత్రమునుండి శివలింగ పూజ సముత్పన్నము. In that hymn, a description is found of the beginningless and endless stambha or Skambha, and it is shown that the said skambha is put in place of the eternal Brahman 81 నిత్య బ్రహ్మ స్థానమునకు బదులుగ నీ స్కంభము ప్రతిష్ఠింపబడినదనియు, నది అద్యంతములు లేనిదనియు నా మంత్రమున వర్ణింపబడియున్నది. కాలక్రమమున, the Yagna fire, its smoke, ashes, and flames, the Soma plant, and the ox that used to carry on its back the wood for the Vedic sacrifice, gave place to the conception of the brightness of Siva's body, his tawny matted-hair, his blue throat, and the riding on the bull of the Shiva and so on 81 హోమాగ్ని దాని ధూమము, భస్మము, జ్యోతిజ్వాలలును, సోమలత, మరియు సమిధల యజ్ఞమునకై గొనివచ్చు వృషభము మొదలగునవి, శివుని జ్యోతిర్మయి శరీరము, అతని కపిలవర్ణ జటాజూటము, అతని నీలకంఠము, శివుని వృషభ వాహనాదికము శివ మూర్తి భావనమునకు దోడ్పడెను: Just so, the Yupa Skambha gave place in time to the Siva - Lingam, and was deified to the high Devahood of Siva - Sankara 81 అదేవిధముగ నా యూప

81. Swami Vivekananda : The Complete Works, Vol. 4 p 357.

స్కంభము కాలక్రమమున శివలింగ చిత్రణమునకు ప్ర మొసంగి శ్రీశంకరరూపము ఉన్నత దేవత్వమునకు గొంపోబడె దని సువిస్పష్ట వచనముల నా యతివరేణ్యుడు వాదించి ప్రపంచ లోకమును సమ్మతింపజేసియుండెను.

మరియు నా యతిరాజు తాత్పర్యమున నీ యూపస్కంభ కథనము లింగాది పురాణముల బుర్వోక్తరీతి బ్రహ్మ, విష్ణువుల మధ్య ఆవిర్భవించిన తేజో స్కంభముగ రూపొందింపబడి, అచట శివుని మహాదేవునిగ నెలకొల్పుటకు వ్యాజముగ నేర్పడినది. ఆ సభాస్థలమున వేదాంత సింహరూపమున నా స్వామి The explanation of the Salagrama Sila as a phallic emblem was an imaginary invention and, from the very beginning, beside the mark. The explanation of the Siva Lingam as a phallic emblem was brought forward by the most thoughtless 81 సాలగ్రామశిల శిశ్నచిహ్న మను వాదము కేవల యూహాజనిత కల్పనమై, ప్రథమమునుండి పెడమార్గము ద్రొక్కినది. శివలింగము గూడ శిశ్న ప్రతిమయను భావము అతి బుద్ధిహీనులచే ప్రతిపాదింపబడినదనిగూడ గర్జించి యున్నాడు.

అందుచే వివేకానందుని కథనము ప్రకారము యజ్ఞశాలయందు బ్రహ్మపరముగ బ్రతిష్ఠింపబడిన యూపస్థంభము కాలక్రమమున శివచిహ్నముగ మారి, లింగనామమున బ్రఖ్యాతమైనట్లు సువిస్పష్టము.

81 Swami Vivekananda : The Complete Works, Vol. 4, p 357.

# లింగార్చన వ్యాప్తి

ఈ విధముగ యోచించి చూచిన. విల్సను మహాశయుని వాక్యములరీతి, How far the worship of Linga is authorised by the Vedas, is doubtful, but it is the main purpose of the several of the Puranas 82 వేదములచే నీ లింగా రాధన మెంతవరకు సమ్మతింపబడినదో సంశయావిష్టముగాని, అనేక పురాణముల కది ముఖ్య తాత్పర్యముగ నున్నది. కాని it is also perhaps the most ancient object of homage adopted in India subsequently to the ritual of the Vedas, which was chiefly, if not wholly. addressed to the elements, and particularly to fire 82 పూర్తిగగాకున్నను, ముఖ్యముగ ప్రకృతిశక్తులకు, అందును ముఖ్యముగ అగ్నికి వైదిక కర్మలందు ఒసంగబడిన పూజాదికమునకు పిమ్మట హిందూదేశమున నిదియే అతి ప్రాచీన అరాధనాపద్ధతి అయియుండుననియు నా అచార్యవర్యుని ఉద్దేశ్యము. అనగా వైదిక కర్మలందు అరాధ్యమైన ప్రకృతిశక్తులనుండి సగుణబ్రహ్మమునకు ముముక్షు చిత్తములు అకర్షింపబడినకాలమున ప్రథమతః నీ లింగార్చనము అనగా బ్రహ్మచిహ్న పూజ ఏర్పడి యుండుననియు, నదియు నా యజ్ఞ వాటిక ప్రస్ఫుటముగ నిర్గుణ బ్రహ్మ చిహ్నముగ నుంపబడిన యూపస్తంభమే ఆ నిర్గుణ బ్రహ్మమునకు చిహ్నముగ రూపొంది. అదియు సగుణమూర్తియైన శివశంకరునకు అన్వయింపబడి, శివ

82. H. H Wilson : Hindu Religions, p 139

సూచిత చిహ్నముగ అనగా సాంకేతిక రూపముగ లింగముగ నయ్యెనని యిందు ముఖ్య తాత్పర్యము. అందుచే కాలనిర్ణయము నకు రాని అనాదికాలమున యీ శివలింగార్చనా పద్ధతి భారతదేశ మున జనించినదని దీన వ్యక్తము.

అది అంతట నీ దేశముననే అణగి మణిగియుండక ప్రపంచ మున నితర దేశముల జొచ్చి, వ్యాపించెను. ఆచార్య భూదేవ్ ముఖర్జీ అభిప్రాయమున There is ample testimony in modern times to the fact that the phallism was prevalent in almost every country in the dim ages of antiquity. Even today, there has not been a total extinction of the rites in connection with phallism from countries like Japan, China, Indonesia and the Pacific Archipelago 83 అతి ప్రాచీనయుగముల లింగారాధనము సకల దేశముల గలదని ప్రస్తుతకాలమున, సంపూర్ణ సాక్ష్యము గలదు. నేటికిగూడ, జపాను, చైనా, ఇండోనీషియా, పసిఫిక్ ద్వీపములలో నా లింగార్చనము పూర్తిగ నశింపలేదు. At one time it ran rampant among the aboriginal races of Africa and America and exercised a considerable influence upon their social and religious customs. The Bible and some other sacred scriptures inform us that in days of yore, phallus worship found particular favour with the people of Assyria, Jude , Syria, Asia-minor Babylon and other countries 3

83. Prof. Bhudeb Mukerjee: Indian Culture and Its Antiquity, p 1.

ఒక కాలమున ఆఫ్రికా అమెరికా ఖండములగల ఆటవిక జాతులలో నీ లింగార్చనము ప్రబలముగనుండి, వారి సాంఘిక, మత అచార విషయముల బహుళ ప్రభావమును జూపియున్నది. అతి పూరాతన కాలమున లింగపూజా పద్ధతి ఆస్సీరియా, జూడియా, సిరియా, ఏసియా మైనరు, బాబిలోనియా మొదలగు దేశములగల ప్రజానీకమునకు ప్రేమపాత్రమై యుండెనని బైబులు మొదలగు మత గ్రంథములు తెలుపుచున్నవి. ఈమధ్య బాబిలోను దేశమున పురాతత్వశాఖవారి త్రవ్వకములలో శివలింగ రూపమున ననేకములు లభించెను. In several parts of ancient Egypt various gods under the names of Khem (Kshema) Horus (Hara) Orisis (Iswara) Sebek (Sivaka) Seb (Siva) Sarapis or Serophis (Sarvesa) or the same god under these different denominations, used to be worshipped 83 క్షేమ, హర, ఈశ్వర శివక, శివ, సర్వేశ మొదలగు నామములలో నదే దేవుడు ప్రాచీన ఈజిప్టుదేశమున వివిధప్రాంతముల నారాధింపబడుచుండెడి వాడు అని ఆచార్య భూదేవ్ ముఖర్జీ సవిమర్శక సిద్ధాంతము. సంస్కృత నామములు ఆ యా దేశీయ భాషా సంపర్కముచే భ్రష్టమైయుండి, క్రొత్త నామములవలె గోచరించుటయు నిందు స్పష్టము ఈజిప్టుదేశమునగల పిరమిడులమీద యింకను లింగ స్వరూపములు గలవట. ఈ విధముగ యూరపు దేశమునగూడ ప్రాచీన కాలమున లింగారాధనము వ్యాప్తముగ నుండెను., ఐర్లెండు

1. Prof. Bhudeb Mukerjee: Indian Culture and Its Antiquity, P 1.

దేశమునగల క్రైస్తవ మందిరములలో నీ ప్రాచీన లింగాకారముల గుప్తపరచియుంచిరి. These images are called Sheila-nagin (Sivalinga) by the local people. Phallism was prevalent in Itally for several centuries 83 ఈ రూపముల నా స్థానిక ప్రజలు షీలనాగిన్ (శివలింగ) అని పిలిచెదరు. ఇటలీ దేశమున అనేక శతాబ్దముల లింగపూజ వ్యాపించియుండెను, మరియు త్రవ్వకములలో నీ లింగస్వరూపములు ఇంగ్లండు, స్కాట్లెండు దేశములలో బహిర్గతమయ్యెనట. These were exactly the places where the Roman conquerers of England had built their castles and settlements 83 ఈ స్థానములన్నియు, ఇంగ్లండు దేశమును పాలించిన రోమను చక్రవర్తులు నిర్మించిన రాజభవన ప్రదేశములు. అందుచే నీ ఇంగ్లండు ప్రాంతముల నీ లింగారాధనమును రోమను దేశీయులు ప్రవేశపెట్టిరనుట స్పష్టము. అటులే జర్మనీ, ఫ్రాన్సు దేశముల పూర్వకాలముల నీ లింగార్చనము గలదు. ఈ విధముగ లింగారాధనము ప్రాచీన యూరపు దేశముల సర్వాకర్షణీయమై వ్యాప్తముగనున్నట్లు ఆచార్య ముఖర్జీ నిరూపించియున్నాడు.

పూర్వోక్త ప్రకారము ఈ లింగారాధనపద్ధతి రోము సామ్రాజ్యమునుండి యూరపునకు ప్రాకియుండగ, నా రోము దేశమునకు క్రీటి ద్వీపమును పాలించిన ఒక చక్రవర్తి ద్వారమున ప్రసరించె

---

83. Prof. Bhudeb Mukerjee : Indian Culture and Its Antiquity, P 1,

వమటయు స్పష్టము. గ్రీసు ప్రాంత చారిత్రముల నుగ్గడింపబడిన Bacchus బాకాస్ అను నాతడే బకుడను భారతీయ భూపాలు డనియు, నాతడే ఆపస్తంబ మహర్షి ముఖ్య శిష్యుడనియు, నా మహర్షికీ విధానము చతుర్ముఖబ్రహ్మ ఉపదేశించె ననియు బూర్వమే చూచియున్నారము. ప్రధమమున నీ క్రీటి ద్వీపమునకు గొంపోబడిన గ్రంథములు ప్రస్తుతము లభింపకున్నను, వానిని పారంపర్యముగ Siby lline 'శిబిలిన్' అని యందురనియు, అదియే శివలింగ శబ్ద భ్రష్టరూపమనియు విజ్ఞుల అభిప్రాయము.

ఈ విధముగ In days of yore, Phallic emblems were worshipped in several parts of America and especially in Mexico, Peru, the Hyti Islands ete 84 అతి ప్రాచీనకాలమున అమెరికా, ముఖ్యముగ మెక్సికో, పెరూ, హైటిద్వీపములలో లింగారాధనము గలదనియు, ఆచార్య ముఖర్జీ అభిభాషణము.

శుద్ధ నిరాకార నిర్గుణ బ్రహ్మము చిత్తమున కందనివాడై యుండుటచే, సామాన్య ముముక్షువులకు దూరమైపోయెను. సావయవ రూపమువమన్న బ్రహ్మ, విష్ణు, శివాదులు మరియితర అవతార పురుషులును మానుషాకృతి ధరించి, మానవులవోలె ప్రవర్తించి యుండుటచే వారిలో జూపరులకు అనేక గుణదోషములు గోచరించి,

84. Prof. Bhudeb Mukerjee: Indian Culture and Its Antiquity, p. 1.

శక్తిని సంకుచితపరుప నవకాశముండుటచే, నీ రెండు తత్త్వములకు మధ్యమార్గముగ రూపమై, అరూపమై, శోభిల్లు యీ లింగస్వరూపము సర్వాకర్షణీయమై ప్రపంచవ్యాప్తి నొందియున్నదనుట సముచితము. ఆ విధానము భారతావని జనించి, వ్యాప్తినొంది యుండుటయు ప్రబల సత్యము.

## లింగశబ్ద మీమాంస

కాని యింతటి సర్వాకర్షణీయ సర్వవ్యాప్తతత్త్వము కాలగతమున అసభ్యముగ రూపొందింపబడి అపార్థములకు దారితీయుట విచారకరము. అందులకు, అండాకృతినున్న లింగ స్వరూపములు గాక, స్తంభాకృతి దోచు లింగములును చిహ్నము నా శబ్దమున కన్వయముగ సంస్కృత భాషావాదు లుపయోగించిన లింగశబ్దము గూడ గారణమై యుండనోపు. అందుచే బరబ్రహ్మమునకు సాంకేతికముగ సర్వసృష్టి కాధారమూర్తిగ నున్న యీ అండాకారము, అపార్థములకు గురియై, సృష్టికాధారమైన లింగస్వరూపముగ నన్వయింపబడి, లింగ శబ్దముయొక్క సహజ నిజ తాత్పర్యమును గోల్పోయి, అసభ్యార్థములకు లోనయిపోయినది. ఈ ప్రభావమే పాశ్చాత్య ఖండములగూడ వ్యాపించి, ప్రథమతః బకునిచే నుపయోగింపబడిన సంస్కృత శబ్దము 'ఫలేశ' శబ్దము గ్రీకుభాషలో Phallus 'ఫాలస్' అను రూపాంతరమునొంది, ప్రారంభ దశలలో నెట్టి అర్థమున నుపయుక్తమైయుండెనోగాని, కాలాంతర జనితమైన ఆంగ్ల భాషలో పురుషలింగమునకే అన్వయింపబడుచు, శివలింగమునకు

గూడ వదే అపార్థమును ఒసంగి, లింగార్చనమునందు గొప్ప సంక్షోభము రేకెత్తించినది. 85

## లింగారాధన - అనార్యత్వము

లింగ శబ్దము అనాగరిక సూచికమని చిత్రించుచు, ఋగ్వేదమున ఒక స్థానములో Indra is prayed to, not to allow those whose god is Sisna to disturb the rites of the singers (7-24-5) 86 యజ్ఞాదికర్మల గల్లోలబరచు శిశ్నదైవాసు చరుల రానీయవలదని యింద్రుడు ప్రార్థింపబడ, మరియొకచోట he is represented to have conquered the riches of the city after killing those whose god is Sisna 86 శిశ్న దేవావలంబకుల నగరమును అందుగల సంపదను ఇంద్రుడు జయించి నట్లు గలదు. Here evidently those whose god was Sisna or phallus are meant as the enimies of the Vedic Aryas 86 ఇచ్చట యీ శిశ్నదైవారాధకులు వైదికార్యుల శత్రువులనుట స్పష్టము. Not-withstanding all that is said about the matter, my own belief is that persons here refered to were really some tribe of the aborigines of the country, who worshipped phallus 85 ఈ విషయమును గూర్చి తెలుపబడిన విషయము లెట్లున్నను, ఇచ్చట సూచితమైన వ్యక్తులు శిశ్నపూజ గల దేశీయఆటవికజాతివారై యుండవలయునని నా నమ్మకము.

---

85 Prof. Bhudeb Mukerjee: Indian Culture and Its Antiquity, p 17.

86. Sir R. G. Bhandarkar: Collected Works, Vol. iv. P 163-64

Just then, as the Rudra-Siva cult borrowed several elements from the dwellers in forests and stragglers in places out of the way, so it may have borrowed this element of phallic worship from the barbarian tribes with whom the Aryans came in contact[86] అట్టికాలమున, అరణ్యముల నివసించుచు గ్రుమ్మరుచునట్టివారినుండి రుద్ర శివమతావలంబకులు అనేక విషయముల గ్రహించినట్లు ఆర్యులు ప్రథమతః కలిసిన ఆటవిక జాతులనుండి యీ శిశ్నారాధమును స్వీకరించి యుండవచ్చును అని భాండార్కరు పండితుని సమర్థనము.

ఈ విధముగ భాండార్కరు పండితు డూహించినను ఈ లింగారాధనము మహాభారత అనుశాసనికపర్వకాలమునకు బూర్వము అగోచరమనియు, నా కాలమున నా పూజాపద్ధతి వ్రాత్య నిషాదాది అనార్య జాతులలో గలదనియు నా పండితుడు వచించి, రుద్రుని సర్పాభిమానకునుగూడ అనార్య జాతులనుండి సంక్రమించినది అని వ్రాసెను. పాణినీ సూత్రములకు భాష్యకర్త పతంజలికి తర్వాతనే యీ లింగార్చనము ప్రసిద్ధి చెందినదనియు నా పండితవర్యుని విశ్వాసము.

ఈ విషయమిట్లుండ, దక్షిణ భారతమునకు ప్రాచీనకాలమున యూదు మొదలైన సెమిటిక్ మతస్థులతో వ్యాపార సంబంధమున్నదనియు, The sterner and more repulsive features

86. Sir R. G. Bhandarkar: Collected Works, Vol. iv P 163-64

of Siva as wel as the extremely realistic phallic emblems which represent him r mind us of the Jahve of the Hebrews 87 తీవ్రమును హేయమును అగు శైవవిధానములు ముఖ్యముగ ప్రత్యక్ష లింగ చిహ్న అర్చనము హీబ్రూజాతియొక్క యహూవాను జ్ఞప్తికి దెచ్చుచున్నదని శ్రీనివాస అయ్యంగారు భావించి, లింగారాధనాది విధానము భారతీయముగాక, పాశ్చాత్య దేశములనుండి దక్షిణ భారతమున కేతెంచి, అంత ఉత్తర, దక్షిణ భారతములయం దంతటను వ్యాపించియుండునని విశ్వసించెను. కాని పూర్వగ్రంధమున నీ లింగారాధనము భారతమునుండియే యూరోప్ దేశముల కరుగుటను చూచియున్నాము. అది ప్రథమదశలలో అచ్చటనైన అసభ్యకర అర్థమునగాక 'ఫలేశ' శబ్దముగ వాడబడి, కాలాంతరమున అనూహ్య కారణములచే నీ అర్థాంతరమునొంది, అగౌరవము నొందియుండునని చూచియుంటిమి. అందుచే హీబ్రూ జాతినుండి లింగార్చనము భారతదేశము స్వీకరించె ననుట చరిత్రా కథనమునకు దూరము, అసంగతము.

అటులే భండార్కరు పండితుని భావజాలములు సమర్థనీయ ములు కావు. ఈ విషయమును చర్చించుచు, ఆచార్య నీలకంఠశాస్త్రి Is the Siva linga a phallus ? శివలింగము శిశ్నమా? అని ప్రశ్నించి, చరిత్రకు బూర్వకాలముల గల ప్రాచీన జాతులలో నచ్చటచ్చట శిశ్నారాధన సూచనలజూచి, కొందరు శివలింగపూజ

87. Sri V. T. Srinivasa Iyangar : The Outlines of Hindu Philosophy, p 127.

తజ్జనితమని ఊహింపజొచ్చిరి. శక్తివిధానముల గొన్నింటివి దిలకించినవారి కీ యర్థము రూఢమనియు దోచును. But the linga may have been in origin no more than just a symbol of Siva, as the Salagrama is of Vishnu 88 కాని లింగము యొక్క పుట్టుక విష్ణువునకు సాలగ్రామమువలె శివునకు చిహ్నముగ నేర్పడియున్నది. శివలింగారాధన ప్రారంభముతోడ, శివలింగ పూజాదుల మాహాత్మ్య కథన గాథలు ఎన్నియో కల్పింపబడియున్నవి. శివలింగమునుగూర్చి మహాభారత కథనమునుగూడ అట్టిదియే అగును. అయినను పురాణములలో ననేకములు శివలింగారాధనమును ప్రబలముగ సమర్థించుచు, ప్రతిమారాధనము ఐహికసంపదనొసంగ, లింగపూజముక్తి నిడును నా నుడుటచే శక్తివంతమై శివారాధనము ప్రబలెను. మరియు The Linga purana's version of the origin of the linga as due to Siva becoming a pillar of fire whose top and bottom could not be seen by Brahma and Vishnu is also noteworthy 88 బ్రహ్మ విష్ణువులు అద్యంతముల గ్రహింపలేని జ్యోతిర్లింగాకృతిని శివుడు దాల్చిన లింగపురాణ కథనముగూడ నిందు గమనార్హమని పండిత నీలకంఠశాస్త్రి హెచ్చరిక.

మరల నీ లింగారాధనము అతి ప్రాచీనకాలముల నాటవిక జాతులలో బ్రబల వ్యాప్తముగనుండి కాలాంతర సంసర్గ విశేషమున,

88. Prof K. A. Nilakantha Sastri: The Cultural Heritage of India, Vol. 4, p 67-68.

ఆర్యులకు సంక్రమించినట్లు కొందరూహించుట గాంచియున్నాము. మరియు నా అర్చనము ఒక భారతదేశమున మాత్రమునగాక సర్వ ప్రపంచ ఆదిమ జాతులలో గలదనియు గొందరి యూహ. కాని పూర్వము వచింపబడిన ఆచార్య ముఖర్జీ వాదము ప్రకారము ఆ విధానము భారతజన్యమై క్రమగతముగ బ్రపంచవ్యాప్తి నొంది యుండుట కేవలమూహారూపముగాక చారిత్రక సత్యముగను, శబ్ద వ్యుత్పత్తివిషయిక శాస్త్రప్రకారముగూడ యథార్థముగనున్నది.

అంతియగాక నీ లింగారాధనము మరియొక విధముగగూడ జూడబడినది. Some scholars have gone a step further and assert that in the primitive uncivilized age, when power of thinking was still immature, man was incapable of comprehending that there could be any work of creation apart from sexual relations. That is the reason why these scholars think that phallism had its origin in the uncivilized state of society 89 కొందరు పండితులు ఒక అడుగు ముందునకు వైచి, ప్రాచీన అనాగరిక యుగమున, యోచనాత్మక బుద్ధి యింకను వికసింపకపూర్వము విషయసంబంధములు లేకయు, సృష్టికార్యము సంభవము నా తత్త్వమును గ్రహింపజాలని స్థితిలో మానవుడుండెను. ఈ కారణముచే నట్టి అనాగరిక సాంఘిక వ్యవస్థలో నీ లింగార్చనము జనించినదని యీ పండితుల కారణము, అందుచే In the opinion of these scholars, our

89 Prof. Bhudeb Mukerjee: Indian Culture anp Its Antiquity, p 9-11.

primitive ancesters, such as Brahma Manu Daksha etc., were mute and barbarous creatures like the Ourang outang 89 ఈ పండితుల అభిప్రాయమున, బ్రహ్మ, మనువు, దక్షాది మన ప్రాచీనులు ఒరాంగ్ ఒంటాగు కోతివలె మూగవారై, ఆటవిక మూర్ఖ జీవులగుదురు అని ఆచార్య భూదేవ ముఖర్జీ విస్మయము. అతడింకను యీ విషయమునే పరిశీలించి, if these theories stated above regarding the genesis of phallism were true, the phenomenon of phallic worship would have become more prevalent amongst the barbarous tribes of the modern world, a conclusion which is not at all warranted by facts 89 లింగార్చన జననకారణమును గూర్చిన యీ పై సిద్ధాంతములు సత్యములేయైనచో, నీ లింగారాధన పద్ధతి ఆధునిక ప్రపంచమున ఆటవికులలో నెక్కువగ నుండవలయును. కాని అది ప్రత్యక్ష ప్రమాణములకు దూరము అని వాదించి, హిందూదేశము అధికముగ లింగపూజా తత్పరము, and what do we find here? It is no exageration to say that phallism does not at all prevail among the uncivilized races of India, nor is there any evidence to indicate that it did so, in days of yore. Neither can it be said that it originated from the inordinate lust for sexual gratification of its uncivilized votaries 89 కాని మనమిట దిలకించినది ఏమి? భారతదేశమున లింగార్చనము అనాగరిక జాతుల వ్యాపించి యుండుటగాని, అది అతి ప్రాచీన



89. Prof. Bhndeb Mukerjee : .ndian Culture and Its Antiquity, p. 9.11.

కాలముల నట్లున్నదనుటకు నిదర్శనములుగాని కానరావనుట అతిశయోక్తి కానేరదు. ఆ అనాగరిక జాతుల అత్యంత విషయలోలత్వమునుండి అది జనించినట్లు వచింపజాలము. On the other hand, in the majority of causes, the real votaries of Siva are found to be characterised by a strict abstinence, and some times by a total renunciation of earthly pleasures 89 మీదు మిక్కిలి అధికసంఖ్యాక సమయముల శివభక్తులు బ్రహ్మచర్య దీక్షావతులై యుండుటయు, మరి కొన్ని సందర్భములు, సంపూర్ణ సర్వసంగ పరిత్యాగులుగ నుండుట పరిపాటి, అని అతని నిశ్చయము. ఈ విధముగ లింగ విధానమున అసభ్య అసందర్భరమైన అన్వయముల గల్పించు వాదములు అపవాదములనుగ పండిత భూదేవ్ ముఖర్జీ మహాశయుడు గావించియున్నాడు.

అట్టి అసందర్భ అన్వయము is not only a serious mistake but a grave blunder 90 అతి ప్రమాదకరమైన దోషము మాత్రముగాక, శుద్ధ పొరపాటు అని శివానంద సరస్వతీ స్వామి ఖండనము. ఈ విషయమున గవేషణము గావించియున్న పండిత బార్త్ మహాశయుడు these lingas are perhaps the least offensive to look at Anyhow they are the least materialistic 91 చూపరకు అసభ్యకరములుగావు. ఎట్లయినను

---

89. Prof. Bhudeb Mukerjee : Indian Culture and Its Antiquity, p 9-11.
90. Swami Sivananda Saraswati : Lord Siva and His Worship, p 202.
91. The Editor : The Vedanta Kesari, 1957, p 415.

అవి ప్రాపంచికములుగూడ కావు అని నిర్ణయించెను. అటులే, యతీశ్వరానంద స్వామియు, లింగజనకత్వము లెట్లున్నను, does not call in the minds of the worshippers of Siva any phallic association at all. To them, the linga is just a non-anthropomorphic, aniconic form or symbol of the supreme spirit, though manifest in forms, transcends them all 92 అది శివభక్తుల చిత్తములలో ఎట్టి లౌకిక లింగ సంబంధమును గలుగజేయదు. వారికి ఆ లింగము పరమాత్మ యొక్క అతిమానుష అభౌతిక రూపముగ చిహ్నముగ గోచరించును. పరమాత్మ, రూపముల వ్యక్తమైనను, అతీతముగనే యుండును అని ప్రస్ఫుటము జేసియున్నాడు. సోదరి నివేదితగూడ యీ విషయ పరిశీలనము గావించి, ఉత్తర హిందూస్థానమును జూచినవారు, వృక్షముల క్రింద, నదులదగ్గర, మార్గములచెంత పట్నములలో, గ్రామములలో, వనముల నింక సనేక స్థానముల నిలచియున్న నల్లని పాషాణములచూచి, వాని తాత్పర్యము నెరుంగగోరును. కాని They are said by Europeans to be of phallic origin; but if so Hindus are no more conscious of the fact than we of the similar origin of the May pole 93 యూరోపు దేశీయులు వాని మానవ లింగ జనితముగ తెలుపుదురు. అట్లయినచో, అట్టి సందర్భముల జనించిన మన 'మే' స్తంభము నెట్లు మనము స్మరించుచున్నామో అట్లె హిందువులు లింగోత్పత్తి విషయమును స్మరింపరు అని హాస్యము చేసినది.

92. Swami Yatiswarananda : The Cultural Heritage of India P 437.

93. Sister Nivedita : The Web of Indian Life, p 195.

ఈ విధముగ మీమాంసించినచో, లింగారాధనము అతి నిగూఢ తాత్పర్యముగలిగి, సగుణ నిర్గుణ బ్రహ్మోపాసనములకు మధ్యమార్గమై ఉపాసనావిధానమున ఒక సోపానముగ గ్రహింపవగునుగాని, అద్దాన నెట్టి అసభ్యతగాని హేయత్వముగాని అనూహ్యము అని నిర్ణయము. తద్విరుద్ధ తాత్పర్యము విచారకరము అసందర్భము అని పై విచారణాఫలితముగ గుర్తించెదముగాక!

## లింగ స్వరూపము

స్థూలముగ లింగము ఒక విశిష్టరూపమునగాక వివిధాకృతులలో గోచరము. వీని ఆకారములు విభిన్నములు, అనేకములు. సాధారణముగ వీని ద్వివిధములుగ శాస్త్రజ్ఞులు విభజించిరి. సహజలింగ, మానుషలింగములు నా ద్వివిధములలో, సహజముగ లభించినవి సహజ లింగములని తాత్పర్యము. మానుషములు మానవ నిర్మితములని అర్థము. ఈ సహజలింగములు పునః పంచవిధములు, స్వాయంభువములు, దైవికములు, ఆర్షకములు, గాణాపత్యములు, బాణములని వాని నామములు, స్వాయంభువములు శుద్ధ లింగాకృతిలో లభించిన శిలలని గ్రాహ్యము. సహజముగ రూపొంది అంజలిపుట రూపమునమున్న లింగములు దైవికములు. అండాకృతినుండి ప్రమథగణములచే పూజితములై దొరికినవి గాణాపత్య లింగములు. పూర్వము ఋషివర్య ప్రతిష్ఠితములై లభించినవి ఆర్షకములు నాబడును. నర్మదానదీ గర్భమున జలప్రవాహమున పర్వతముల

నుండి దొరలిదొరలి, అండాకృతి లభించిన లింగములు బాణములు అనబడును.

అట్లుగాక మానుషలింగములు ప్రస్తుత మానుషనిర్మితములు, వీనికి బ్రహ్మసూత్రముగ నొక రేఖ ఉండును. మానుష లింగములు అష్టోత్తర శతములుగను, సహస్ర లింగములుగగూడ నిర్మితము. అనగా నొక బృహల్లింగమున చిన్న చిన్న లింగాకారములు అంతటను సంఖ్యాపద్ధతిని నిర్మింపబడును. కొన్నింటికి శివముఖ పద్మము గూడ గోచరించువిధానమున శిల్పులు నిర్మించెదరు. వాని ముఖలింగములందురు.

మరియు అండాకృతి, స్తంభాకృతిలో ముఖ్యముగ నీ మూర్తులుండును. అండాకృతినున్నవి, సాధారణముగ దేవతార్చనములలో నుండును. కొన్ని ఆలయములలో వీనిగూడ ప్రతిష్ఠించెదరు. కాని వీని ఆకృతి పెద్దదిగ నుండదు. కాని స్తంభాకృతినున్న లింగములు చాల బృహద్రూపముల గోచరము. అమరావతీలింగము సన్ననిదై దీర్ఘముగనుండ, ద్రాక్షారామలింగము అటులే రెండవ అంతస్థువరకు ఉండి, క్రింది అంతస్థులో పాదమును, పై అంతస్థులో శిరము గలిగియుండును. తంజావూరులోని బృహదీశ్వర లింగము దీర్ఘము కాకున్నను, అతి స్థూలాకృతిగలిగి చూపర కానందాశ్చర్యముల గలుగజేయును. అట్లుగాక హిమాలయములలో కేదారేశ్వరలింగము మానవనిర్మితముగాక, పై ద్వివిధ రూపములగాక, ఈజిప్టుదేశమున గల పిరమిడులబోలి, క్రింద విశాలముగనుండి శిరమున అగ్రముగ

కోణము గలిగియుండును. లింగములకుగల యీ వివిధాకృతుల విమర్శించి చూచిన లింగమునకు చిహ్నమను అర్థమే దోచునుగాని అన్యార్థము స్ఫురింపదు.

ఈ వివిధ లింగాకారములు ఎచ్చటెచ్చట భారతావని గలవో స్కాందపురాణాంతర్గత సూతసంహిత, శివమాహాత్మ్య ఖండమున శివస్థానవిచార ప్రకరణమున శ్రీ మహావిష్ణుని ప్రశ్నమునకు సమాధానముగ మహాదేవుడు వివరించెను. కైలాసపర్వతము, వారణాసీ, సోమనాథము, కేదారము, శ్రీపర్వతము, వృద్ధాచలము, గోపర్వతము, శ్రీహరతీర్థము, అధిగ్రామము, శ్వేతారణ్యము, దంతిస్థానము, త్రికోటి, గోపుటతీర్థము, మధ్యార్జునము, కుంభకోణము, సప్తేతరావర్తము, జపేశ్వరము, వల్మీకము, గజారణ్యము, వేదారణ్యము, హాలాస్యము, రామేశ్వరము, పుండరీకము, మొదలగు శివక్షేత్రములు అందు గోచరము.

ఈ స్థానము లన్నింటిలో అతి ప్రధానముగ, ద్వాదశ జ్యోతిర్లింగ స్థానములు ప్రఖ్యాతము, సౌరాష్ట్రమునగల సోమనాథ లింగము, ఆంధ్రరాష్ట్రమున శ్రీశైల మల్లికార్జునలింగము ఉజ్జయిని లోని మహాకాళలింగము, ఓంకారక్షేత్రమునగల అమరేశ్వరలింగము, ప్రజ్వల్యమునందుగల వైద్యనాథలింగము ఢాకినీయందుగల భీమశంకరలింగము, సేతువునగల రామేశ్వరలింగము, దారుకావనమున నాగేశ్వరలింగము, కాశీనగరమున విశ్వేశ్వరలింగము, నాశికాక్షేత్ర

మునగల త్ర్యంబకలింగము, హిమాలయములగల కేదారేశ్వరలింగము, విశాలపురిగల ఘృష్ణేశ్వరలింగములును ద్వాదశ జ్యోతిర్లింగములని ప్రతీతి.

మానవదేహాంతర్గత అప్రత్యక్ష షట్చక్రముల కనుగుణముగ మూలాధారాది అజ్ఞాచక్రమువరకు గల చక్రస్థానముల కన్వయించుచు, కాశీ, కాలహస్తి, వృద్ధాచల, పుండరీక, వాల్మీక, వేదారణ్యముల సూతసంహితా గ్రంథము సూచించియున్నది.

ఈ లింగ స్వరూపాన్వయములలో అనేక రహస్యములు ద్యోతకము. అందు ఒకవిధానమున నీ లింగములు అండ, పిండ, సదాశివ, ఆత్మ, జ్ఞాన లింగములుగకూడ నన్వయింపబడును. అండాకృతినున్న విశ్వమునే లింగస్వరూపముగ విశ్వసించి, అర్చించుట ప్రథమము. జీవోత్పత్తి కారణమైన పిండాకృతిని లింగభావమున దలంచి అర్చించుట ద్వితీయము. ఈ రెండింటికి నాధారభూతుడైన సదాశివుని లింగ స్వరూపమున ఆరాధించుట తృతీయము. కాని వీని కాధారభూతమైన దహర పుండరీక మధ్యస్థ ఆత్మలింగరూపము ను స్మరించి పూజించుట చతుర్థము. వీని కతీతముగనున్న పరబ్రహ్మమునే అవ్యయ అఖండ లింగాకృతి నర్చించుట పంచమముగ విజ్ఞులు వివరించెదరు. పైనుదాహరింపబడిన లింగ స్వరూప నిర్మాణము సదాఖ్యయైన సదాశివున కన్వయింప, కరచరణాద్యవయవోపేతమైన స్వరూపము శివ అనగా నీశ్వరతత్త్వమున కన్వయించునని తజ్ఞుల తాత్పర్యము.

శివలింగ నిర్మాణములో కొన్ని ప్రదేశముల నొక విశిష్టత గోచరించును. కాలహస్తీశ్వర లింగ నిర్మాణమున నథోభాగము గంధర్వ రూపముగను, మధ్యభాగము పరశురాముడుగను, శీర్షము శివస్వరూపముగ నన్వయించుచుందురు. మరియు విశిష్టముగ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను సంపూర్తిగ నొకేలింగమున నన్వయించుచు కొన్ని లింగములు గలవు. కన్యాకుమారి అగ్రమునకు దగ్గరగల సుచీంద్రమున గల శివలింగమునకు అథోభాగము బ్రహ్మపీఠము గను, మధ్యభాగము విష్ణుపీఠముగను, ఊర్ధ్వభాగము పరమేశ్వర పీఠముగను అన్వయించి, మూర్తిత్రయము నొకేస్థానమున మేళనము గావించి, దత్తాత్రేయ నామము నొసంగి అర్చించెదరు. భువనేశ్వర మున బృహదాలయమునగల లింగము అంద, సంభావ్రుతుల నుండక, ఎత్తు తక్కువగ విశాలముగ బట్టురాయిగ నుండి, అగ్రమున మూడు కోణములు గోచరము ఆ కోణముల బ్రహ్మ, విష్ణు, శివపరములుగ నన్వయించి ఆరాధించెదరు.

ఈ విధముగ లింగము కేవలము శివపరముగ మాత్రమే అన్వయింపబడక, మూర్తిత్రయాత్మకముగగూడ నన్వయింపబడుచు, సర్వ సగుణబ్రహ్మ సాంకేతికముగ నుపయోగింపబడుట గమనార్హము. మరియు లింగాకారములుగూడ అత్యంత విభిన్నత్వము గలవిగ నుండుటయు విదితము.

## పంచభూత లింగములు

పూర్వోక్తవిధాన లింగభావన క్రియ, శిరచరణాద్యవయవ విశిష్టమైన సగుణ దైవమునకును, నిర్గుణ నిరాకార నిర్వికార

నిర్విశేష బ్రహ్మమునకును మధ్యమార్గమై పంచభూతాత్మక ప్రపంచ మున స్థూల విషయములనున్న స్థూల మనస్సును, సూక్ష్మ సూక్ష్మ తరముగ గ్రమన్యాయమున నిర్గుణ బ్రహ్మమునకు మార్గదర్శి యగునని చూచియున్నాము, కరచరణాద్యవయవ విశిష్ట భగవంతునిలో ముముక్షువునకు సజాతీయతాదోషములు కానుపించి కొన్నిపేళల భక్తి ప్రపత్తులకు లోపము వాటిల్లును. నిర్గుణము కేవల మూహాతీతము. అట్లుకాక, సాకారమై మరియు నిరాకారమైన లింగ చిహ్నము అద్వితీయ అద్భుత చిత్రణమై, సాధకలోకమున కత్యంతోపయుక్తమై రాజిల్లినది. ఒకవంక నది సర్వసృష్టికి ప్రథమరూపమైన అండా కృతిని సూచించు సృష్టికర్తయగు నీశ్వరుని చిహ్నముగను, రెండవ ప్రక్క తేజోస్తంభరూపమున సర్వ దేవతలకు ముఖస్వరూపుడై హవిర్భాగ స్వీకార సందర్భముల ప్రథముడై యున్న అగ్నిదేవుని సూచించి, ఆ యగ్ని కధినాథుడైన శివుని కన్వయము నొందుచు, నెల్లెడల బరమగోప్యమైన బ్రహ్మమునకు సర్వదా సర్వథా సాంకేతికమై యొప్పారుటయు గాంచియున్నాము.

ఈ లింగ భావన, సాధనములందు మరియొక అంతరార్థము గూడ వ్యక్తము. ప్రపంచమున కరచరణాద్యవయవములుగల జీవులకు ముఖ్యముగ బరస్పరము అనూహ్యప్రేమ సంబంధము గలిగియుండుట స్పష్టము. అటులే ఆ ప్రేమ ప్రవాహమును మానవుడు తన సహచర జీవులపై మాత్రమేగాక సర్వ సృష్టి స్థితిలయ కర్తయైన పరమేశ్వరునియందుగూడ గేంద్రీకరించి భక్తుడై,

క్రమముగ నిస్స్వార్థతా సముపార్జనమున నిర్మలభక్తిచే ప్రపన్నుడై ఈశ్వర సాక్షాత్కారాది అనుభూతుల బొందును. ఈ విధానమున పంచభావములనురీతి మానవుని ప్రేమతత్త్వము పంచవిధముల విభజింపబడి క్రమముగ నిర్మలత్వము నొందినది. దీనినే వైష్ణవ సిద్ధాంతమున శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావములని అనుట వైష్ణవ ఖండమున జూచియున్నాము. శాంతభావమున దూరముగనుండి, దానికే తృప్తిగాంచి, భగవంతుని సేవించి ఆనందించుభక్తుడు, దాస్యభావమున దగ్గరజేరి, శుశ్రూషాదికముచే బరమాత్మని సంతోషపరచి ఆనందించును. సఖ్యభావమున అధికతర సన్నిహితతత్త్వమున దేవుని జేరి, సమానస్థాయిలో వ్యవహరించి ప్రేమించి, అరమరికలులేక చరించి, ఆనందించి, వాత్సల్యభావమున, భగవంతుని దన పుత్రునిగ భావించి, ప్రేమించి, లాలించి, భగవంతునికి నింకను సన్నిహితము కానగును. అంత బంచమమైన మధురభావమున, నీశ్వరు భర్తగ సంకల్పించి, సర్వార్పణ ప్రేమమున, శరణాగతి నొంది, అభిన్నత్వమున మెలంగి సంతోషించును.

కాని ఈ పద్ధతిలో మానవుడు దేవునిగూడ మానవాకృతిలో జూచి, ఐహికసంబంధ దృష్టిలోమాత్రమే వీక్షించి, ప్రేమించి, పరిశుద్ధత నొందునుగాని, యీ పాంచభౌతిక స్థూలశరీర అవధిని దాటనేరడు. అందుచే భక్తుడు ఎంత పవిత్రమైనను యింకను భౌతికదృష్టినుండి బహిర్గతము కానేరడు. మరియు నాటని దృష్టి

భగవంతునిగూర్చియు మానవాకృతియు తత్సంబంధ బాంధవ్యముల మధ్య నిరీక్షించి యుంచునుగాని అలౌకిక అభౌతిక, అవ్యయ ఆనందస్వరూప బ్రహ్మమునకు మార్గగామి కాజాలనిదయ్యెను.

అట్టి స్థూలదృష్టిని యీ బౌతిక విషయములనుండి సంపూర్తిగ ఉద్ధరించి, పరిపూర్ణ నిర్గుణ నిరాకార బ్రహ్మమునకు మార్గమును సూచించుటకై లింగ తాత్పర్యము మిగుల తోడ్పడగలదు. సర్వ సిద్ధాంతముల ననుసరించి యీ బౌతిక సృష్టియంతయు బంచ భూతాత్మకము. పంచీకరణ విధానమున నా పంచ మహాభూతములు పృథివ్యప్తేజోవాయురాకాశములుగ స్పష్టము. స్థూల సృష్టియేగాక మానవు శరీరేంద్రియములుగూడ బంచభూతములవలనను, వాని గుణములైన శబ్దస్పర్శ, రూప, రస, గంధములు నాబడు తన్మాత్రల చేతనుఏర్పడినవి. అనగా ఆకాశ గుణము శబ్దము అగుచుండ, దాని గ్రహించు జ్ఞానేంద్రియముకర్ణము సత్త్వాంశమువలనను. రజో అంశ మూలమున గర్మేంద్రియము వాక్కు జనితము. వాయుగుణ స్పర్శచేత త్వక్ నా జ్ఞానేంద్రియము సత్వాంశమున, పాణి రజోంశ మున గలుగును. తేజస్సుయొక్క రూపలక్షణము సత్వాంశమున నేత్రము నా జ్ఞానేంద్రియమును. పాదము నా కర్మేంద్రియము రజోంశమున జనించెను. జలముయొక్క రసన లక్షణములతో సత్వాంశమున జిహ్వయను జ్ఞానేంద్రియము. రజోంశమున కర్మేం ద్రియమగు ఉపస్థయు బుట్టించెను. అటులే పృథివీ లక్షణము గంధముతో సత్వాంశమున ఘ్రాణమును, రజోంశమున గర్మేంద్రి

యము గుదము జనితము. అనగా నా యా భూతముల సత్వాంశముల నుండి జ్ఞానేంద్రియములును, రజోంశములనుండి కర్మేంద్రియములును జనితములనుట సర్వాంగీకారము.

అదేవిధముగ నీ పంచభూతముల సూచించుచు లింగ నిర్మాణముగూడ బంచవిధములై విరాజిల్లుచున్నది. ఈ లింగ నిర్మాణ రహస్యార్థముల, వాని సాధనారీతుల గ్రహించినచో, బూర్వోక్త పంచభావ పద్ధతిని స్వార్థ మమకారములనుండి నిస్స్వార్థ నిర్మల భక్తిప్రపత్తులచే శోభిల్లు సాధకచిత్తము, అట స్థూలత్వమునుండి సూక్ష్మతమ స్థితుల కరుదెంచి, నిర్గుణ నిరాకార ఆత్మజ్ఞానమునకు జేర్చు మహత్తరాద్భుత సాధనాక్రమము యిందు గోచరము.

ఎట్లులన? ఈ లింగములుగూడ బంచ మహాభూతములైన పృథివీ, జల, అగ్ని, వాయు, ఆకాశములవలె బంచవిధములు. పై పంచవిధ లింగారాధన, ఉపాసన జేయు సాధకుడు స్థూలములైన జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ప్రవృత్తుల నియమించి పాలించి జయించుట అవసరము. పృథ్వీభూత లింగము కేవలము సైకత జనితమై, భూతముల స్థూలత్వమును సూచించుచు అది రామేశ్వరము నందును, కాంచీపుర ఏకామ్రేశ్వరాలయమునను గలదు. ఈ లింగారాధన మొనర్చు భక్తుడు పృథ్వీసంబంధ ఘ్రాణేంద్రియ. గుదముల స్వాధీనపరుచుకొనవలయును. ద్వితీయము జలలింగము. అది జంబుకేశ్వరాలయమున గలదు. దీని జేరు ఉపాసకుడు యిట జిహ్వా. ఉపస్థల ప్రవృత్తుల నియమించి. నిరోధించి జయింపవలయును.

తేజోలింగము అరుణాచలక్షేత్రమున గలదు. అద్దాని లక్షణము రూపము. తదారాధనా నిష్ఠుడు, పూర్వార్జిత బ్రహ్మచర్యాది జయము లతో సహ జ్ఞానేంద్రియ కర్మేంద్రియములైన నేత్ర, పాదములను జయింప నుద్యుక్తుడు కానగును. అనగా ప్రపంచ దృశ్యముల జూచు కాంక్ష, దేశముల గ్రుమ్మరు బుద్ధినరికట్టి, ఒక్కచో నుండి సాధనకు గడంగవలయును. ఈతనికి తీర్థ యాత్రాదులుగూడ అన వసరము. ఈ స్థితికి అరుదెంచిన సాధకుడు మార్గమున అర్ధమును దాటినట్లు గదా! ఇక వాయు లింగము కాళహస్తిలో గలదు. దీని నుపాసించువాడు, తీవ్రసాధకుడుగ నుండుటచే నతడు త్యాగిం ద్రియ గుణములైన స్పర్శను, కరములచే చేయు అనవసర కార్య ములను అరికట్టుచు, జీవనవిధానమునే రూపాంతర మొనరించుకొనును. అతని శీతోష్ణాదికబాధలు దరికి జేరవు. అవసర కర్మలనుగూడ దూర మొనరించి, నిగ్రహించు వానికి నింక అనవసర ప్రమేయము లెచ్చట! అందుచే నీ ఉపాసకుడు సంపూర్ణముగ అంతర్ముఖుడు. అంత ఆకాశలింగము చిదంబర క్షేత్రమున నున్నది. అట లింగా కారము ఏమాత్రముగూడ కానరాదు. నల్లనిరంగు గూడులో నిరా కార అంతరాళమునకు సువర్ణ బిల్వపత్రముల మాలాకృతిమాత్రము అచట దోచును. లింగము ఆకాశస్వరూపముగాన రూపరహితము, సర్వాంతర బహిఃస్వరూపము, అనగా నిరామయ తత్త్వము. అందు చేతనే గదా శాస్త్రములు ఆకాశం గగనం శూన్యం' అని వచిం చుచు, నాత్మనిర్వచనమున 'ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః' అనియు దెలిపియున్నవి. అందుచే నిత్యమై సర్వవ్యాప్తముగనున్న ఆ ఆత్మను సూచించుచు నిట లింగము నా చిహ్నముగూడ అదృశ్యమై గగన మున లయించినది. అటులే, ఇంద్రియ జయమున గడపటివగు

శ్రోత్ర వాక్కులు యీ చివరి సాధనయందు గలవు. పూర్వేం ద్రియ జయము సులభసాధ్యముగాని, యీ ద్వయము కష్టసాధ్యము. అందుచే వీని ప్రథమమున శ్రవణ, మనన, నిదిధ్యాసనలచే శ్రోత్రప్రవృత్తిని పవిత్రమొనర్చి, అనంతరము జడభరతునిచందము అజగరన్యాయమున నుండ మార్గదర్శకమగు నీ అంతిమ సాధన. వాగింద్రియము గూడ ప్రథమతః మౌనాది వ్రతములచే నియమితమై, అవసరములు ఈశ్వరార్పితమై, క్రమముగ నిత్య నిరంతర మౌన దృష్టితో జడ నిర్వికల్పక సమాధికి మార్గగామి అగును. అందుచే నాకాశలింగ తాత్పర్యమును గ్రహించి, తదనుగుణ సాధనకై పూర్వసాధనల నుత్తీర్ణుడై, పూర్ణాధికారియై నుద్యుక్తుడైన ముము క్షువు, సులభముగ బూర్ణానుభవ సంపన్నుడై, అద్వైతసిద్ధి పొంది, సమాధుల జరించుచుండును.

ఈ విధముగ శివ ప్రతిమారాధనమునుండి, శివలింగార్చన మును సాగించి, ప్రతిమనుండి ప్రతీకమునకు జేరి, అట నా ప్రతీ కమునుండి సర్వాతీత నిత్య నిరంతర అద్వైతానుభూతిబొందు మార్గము నీ లింగనిర్మాణమున రహస్యముగ నిమిడియుండుట దీన గ్రాహ్యము. అందుచే నీ శైవసంప్రదాయమునగల యీ లింగారాధ నము. కేవలము శైవమతావలంబకులకేగాక సర్వేతర సాధకులకు అతిముఖ్యమై, చిత్త పరిణామ కార్యమున అత్యంతోపయుక్తమై, ప్రాథమికమునుండి ప్రౌఢసాధనవరకుగల సోపానముల జూపి, సాధకుని అందు నడిపించి, పర్యవసానమైన బ్రాహ్మీస్థితికి జేర్చు మహోత్కృష్ట మార్గరాజమై వెలసియున్నది. అందుచే నిది ముముక్షు లోకమునకు అనివార్యము, ఆవశ్యకము, ఆలంబనీయము.

—o—

# శివుడు - వేదశాస్త్రములు

## రుద్రుడు - ఋగ్వేదము

Saivism is one of the cardinal aspects of Hinduism. It is as old as India and perhaps even older 94 శైవము హిందూమతమున నొక ప్రధానమైన అంశము. అది భారతావని ప్రాయముగలిగి, బహుశః అంతకంటె ప్రాచీనమై యుండునని వచింపబడు శైవము ప్రస్తుత రూపమున గాకున్నను యితర రూపముననైన వేదముల గలదా? ఆ వేదములు The first flowers of India's spirituality, హైందవ పారమార్థికతకు ప్రథమ కుసుమ సంచయమనియు, Composed at the dawn of Hindu civilization. హైందవ నాగరికతోదయ కాలమున నిర్మితములనియు నుతింపబడి యుండెనుగదా! బర్న్ హోఫరు వాక్యములలో వేదవాక్యములు like the larks morning thrill of humanity awakening to the consciousness of its greatness. తన మహోత్కృష్టస్ఫురణమునకు భరద్వాజ పక్షి యొక్క ఉదయకాల జాగరణ రవమువలె నున్నదిగదా! అందుచే సర్వ భారతీయతకు వేదమే ఆధారము, ప్రమాణము. కావున వేదమున శివునకు, శైవమున కెట్టి అవకాశమున్నదియో చూచెదము గాక.

'శ్రేష్ఠో జాతస్య రుద్ర శ్రియాసి తవ స్తవసాం వజ్రబాహో।
పర్షి ణః పారమంహసః స్వస్తి విశ్వా అభీతీ రపసోయుయోధి।'

---

94. K. Vaidyanadhan : The Indian Express, 26-4-1964.

(ఋ. వే. 2 మం. 4 అ. 1-3) ఓ రుద్రా! నీ వెల్లజాతములలో శ్రేష్ఠుడవు. వజ్రాయుధధరుడవై నీవు బలిష్ఠులకు బలిష్ఠుడవు. పాపసంద్రమునుండి మమ్ము గడతేర్చుము. దోషాఘాతముల నన్నింటి బారద్రోలుము అని ఋగ్వేద మంత్రము రుద్రుని స్తుతించుచున్నది. ఈ సూక్తమున బదునైదు మంత్రములుగూడ నిదేవిధముగ రుద్రుని గొనియాడుచున్నవి. పై మంత్రము రుద్రు సర్వశ్రేష్ఠునిగ జిత్రించి నది. ఆ సూత్రమున రుద్రుని సంబోధించుచు, 'క్వ స్య తే రుద్ర మృళయాకు ర్హస్తో యో అస్తి భేషజో జలాషః। అపభర్తా రపసో దైవ్యస్యా భీ ను మా వృషభ చక్షమీథాః।' (2.4.1.7) ఎల్లరకు ఔషధమై సంతోషము నొసంగు నీ ఆనంద ప్రదాత హస్తము ఎట నున్నది? దేవతాగణముయొక్క పాపముల నివృత్తి చేయు వాడా! శీఘ్రముగ నాపై గరుణ జూపుము అని అతని ఆనంద ప్రదాతగ రూపొందించుటయే గాక దేవతలగూడ నుద్ధరించు ప్రము ఖునిగ బ్రదర్శించినది. అట పై మంత్రమున నాతని 'ప్ర బభ్రవే వృషభాయ శ్వితీచే మహా మహీం సుష్ఠుతిమీరయామి। నమస్యా కల్మలీకినం నమోభి ర్గృణీమసి త్వేషం రుద్రస్య నామ।' (2.4.1. ) తెల్లని ముఖపద్మముగలిగి, ఎల్లరకు వరముల నొసంగుచు బోషించు వానిని, పాపహారిని నమస్కారములతో హృదయపూర్వక ప్రార్థన ములతో నుతించెదము. అతని ప్రఖ్యాతనామమును కీర్తించెదరు అని రుద్రుని అగ్రస్థానమున నధిష్ఠింపజేసి యున్నది. ఆతని 'ఈశానాదస్య భువనస్య భూరే' (2.4.1.9) భువనములకు ఈశానుని పాలకునిగ రూపొందించి, ఆతనికి శక్తివంతములైన అవయవములును, వివిధ

రూపధారణమును ఉగ్రత్వము, కనకాభరణములును, కపిలవర్ణమును గలిగినట్లుగూడ మతించినది. ఆతని నధికతరస్థాయి గీర్తించుచు, విశ్వమునంతటిని బోషించువాడు రుద్రుడే యని సంబోధించి, 'న వా ఓజీయో రుద్ర త్వదస్తి' (2.4.1.10) నీ కంటె శక్తివంతుడు అన్యుదెవ్వడు లేడని నిర్ణయించె నా సూక్తరాజము. అతడు ధరించు శస్త్రాస్త్రములద్భుతములట। అతని కంఠహారముగూడ శోభాయమానమట। అతని ఉగ్రత్వము 'మృగం న భీమం' అని ఘోర మృగములకుకంటె నధికమట। అయినను అతడు 'యితవానం' (24.1.1.11) నిత్య యౌవనుడునుగూడ నైయున్నాడట। మరియు నా రుద్రుడు దివ్యమైన వాడును సర్వజ్ఞుడును నైయున్నాడు (1.4.1.15) ఈ విధముగ నీ ఋగ్వేదీయ సూక్తము రుద్రుని సామాన్య దేవతలలో బరిగణింపక, సర్వోత్తమ సర్వాధిపతిగ భావించి, స్తుతించియుండుట గమనార్హము.

ఈ భావనములతో ఆతని శస్త్రాస్త్రముల నుతించుచు (7.3.13.1;6.6.13.4) కొన్ని మంత్రములును, 'కద రుద్రాయ ప్రచేతసే మీ హ్ళృష్టమాయ తవ్యసే వోచేమ శంతమం హృదే' (1.8.8.1) ప్రచేతసుడును, దయాపరుడును, బలవంతుడును మా హృదయాధిపాసుడునైన రుద్రునకు మేము కృతజ్ఞతా మంత్రముల బఠింతుముగాక అని రుద్రుని స్తుతించి, ఆతని గుణగణముల గొనియాడినని. అతడు యజ్ఞ రక్షకుడుగను (1.8.8.4; 1.16.9.4), యజ్ఞ దేవతగను (1.18.5.1; 2.4.1.5:) (4.1.3.7; 7.3.๑.5),

వరప్రదాతగను (5.3.9.2; 7.3.2.6; 7.3.7.5), భువనస్య పితరం' (6.4.6.10), విశ్వజనకుడుగను, గౌరవనీయుడుగను (6.8.13.4), 'స హి క్షయేణ క్షమ్యస్య జన్మనః సామ్రాజ్యేన దివ్యస్య చేతతి' (7.3.13.2). మర్త్య దివ్యలోక సామ్రాజ్యములకు ప్రభువుగను (1.16.9.10), అన్నదాతగను (7.3.3.5; 2.4.1.6; 7.3.13.1), అనేక మంత్రములలో ఋగ్వేదము నిరూపించియున్నది. 'తద రుద్రాయ స్వయశసే' (1.19.3 3) అను మంత్రము అతని ప్రస్ఫుట యశస్సును గొనియాడ, అతనికి సప్తరత్నములు (6. .18.1) మొదలగు సంపన్నత గలదని ఒక మంత్రము స్తుతించును.

'ఋగ్వేద ప్రథమ మండలమున నొక సూక్తము సంపూర్ణముగ రుద్రస్తుతికై వినియోగింపబడినది. అందు గొంతవరకు రుద్రుని అకారము చిత్రింపబడియున్నది. 'ఇమా రుద్రాయ తవసే కపర్దినే క్షయద్వీరాయ ప్రభరామహే మతీః। యథాశమసద్ ద్విపదే చతుష్పదే విశ్వం పుష్టం గ్రామే అస్మిన్ననాతరం' (1.16.9 1) జటధారియు, వీరులజయించువాడును ద్విపాద చతుష్పాదములును, యీ గ్రామమునగల సర్వజీవులును సురక్షితముగ రోగరహితముగ నుండుటకై ప్రతిభావంతుడైన రుద్రునకు యీ సంస్తుతుల నర్పించుచున్నాము అని రుద్రునికి జట ధారణము జూపినది. ఆ విషయము 'కపర్దినం' (1.16.9.5) అనుచు మరియొక సూక్తము సూచించును. అతడు తేజస్వి అనియు (1.16.9.5) ననేక విధముల ప్రార్థించి అందలి భక్తుడు 'ఉప తే స్తోమాన్ పశుపా ఇవాకరం' (1.16.9.8.)

పశువులను పశుపాలకునకు ఒప్పగించునట్లు నీకు యీ స్తుతుల నిచ్చుచున్నాడనని తన కర్తవ్యతా దృష్టిని వెలిబుచ్చెను. అతడు యువకుడు ఉగ్రుడు (2.4.1.11). 'స్థిరోభిరంగైః పురురూప ఉగ్రో' (2.4.1.9) స్థిరమైన అవయవములు వివిధాకృతుల గలిగి ఉగ్రుడనియు, తెల్లని ముఖముగలవాడు (2.4.1.8). 'ఋదూదరః సుహవో' (2.4.1.5), కపిలమై మృదువైన ఉదరమును, సుందరమైన చుబుకము గలవాడు అనియు నిట వర్ణనము.

పూర్వ మంత్రమున (1.16.9.1) రుద్రుడు, ద్విపాద చతుష్పాదాది సర్వ జీవరాసుల శ్రేయము ప్రసాదించువాడని చూచియున్నాము. ఈ విషయమునే ఋగ్వేదమున యథా నో అదితిః కరత్ పశ్వే నృభ్యో యథా గవే। యథా తోకాయ రుద్రియం' (1.8.8.2) మన పశు ప్రజ సంతానములకు రుద్రుని వరముల పృథివి మనకు అందజేయునుగాక అను మంత్రముల నాతడు పశువుల బోషించువాడని గ్రాహ్యము. కాని ఒక మంత్రమున 'ఆరే తే గోఘ్నముత పూరుషఘ్నం' (1.16.9.1) గోహత్య నరహత్య గావించు ఆయుధముల దూరముగ నుంపు మని రుద్రుని ఋషులు ప్రార్థించిరి. అనగా విరోధుల, సంఘద్రోహుల బాధించు ఆయుధముల, దమపై ప్రయోగింప జనదని మంత్రకారుని అభిప్రాయమై యుండనోపును।

మరియు నతన్ని జీవుల వ్యాధినివారణార్థమై అనేక దివ్యౌషధముల గలిగి వాని నుపయోగించు భిషగ్వరేణ్యుని గాందముగూడ

మంత్రములు కొనియాడినవి 'భేషజా' (1.16.9.5). 'యచ్ఛం చ యోశ్చమమరాయేజే పితా తదశ్యామ తవ రుద్ర ప్రణీతిషు' (1.16.9.2) వ్యాధులనుండి విమోచనమును, ప్రమాదములనుండి రక్షణమును రుద్రా! పొందుదుముగాక అను మంత్రమున వ్యాధి నివారణోపాయములు సూచింపబడినవి, అటులే 'భేషజం' (1 8 8.4; 8.4.9.5.) అను శబ్దము ఉపయోగింపబడినది. 'సోమా రుద్రా వి బృహతం విషూచీ మమీవా యా నో గయమా వివేశ' (6 6.13.2) సోమరుద్రులారా! మా నివాసముల ప్రవేశించి వ్యాపించిన విషూచీ వ్యాధిని పారద్రోలుడు, అనియు, ప్రార్థించి, రుద్రుడు యథార్థమున 'ఉన్నో వీరాం అర్పయ భేషజేభిః భేషక్తమం త్వా భిషజాం శృణోమి' (2.4.1.4) రుద్రా! నీవు వైద్యులకే వైద్యుడవని వినియున్నావని రుద్రుని వైద్యప్రవృత్తిని ఉన్నతస్థాయిలో రూపించి స్తుతించిరి మహర్షులు.

రుద్రుని అగ్నితో పోల్చి అర్చించుటయు, లేక రుద్రాగ్ని అభిన్నత్వమున ఆరాధించుటయు వేదమున గాననగును. అగ్ని రుద్రుల కభేదమును వచించుచు 'త్వమగ్నే రుద్రో అసురో మహోదివి' (2.1.1.6) ఓ అగ్నీ! నీవు రుద్రుడవు. అసురుల నంతరిక్షమునుండి ద్రోలెదవు అని కీర్తించుచు, 'అ రోదసీ బృహతీ వేవిదానాః ప్ర రుద్రాయా జభ్రిరే యజ్ఞియాసః విదన్మర్తో యదితా చికిత్వా వగ్నిం పదే పరమే తస్థివాంసం॥' (1.12.8.4) పూజింప దగవలసిన దేవతలు, అగ్నికొరకై భూనభోంతరాళముల విచారించి,

రుద్రునికై సూక్తముల బఠించిరి అని అగ్నిదేవుని స్థానమునకాక అగ్నియే రుద్రుడను సత్యమునకై సూక్తములు వెలసినవి. ఈ సూక్తమునందు గొంచెముగ బ్రహ్మవిష్ణువుల స్పర్థానివారణార్థమై శివుడు అగ్నిస్తంభముగ నావిర్భవించుట సూచితమేమో అనిపించును. భూలోకాది ద్యులోకపర్యంత మాక్రమించిన అగ్నియే యిందు రుద్రుడను తాత్పర్యము గోచరమేమో !

ఋగ్వేదమున ననేక మంత్రములలో రుద్రునికి, ఇంద్రునికి సహాయకులగు మరుద్గణము (5.5.1.1) పుత్రులని తెలుపబడియున్నది. (1.15 8.5, 1.15.7.5, 1.14.1.1, 1.11.7.12, 2.3.9.1, 5.3.10.15, 8.3.8.2) వీరు బహు ప్రతిభాశాలురై ఇంద్రునికి యుద్ధకాలముల నండదండగ నిలుచుటయు వివరింపబడినది.

ఈ మరుద్గణము రుద్రునికి, వసువుల పుత్రికయు, ఆదిత్యుని సోదరియు (8.10.9.10), నగు పృశ్నివలన గలిగినట్లు ఋగ్వేద మంత్రముల కథనము. పృశ్ని శబ్దము కిరణమను అర్థము గలది కావున రుద్రుడు అగ్నిసన్నిహితుడు అని దీనగూడ గోచరము. కాని ఋగ్వేదమున రుద్రునకు ఉమా, పార్వతీ మొదలగు నామముల వ్యవహరించు భార్యా ప్రస్తావనమే గానము. నాటి రుద్రుని ఆమె జేరలేదేమో !

పై విషయముల సమీక్షించుచు, The name of Siva is unknown to the Vedas. Rudra is used in the Rig-Veda for Agni, and Maruts are his sons. He is lauded

as the lord of the sacrifices and songs, the best and the most bountiful of gods, the lord of nourishment, who grants prosperity, and welfare to cows horses, sheep, men and women, brives away diseases, disperses remmies and removes sin 95 వేదములలో శివ నామము అవిదితము అగ్నిస్థానమున రుద్రుడు ఋగ్వేదమున దెలుపబడెను. అతనికి మరుద్గణము పుత్రులు. యజ్ఞ, మంత్రములకు ప్రభువనియు, సర్వేతర దేవతలకంటె నధికతర వరప్రదాత అనియు నుతింప బడెను. సంపదల నొసంగువాడై గో అశ్వ మేష పురుష స్త్రీ గణములకు శ్రేయము నొసంగువాడై వ్యాధుల ద్రోలువాడును, శత్రుల నడువాడును, పాపమును నిర్మూలించువాడనియు గలదు. ను వజ్రాయుధ ధరుడు, శస్త్రాస్త్రధారుడు ఉగ్రుడు అనియు ంపబడెనని మహామహోపాధ్యాయ ప్రసన్నకుమార ఆచార్య ండితుడు చక్కగ సంక్షిప్తముగ దెలిపియున్నాడు. ఇందు పూర్వోక్తి ందము ప్రత్యక్షముగ శివనామము కానరాకున్నను అతని ముఖ్య క్షణములును, ఆకారముగూడ సువ్యక్తము.

సుప్రసిద్ధ విమర్శనాశీలుడైన భాండార్కరు పండితుడు తన వసిద్ధాంత గవేషణా గ్రంథమున రుద్ర-శివతత్త్వ పరిణామ ము వివరించుచు, ఋగ్వ గ్రంథస్థ విషయముల ప్రస్తావించి, నవి శరపరంపరలు పశు, పక్షి, ప్రజానీకముల దృష్టికాలమున

Mahamahopadhyaya Dr. Prasannakumar Acharya : Glories of India, P 160.

నశింపజేయు విధానమును బరిశీలించి, Here the distructive agency of lightning seems to have been clearly in view 95 ఈ మారణ కారణత్వమున విద్యుల్లత వారి దృక్పథమున విస్పష్ట గోచరము అని వ్రాయును. When, in consequence of the prayers or in the natural course of things, the cattle go unharmed, Rudra is represented to be Pasupa, or protector of the cattle 96 (ఉప తే స్తోమాన్ పశుపా ఇవాకం) (1. 16. 9. 9) ప్రార్థనములవలన గాని ప్రకృతి సిద్ధముగగాని పశువులు నిరపాయముగ నున్నచో, రుద్రుడు పశుపోషకుడుగ పశుపా అను శబ్దమున జూడబడెను. అటులే శిశువులను గ్రామస్థులను వ్యాధులనుండి నివారింపవలెననియు రుద్రుడు ప్రార్థింపబడుటచే, Rudra was thus believed to cause diseases. and when men recovered from them 96 రుద్రుడు వ్యాధులకు హేతువుగ విశ్వసింపబడెను. వ్యాధులనుండి ప్రజలు తేరుకొన, అద్దానికి రుద్రుడు కారణమని అతనిని భిషగ్వరేణ్యునిగ వేదము చిత్రించినది. పై భావముల కన్నింటికి నాధారముగ భాండార్కరు పండితుడు. 'మా నస్తోకే తనయే మా న అయౌ మా నో గోషు మా నో అశ్వేషు రీరిషః। వీరాన్ మా నో రుద్ర భామితో వధీర్హవిష్మంతః సదామిత్ త్వా హవామహే॥' (1. 16. 9. 8) ఓ రుద్రా! నీ కోపముచే, మా బిడ్డలను వారసులను పశువులను గృహములను మా ప్రజానీకమును నశింపజేయకుము. నిన్ను సదా హవిస్సులతో ప్రార్థించెదము

96. Sir R. G. Bhandarkar: Collected Works, Vol iv p 146

అను మంత్రము నాధారముగ గొని, రుద్రుడు సహజముగ నుగ్రుడై, జీవరాసులకు ప్రమాదభూతుడై, ప్రార్థనములచే శాంతుడై, రక్షించు నను అభిప్రాయమును వ్యక్తపరచియున్నాడు. కాని Here even in the Rig-Veda, Rudra is raised to supreme power 96 ఇచట ఋగ్వేదములోగూడ రుద్రుడు అత్యంత ప్రధాన స్థానమునకు గొంపోబడెనవియు నాతని వచనము. సహజముగ అపకారియై, ప్రార్థనలచే ఉపకారియగు రుద్రుడు అత్యంత ఔన్నత్యమునకు ఎట్లు రాగలడో యిందు అనూహ్యము. అధికసంఖ్యాకమైన మంత్రముల అతడు కృపామయుడుగ, యజ్ఞాధిపతిగ, పాలకుడుగ, చిత్రింపబడుట జూచియున్నాము. అతనియందు జనులకు అపార భక్తి గౌరవములు ఉన్నట్లు మంత్రములు వ్యక్తపరచుచున్నవి. అందుచే భాండార్కరు పండితుని భావములు వేద తాత్పర్యమునకు భిన్నములని తోచును. కష్టకాలముల, నతని, కష్టములనుండి రక్షించు మహాదేవునిగ విశ్వసించి, నాటి సంఘము ప్రార్థించి యుండదగును. అందుచేతనే ఆచార్య మహాదేవన్‌గూడ In the Rudra hymns of the Rig Veda, Rudra figures as the highest God who is appealed to for warding off evil and for benefaction 97 ఋగ్వేదీయ రుద్రసూక్తములలో కష్టనివారణము కొరకు, అనుగ్రహముకొరకు ప్రార్థింపబడు సమున్నత దైవముగ రుద్రుడు గోచరించును అని వక్కాణించెను. అందుచే ఋగ్వేదమున

96. Sir R. G. Bhandarkar: Collected Works, Vol iv p 146
97. Prof. T. M. P. Mahadevan: Prabuddha Bharata, 1953, p 131.

రుద్రునకు అతి ప్రముఖస్థానము గలదనియు, అతడు ప్రజానీక భక్తి, ప్రేమల జూరగొనిన అభిమాన దైవముగ నుండెననియు, అతనికి శివనామము అచట అన్వయింపబడకపోయినను, శివ గుణములు అతనిలో జాల అన్వయించుననియు దోచును.

## రుద్రుడు - వేదములు

యజుర్వేదము సప్త స్కంద సంయుక్తము. రుద్రాధ్యాయము నా శతరుద్రీయము అందు మధ్య స్కందమున విలసితము. అందు సహస్రసంఖ్యలో రుద్రమంత్రములు గోచరము. దాని మధ్యస్థమున 'నమః శివాయ' అను మంత్రరాజము గలదు. ఈ మంత్రరాజమే శైవులకు అత్యంత ప్రధానమై తారణోపాయమై విరాజిల్లినది. యజుర్వేదమున రుద్రునిగూర్చి ప్రస్తావించి, వివరించి, ఆరాధించి, రుద్రునకు అత్యంతోత్కృష్టతాస్థానమును దేవతాగణము లలో నొసంగిన దీ శతరుద్రీయము.

పండిత భాండార్కరు అభిప్రాయమున శతరుద్రీయమున రుద్రుడు appears in a much more developed form 98 అధికతర అభివృద్ధినొందెన రూపమున గోచరించును. అతని ఉగ్ర స్వరూపమునుండి, అతని శివత్వము ప్రత్యేకింపబడినది. ఇచటనే 'గిరీశ' పదము అతని కన్వయింపబడెను. నల్లని మేఘముల

98. Sir R. G. Bhandarkar: Collected Works, Vol iv, 146-150.

జుట్టుగల విద్యుల్లత అతని శరీరముగను, ఆ కృష్ణ మేఘములు అతని నీలకంఠముగను రూపొందినవనియు ఆ పండిత మహాశయుని ఉద్దేశ్యము. ప్రకృతిలోని దుష్టశక్తుల కధినాయకుడై, ప్రజాబాహుళ్యమునకు దూరముగ నివసించుచు గాననముల గ్రుమ్మరు చోరులకు అధిపతిగ వర్ణింపబడెనని అతని కథనము. అగ్నిజ్వాల నన్వయించుచు నతని 'గపర్ది' అన జటాజూటధారి యని వచింపబడినదట. అనగా అగ్నియే రుద్రుడుగ భావింపబడియుండునని తాత్పర్యము. అతని సౌమ్యతత్త్వమును వ్యక్తపరచుచు, శంభు (వరదుడు), శివ (శుభకరుడు) అను నామములు శతరుద్రీయమునకు సమాప్తమున దెలుపబడినవి. ఈ విధముగ శతరుద్రీయమును గలిగిన యజుర్వేదము రుద్రునికి శివ, శంభు, భవాది సౌమ్య లక్షణముల నన్వయించి, అతని పరిణామకార్యమున నెక్కువగ దోడ్పడెనని భాండార్కరు మహాశయుని అభిప్రాయము.

శతపథ బ్రాహ్మణమున రుద్రుడు ఉషస్సునకు బుత్రుడుగ సూచింపబడి (7.1.3.7), జననకాలమున ప్రజాపతి అతనికి రుద్ర, శర్వ, ఉగ్ర, అశని, భవ, పశుపతి, మహాదేవ, ఈశాన అను ఎనిమిది నామముల బెట్టినట్లు గోచరము. అందు ప్రథమ చతుష్టయము రుద్రుని వినాశకర శక్తిని, ద్వితీయ చతుష్టయము అతని సౌమ్య లక్షణముల వ్యక్తపరచును. అనగా అనుగ్రహానుగ్రహముల సమస్థానముల నుంచువాడని తాత్పర్యము. ఈ నామములు ప్రత్యేక దేవతలకు జెందియుండి కాలక్రమమున రుద్రుని కన్వయించి

యుండుననియు, లేక, వివిధ దృక్పథముల దోచు నా దేవుని కా నామములు విశేషణములై కాలక్రమమున నామములై యుండ నోపుననియు నా పండితవరుని భావము. ఇట రుద్రుడు ప్రకాశ వంతుడగు ప్రభువుగను, సర్వభూతముల కధిపతిగను, తారకాచంద్రు లకుగూడ నియంతగను, అంతరిక్షాది స్థానముల బాలకుడుగను, సర్వాంతర్యామిగను, సర్వ రక్షకుడుగను, సంపూర్ణముగ ఈశానుడుగను పూర్ణత్వమునొందెను. 98

అటులే అధర్వణవేదమున రుద్రుడు అధికతర స్థానము నధిష్ఠించెను. భవ, శర్వాది నామము లతని కన్వయింపబడెను. ఈ వేదమున భవ, శర్వులు వేరువేరు దేవతలై ద్విపాద చతుష్పాద జీవులపై పాలనముగలిగినవారు. వారికి శస్త్రాస్త్ర ప్రయోగ నైపుణ్యము, విశాల సామ్రాజ్యాధిపత్యము గలదు. వారు సహస్రాక్షులు. వజ్రా యుధధరులు. ఇందు శర్వుడు ఆయుధధరుడై యుండ, భవుడు పాలకుడు. కాలానుగతముగ వారిరువురు రుద్రునితో నేకత్వము నొందిరి. అగ్నియందును, జలములందును, మూలికలందును, రుద్రు డున్నట్లు యిట వర్ణింపబడినది. భవ, శర్వ, రుద్రులు అన్య దేవతలుగ నీ వేదమున (11. 6. 9) తెలుపబడెను. చంద్రనక్ష త్రాదులు రుద్రుని నియామకమున జరించును (13. 4. 28), భవుడు ప్రాగ్దేశమును, శర్వుడు దక్షిణమును, పశుపతి పశ్చిమప్రాంతములను,

98. Sir R. G. Bhandarkar : Collected Works, Vol. iv, p 146-150.

ఉగ్రుడు ఉత్తరదిశను, రుద్రుడు అధోలోకములను, మహాదేవుడు ఊర్ధ్వలోకములను, ఈశానుడు మధ్యాంతరాళమును పాలించుచుందురు (15. 5. 1-7). ఈ విధముగ నధర్వణ వేదము కూడ రుద్రుని నామములనన్నింటిని గణించెనుగాని వారు వేరువేరు దేవతలనుగ చిత్రించినది. 98 యజుర్వేదీయ శతరుద్రీయమున నీ నామములన్నియు రుద్రునకే అన్వయింపబడి రుద్రుడు అధికతమ ప్రాధాన్యమును పొందెను.

ఈ విషయముల నన్నింటి సాకల్యముగ జర్చించి, Thus the terrible and destructive God became, when he was propetiated by men in a variety of ways, a benignant God and attained to th- whole majesty of the godhead by the time of the Yajur-Veda and Atharva Veda, and it is on this majestic form of god that the theosophic speculations of Swetaswatara Upanishad are based 98 ఈ విధముగ ఉగ్రుడై మారకుడైన దేవుడు, వివిధరీతుల ప్రార్థనముల ప్రజలచే బొంది, శుభప్రద భగవంతుడై, యజుర్వేద అథర్వణ వేదకాలములకు సంపూర్ణమైన శీవితో దైవత్వము నొందెను. ఈ విషయముపై నాధారముగ శ్వేతాశ్వతరోపనిషత్తు ఈ మహాదేవునిపైన మాత్రమే తాత్త్విక విచారణముల దృఢపరచి యున్నది. పండిత భాండార్కరు మహాశయుడు ఎంతయో కృషిచేసి, రుద్ర-వేద మీమాంసను ముగించెను. ఈ పండితుని అభిప్రాయమున

98. Sir R. G. Bhandarkar: Collected Works, Vol iv, P 146-150

బర్యవసాన వాక్యముగ నాతడు యిట్లు క్రోడీకరించెను. ప్రకృతిలోని భయంకర వినాశకర శక్తులు రుద్రుని దేవునిగ జనులు రూపించు కొని, రుద్రులు, రుద్రీయులు అనుగణములచే నతని బ్రావృతుని జేసి, అతని బ్రార్థింప నతనినే శుభకరుడు [శివ] సుఖకరుడు [శంకర], వరదుడు [శంభువు] గను భావించుకొనుచు, గ్రమముగ రుద్రునికి సంపూర్ణ దైవత్వమునకు అవకాశమొసంగిరి. అయినను ప్రథమతః అతడు ఉగ్రుడు, స్మశాన, కానన పర్వతనివాసి. అతడు పిశాచగణము లకు జోరులకు అధినాయకుడు. కాని కాలక్రమమున విశ్వమునకు దేవుడై సర్వ వ్యాపకత్వమునుండి సర్వపాలకుడయ్యెను. అంత నతడు ఉపనిషత్తులచే నాకర్షింపబడి, తాత్త్వికదృష్టి జూడబడి, అతడు ముముక్షువులకుగూడ, ధ్యేయమై ముక్తిప్రదాతగగూడ నయ్యెను. ఈ విధముగ భాండార్కరు మహాశయుని నిర్ణయము 99. ఋగ్వేదీయ రుద్రుడు యితని తాత్పర్యమున దుష్టడనియే తెలియుచున్నది. ఆ విషయము ఎంతవరకు సముచితమో ! ఆగ్రహానుగ్రహముల జూపు సర్వశక్తిమంతునకు అట్టి అపవాదు గలుగుటయు సత్య దూరముకాదు. అందుచే ఋగ్వేదమునగూడ రుద్రుడు శివనామధారి కాకపోయినను, శివలక్షణముల ననేకము గలిగి కాలాంతరమున శివనామమునుగూడ ధరించి. ఆ నామమున బ్రఖ్యాతు డయ్యెననుట ఉచితమనిపించును.

ఆచార్య మజుందారు మహాశయు డీవిషయమును గవేషించి, The God Rudra is mentioned as early as Rig - Veda

---

99. Sir. R G. Bhandarkar : Collected Works, Vol, iv, p 202

asaterrific god whose wrath had to be appeared by offerings. The idea is further developed in the Satarudriya where he is represented both as malevolent and as benevolent god. In the later aspect he was known as Siva 100 ఉగ్రుడై ప్రార్థనములచే దృప్తినొందు దేవుడుగ రుద్రుడు ఋగ్వేదకాలమున ప్రస్తావింపబడెను. శతరుద్రీయములో నీ భావము అధికముగ నభివృద్ధిగాంచి, అతడు అగ్రహాను గ్రహరూపుడుగ దెలుపబడెను. అనుగ్రహరూపుడై శివుడుగ దర్వాత ప్రఖ్యాతము అనియు రచించెను. ఈ విధముగ ఋగ్వేదీయ రుద్రుని లక్షణముల నిర్ణయముపై అభిప్రాయభిన్నత్వము కాననగును.

## రుద్రుడు - రుద్రాధ్యాయము

'రుద్రాధ్యాయీ ముచ్యతే సర్వపాపైః' రుద్రాధ్యాయమును పఠించువాడు సర్వ పాపములనుండి విముక్తిగాంచునని కీర్తింపబడిన. 'శతం రుద్రా దేవతా అస్యేతి శతరుద్రీయ ముచ్యతే' శత రుద్ర దేవత లుండుటచే శతరుద్రీయ మని ప్రఖ్యాతిగాంచిన ఈ వేదభాగము పూర్వోక్తముగ యజుర్వేదమున నుండి రుద్ర స్తవముచే ప్రఖ్యాత మైనది. ఈ రుద్రాధ్యాయము నమక చమకములతోగూడి 'చమకం నమకం చైవ పౌరుషసూక్తం తథైవ చ। నిత్యం త్రయం ప్రయుంజానో బ్రహ్మలోకే మహీయతే॥' చమక, నమక, పురుష సూక్తములతో నెవడు హోమకార్యముల జేయునో వాడు బ్రహ్మ

100. Prof. R C. Mazumdar : The Cultural Heritage of India, Vol. 4. p 35.

లోకమును బొందును అను వాయుపురాణ వాక్యమునందము ప్రఖ్యాత మైన నీ రుద్రాధ్యాయమున రుద్ర-శివులకు ఎట్టి స్థాన మొసంగ బడినదియును చూచెదము గాక. గ్రంథనామమే రుద్రశబ్ద ప్రధాన ముగ నుండుటచే ఋగ్వేదీయ రుద్రునికే యిందు ప్రాధాన్యము గలదుగాని శివునకుగాదని దోచును. నమకము నమస్కారపూర్వక ముగ నుండ చమకము హవిస్సురూపముగ నుండును. నమకము ద్వాదశానువాకములతో మొత్తమునకు 179 మంత్రములతో విరాజిల్ల, చమకము ముప్పదిరెండు మంత్రములతో గలదు.

ప్రథమతః రుద్రశబ్దము 'రుతిం శబ్దం రాతి దదాతీతి ప్రాణో రుద్ర ఇత్యుచ్యతే' శబ్దము నొసంగు ప్రాణరూపుడు రుద్రుడనబడును అనియు 'రుతిం శబ్దం వేదాత్మానం బ్రహ్మణే దదాతి కల్పాదావితి రుద్రః' కల్పాదియందు బ్రహ్మమను వేదరూప 'శబ్దము నొసంగువాడు రుద్రుడు అనియు, 'రువం సంసారదుఃఖం ద్రావయతీతి రుద్రః' సంసార దుఃఖమును పోగొట్టువాడు రుద్రుడు అనియు, 'రోధికా బంధికా మోహికా వా శక్తి స్తద్వారిత స్తస్యా ద్రావయితా వా శక్తేభ్యో రుద్రః' నిరోధించు, బంధించు, మోహింప జేయు శక్తుల భక్తులనుండి పోగొట్టువాడు రుద్రుడు, అని వేద గ్రంథ వ్యాఖ్యాత భట్టభాస్కర వివరణము మరియు 'అశుభ ద్రావకో రుద్రో య జ్జహార పునర్భవం। తస్మాచ్ఛివ స్తతో రుద్ర శబ్దే నాత్రాభిధీయతే॥' అశుభముల బోగొట్టువాడు, పునర్జన్మను హరింప

జేయువాడు గాన శివుడు రుద్రశబ్దముచే బిలువబడును అనియు నాతడు రుద్ర శివ శబ్దముల నన్వయించెను.

పూర్వ వేదభాగములందువలెగాక, రుద్రాధ్యాయమున రుద్ర శబ్దముతోసహా శివ శబ్దము అసంఖ్యాక స్థానముల నుపయోగింప బడెను. 'నమః శివాయ చ శివతరాయ చ' [నమకం. 8. 11] అను మంత్రమునగల 'నమః శివాయ' అను మంత్రమే మహా మంత్రరాజమై, కాలాంతర శివోపాసనాశీలుర కాలంబనముగ నేర్పడి యున్నది. ఇటగల శివశబ్దమునకు భాష్యకర్త సాయనాచార్యులు 'శివః కల్యాణరూపః' కళ్యాణమైన రూపము గలవాడు అని వచించి, 'స్వయం నిష్కల్మష ఇత్యర్థః' స్వయముగ నిష్కల్మషమైనవాడు అను అర్థమును వచించియున్నాడు. 'అతిశయేన శివః శివతర' శివత్వము అధికముగ నుండుట శివతరము నాబడును అనియు నాతని వ్యాఖ్య. ఈ పదమునకు భట్టభాస్కరాచర్యుడుగూడ 'శివోఽ కల్మషో నిస్త్రైగుణ్యః సర్వాత్మనా కళ్యాణః శివః సుప్రసన్నః తస్మై నమః। అభ్యుదయ నిశ్శ్రేయసాఖ్యా కళ్యాణకారిష్యపి శివ శబ్దో గుణవృత్త్యా వర్తతే। శివంకరత్వాచ్చ శివ ఇతి' అకల్మషుడై, త్రిగుణ రహితుడై సర్వవిధముల కళ్యాణప్రదుడైనవాడు శివుడు. అతడు సుప్రసన్నుడు. అతనికి నమస్కారము అని మంత్రార్థమును వివరించి, అభ్యుదయ నిశ్శ్రేయసరూప కళ్యాణముల గలిగించుటచే శివ శబ్దము అన్వయించును. లేక శివశంకరుడు కాన, సుఖప్రదాత కావున శివ శబ్ద ముపయుక్తము అని వ్యాఖ్యానించియున్నాడు.

అందుచే నీ మంత్రమున శివ శబ్దము రుద్రునకు నామాంతరముగ గాక, గుణవిశేషమున విశేషణరూపమున నన్వయించుచున్నది.

అచట మాత్రమేగాక యీ మహా మంత్రమునకు బూర్వోత్తరములగూడ నీ శబ్దము రుద్రునకు విశేషణపరముగ నుపయుక్తము. 'యా త ఇషుః శివతమా శివం బభూవ తే ధనుః। శివ శరవ్యా యా తవ తయా నో రుద్ర మృడయ॥' [1.1] ఈ మంత్రమునకు సాయనాచార్యుడు భాష్యమున, 'శివతమ' పదమునకు 'శాంతతమా' అనియు 'శివం' అనగా 'శాంతం' అనియు అన్వయించెను. మరల తర్వాత మంత్రమున 'యా తే రుద్ర శివా తనూరఘోరాఽపాపకాశినీ....' [1.3] రుద్రునకు ఘోరమైనది యొకటి శివమైనది యొకటిగ శరీరద్వయము గలదని మంత్రము తెలుపుచున్నది. 'హింసికా ఘోరా, అనుగ్రాహికా శివా' అని సాయనుడు వచించును. 'శివాం గిరిత్ర తాం కురు' [1.4] అని నాల్గవ మంత్రముగూడ శివత్వ ప్రస్తావనము చేసినది. 'శివాం అస్మాసు శాంతాం కురు' అని దానికి సాయన భాష్య వివరణము. అయిదవ మంత్రమున 'శివేన వచసా త్వా గిరిశాచ్ఛావదామసి' [1.5] 'శివ' శబ్దముచే 'మంగళము' తెలుపబడి 'గిరి' పదమునకు కైలాసము వచింపబడెను. ఆ యనువాకమున నేకాదశ మంత్రము గూడ 'అవతత్య ధనుస్త్వం సహస్రాక్ష శతేషుధే। నిశీర్య శల్యానాం ముఖా శివో నః సుమనా భవ' (1.11) 'సుమనా అనుగ్రహాయుక్తః సం శివః శాంతో భవ' (సా.భా) అని శివ శబ్దమునకు శాంత తాత్పర్యమును బోధించినది.

అంత దశమోనువాకమున, ద్వితీయ మంత్రమున 'యా తే రుద్ర శివా తనూః శివా విశ్వాహభేషజీ। శివా రుద్రస్య భేషజీ తయా నో మృడజీవసే।' (10.2) ఓ రుద్రా। నీ శివాత్మకమైన అనగా శాంతస్వభావముగల తను పేదిగలదో అది విశ్వ దుఃఖ నివారణమునకు ఔషధము. ఆ శివత్వము ద్వివిధము. ప్రథమము సంసార సుఖదుఃఖ నివారణము మాత్రము జేయునది, ద్వితీయము అత్యంత దుఃఖనివృత్తి హేతువై నిశ్రేయసప్రాప్తి గలుగజేయునది అని పై మంత్రమును టీకాకారుడు భట్టభాస్కరాచార్యుడుగూడ వివరించి యున్నాడు. అట మీఢుష్టమ శివతమ శివోనః సుమనా భవ।' (10.10) 'శివతమాతిశయేన శాంతస్వరూప' మనియు నందందు రుద్రాధ్యాయమున నుపయోగింపబడిన శివ శబ్దము శాంత్యాది సద్గుణ సర్వమంగళకరత్వమును సూచించు విశేషణ పదముగ నున్నదిగాని నామవాచకముగ లేదు. అందుచే రుద్రునకు ఇచ్చట శివనామాన్వయము కాలేదని వచింపనగును.

ఈ విధముగ 'నమః శర్వాయ చ పశుపతయే చ' (5.2) 'శృణాతి హినస్తి పాపమితి శర్వ, పశుసమానానజ్ఞానానాం పురుషాన్ పాలయతీతి పశుపతిః' అని సాయన వివరణము. పాపముల నశింప జేయువాడు శర్వుడనియు, పశువువలె నజ్ఞానముననున్న పురుషుల బాలించువాడు పశుపతి అనియు తాత్పర్యము. 'నమో భవాయ చ రుద్రాయ చ' (5.1) 'భవంతి ప్రాణినోఽస్మాదితి భవః।రుత్ రోదనహేతుభూతం దుఃఖం ద్రావయతీతి రుద్రః' సర్వ ప్రాణుల

కంతర్యామిగ నుండుటచే భవుడు, రోదన కారణమైన దుఃఖమును నిర్మూలించువాడు రుద్రుడు అని భవ శబ్దముగూడ నిందుపయుక్తము. 'నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ' (5.4) జటాజూటము గలవాడు కపర్ది, ముండితకేశములు గలవాడు వ్యుప్తకేశుడు. అర్ధముండిత కేశుడు వ్యుప్తకేశుడు అని భట్టభాస్కరుని అర్థము 'నమః సోమాయ చ రుద్రాయ చ' '(8.1) ఉమయాసహవర్తత ఇతి సోమః' అనగా ఋగ్వేదమున గానరాని ఉమ భార్యగ రుద్రునికి నిట అన్వయింప బడినట్లు గ్రాహ్యము. లేక సోమ శబ్దము చంద్రపరము గావించి నచో సోముని భూషణముగ గలవాడనిగాని, సోమ పదము సుఖ సంతోషముల గలవాడుగగాని, ఒసంగువాడుగగాని అన్వయించుటకు గూడ నవకాశము గలదు. 'నమః శంగాయ చ' (8 9) 'శం' సుఖం గమయతి ప్రాపయతీతి శంగః' సుఖమును ప్రాపకము జేయువాడు శంగుడు అటులే 'నమః శంభవే చ' (8 9) 'శం' సుఖం భావయ త్యుత్పాదయతీతి శంభుః' సుఖమును భావించి పుట్టించువాడు శంభువు అగుచున్నాడు. మరియు 'నమః శంకరాయ చ' (8.10) విషయసుఖము మోక్షసుఖము అని సుఖము ద్వివిధము. అందు 'పిత్రాదిరూపేణ 'శం' లౌకకసుఖం కరోతీతి శంకరః' జననీజనకాది రూపముగ లౌకిక సుఖము నొసంగువాడు శంకరుడు అని అన్వయము. 'నమో నీలగ్రీవాయ చ శితికంఠాయ చ' (5.3) 'కాలకూటధారణేన నీలవర్ణో గ్రీవైకదేశో యస్థానే నీలగ్రీవః హాలాహల పానమున నది కంఠమున నుండుటచే నీలకంఠుడి అవియు నీల గ్రీవుడనియు అర్థము. మిగిలిన ప్రదేశముల కంఠము

శ్వేతవర్ణమున నుండుటచే శితికంఠుడుగ 'ప్రదేశాంతరే శ్వేతపర్ణం' (11.3) అనియు అన్వయము రుద్రాధ్యాయమున రుద్రునకు పూర్వము లేని 'భగవత్' శబ్దముగూడ 'నమస్తే అస్తు భగవతః' (19.11) అని ఉపయోగింపబడినది. 'భగ' శబ్దమునకు సాయనుడు 'ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః। జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా॥' ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, సంపద, జ్ఞానము, వైరాగ్యముల సంపూర్ణముగ గలవాడు భగవంతుడనియు, 'ఉత్పత్తిం చ వినాశం చ భూతానాం ఆగతిం గతిం। వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి॥' జీవుల ఉత్పత్తి వినాశమును, భూతముల ఆగమాపాయినములను, విద్యా అవిద్యల నెరింగినవాడు భగవానుడు అని వివరించెను. ఈ విధముగ గాలాంతరమున శైవమున శివునకు వ్యవహరింపబడియున్న నామములన్నియు, మరియు ననేకము రుద్రునకు అన్వయనామములుగ, గుణవిశిష్టముగ వాడబడియున్న వనుట గమనార్హము. వాని యన్నింట శివనామము ప్రధానమై, రుద్ర శబ్దము అప్రధానమై. శైవమతమున రూపొందియున్నదని దీన స్పష్టము. శివతత్త్వ సుధానిధియు 'రుద్రా ఏవ శివశ్చైవ' (3.25) రుద్రుడే శివుడు అని సమన్వయించి, 'ఏక ఏవ హి రుద్రోసౌ న ద్వితీయోస్తి కశ్చన। రుద్ర ఏవ శివః ప్రోక్తః ఏక ఏవేతి తచ్ఛ్రుతేః॥' (3.66) రుద్రుడు అద్వితీయుడు ఏకుడు, అతడే శివుడు అని శ్రుతులచే చెప్పబడినదనియు అధ్యాయాంతమున స్పష్టపరచెను. 'రు చ్ఛబ్దేన చ సంసారదుఃఖం ద్రావయతి ప్రభుః। రుద్ర ఇత్యుచ్యతే వేదైః అపి వేదాంతవేదిభిః॥' (3.68) సంసార

దుఃఖమును నిర్మూలించువాడు రుద్రుడు అని వేదములు వేదాంత వేదులుగూడ వచించుచున్నారు అని యిచ్చట వేదాంతులనుగూడ సుధానిధి ముందునకు దోసి రుద్రుని అధిక్యతను సమ్మతింపజేసినది. ఈ విధముగ వేదములగల రుద్రుడు, తనగుణముగ గీర్తింపబడిన శివత్వమునకు లొంగి, మరుగునపడి శివుడై, కాలాంతర తత్త్వ విచారణమునకు ప్రాతిపదిక అయినట్లు సువిస్పష్టము.

యజుర్వేదమున గల మహాన్యాసముగూడ 'తత్పురుషాయ విద్మహే। మహాదేవాయ ధీమహి। తన్నో రుద్ర ప్రచోదయాత్' అను గాయత్రీ మంత్రమునుగూడ రుద్రునిపై నిర్మించి, సంకల్ప మున 'తస్మై రుద్రాయ నమో అస్తు తస్మై మన శ్శివసంకల్ప మస్తు' అని రుద్ర శివ శబ్దముల నుభయము నుపయోగించుచు, తర్పణము వదలు సందర్భమున 'భవం దేవం తర్పయామి। శర్వం దేవం తర్పయామి। ఈశానం దేవం తర్పయామి। పశుపతిం దేవం తర్పయామి। రుద్రం దేవం తర్పయామి। ఉగ్రం దేవం తర్ప యామి। భీమం దేవం తర్పయామి। మహాంతం దేవం తర్పయామి।' అనుచు అష్ట నామముల ప్రస్తావించినది. అదేవిధముగ ధ్యానమున దశదిక్కుల నన్వయించుచు 'పూర్వం పశుపతిః పాతు, దక్షిణేపాతు శంకరః। పశ్చిమే పాతు విశ్వేశో, నీలకంఠ స్తథోత్తరే। ఈశాన్యం పాతు మే శర్వో, హ్యాగ్నేయాం పార్వతీపతిః। నైరృత్యాం పాతు మే రుద్రో, వాయవ్యాం నీలలోహితః। ఊర్ధ్వే త్రిలోచనః పాతు,

అథరాయాం మహేశ్వరః॥ ఏతాభ్యో దశదిగ్భ్యస్తు సర్వతః పాంతు శంకరః॥' అనియు శివనామముల నన్నింటిని జేర్చి స్తుతించినది.

## శివుడు - అనార్యసంబంధము

పూర్వ గ్రంథమున రుద్రునికి అనార్యజాతులతో సంబంధము ల జిత్రించి, ఆతని అనార్యునిగ గొందరు పండితులు చూచి, విమర్శించినట్లు జూచియున్నాము. పంజాబు దేశమున సింధూనది ప్రాంతముల బహిర్గతమైన మొహంజదరో హరప్ప మొదలగు పురాతన శిథిల నగరముల, పురాతత్త్వ శాస్త్రజ్ఞులు వేదకాల పూర్వ సంప్రదాయములకు జెందిన వానిగ దీర్మానించి, అందు బయటపడిన వస్తువుల ననుసరించి కాలనిర్ణయము గావించుటయు, దానిననుసరించి నాటి ప్రజల సంస్కృతీ నాగరికతలను నిర్ణయించుటయు జరిగినది. ఆ పట్టణ విధ్వంసకర కార్యములు వేదకాల పూర్వమున ఆర్య అనార్యజాతులకు జరిగిన సంఘర్షణములని తీర్మానించి. అందుచే, నవి అనార్యజాతి పురములని నిశ్చయించుటయు జరిగినది. కాని యీ విషయము అనిశ్చితము. ఆర్యులు భారతమునకు బశ్చిమోత్తర మధ్య ఆసియా ఖండములనుండి వలస వచ్చినవారను సిద్ధాంతమును అధికసంఖ్యాకులైన పండితులు సమ్మతింపరు. ఆర్యులకు భారత దేశమే జన్మస్థానము. ఇటనుండియే వారు యితర ప్రాంతముల కరిగిరను భావము రూఢము అందుచే నీ పురములలో లభించు నాగరికతా చిహ్నములు ఆర్యులవేగాని యితరులవి కావనుట సమంజసము. అట్లుగాక వ్యతిరిక్త అభిప్రాయముగలవారు అచట లభించిన

శివచిహ్నముల గాంచి, రుద్ర శివ మతము అనార్య జాతులదైన దనియు, అనార్యుల నార్యులు జయించి, వారి సంప్రదాయముల గొన్నింటి నవలంబించిరనియు, నందు రుద్ర-శివ మత మొకటి యనియు ఉద్దేశించిరి. అందు భాండార్కరు పండితుడు ముఖ్యుడు, అతని భావముల ననుసరించి ఆచార్య మజుందారు మహాశయుడు, We may now assume, with a tolerable degree of certainty, that Rudra Siva was, or was assumed to be, identical with the great God of the pre-Aryan settlers of the Indus valley and that the absorption of those people into the Aryan society, he came to occupy a pre-eminent position 101 రుద్ర-శివుడు సింధూనదీప్రాంత అనార్యవాసుల దైవమే అనియు, ఆ జాతులు ఆర్యసంఘమున లయింప, నాతడు అత్యున్నత స్థానము నధిష్ఠించెననియు మనము చాలవరకు నిశ్చయించుటయో భావించుటయో సముచితమని వచించెను. జాన్ మార్షల్, సింధూ లోయ నాగరికతను గూర్చి వ్రాయుచు, Saivism has a history going back to the Chalcolithic age or perhaps even further still, and that it takes it place as the most ancient living faiths in the world 102 శైవము అతి పూర్వమున, మరియు నింక నతి ప్రాచీనకాలమున దన చరిత్రను గలిగియున్నది. ప్రపంచమున అతి ప్రాచీన మతముల స్థానమున

101. Prof. R. C. Mazumdar: The Cultural Heritage of India, Vol. 4. p 36

102. Sir John Marshall: Mohenjadaro and the Indian Civilization, p vii

నిది అలంకరించును అని విదితపరచెను. అతని తాత్పర్యమున శైవసంప్రదాయము శాక్తేయములు వైదికములు కావు. ఇదే భావమునకు సమ్మతించుచు పండిత రాధాకృష్ణుడుగూడ These latter do not seem to be indigenous to the Vedic religion 103 ఈ తర్వాత విధానములు వైదిక మతమునకు సహజములుకావు అనియు వ్రాసెను. ఈ సిద్ధాంతమున కాధారముగ దక్షయజ్ఞ గాథను సూచించెదరు. వైదిక సంబంధమైన యజ్ఞమును జేయుచు దక్షుడు. వైదిక దేవతలతోబాటు శివుని ఆహ్వానింపకుండుటకు కారణము శివు డనార్యుడని యీ రచయితల తాత్పర్యము. అటులైన తన పుత్రిక నెట్లు శివునకు అతడిచ్చి వివాహము జేసి యుండెనో ! అటులే భాగవతమున శివమతదూషణ వాక్యమైన దక్షవచనముల స్వీకరించి. శివు డవైదికుడని పండితులు తీర్మానించుట విచిత్రము. 103 పురాణములలో శివ కేశవ విభేదము కల్పింపబడి, పరస్పర నిందా దూషణములతో నుండుట నెల్ల రెరింగినదియే. అందుచే నా రచనము లందు ప్రమాణములు కాజాలవు.

అందుచేత, సింధూతీర నాగరికత ననుసరించి, రుద్ర శివ తత్త్వముల నవైదికముగ ననార్యముగ నిర్ణయించుట సాహసకార్యమే యగును. అనిశ్చయ ప్రాతిపదికపై సిద్ధాంత నిశ్చయము గావించుట హాస్యాస్పదము. అందుచే నా సిద్ధాంతము అనాదరణీయమని స్పష్టము.

103. Dr. S. Radhakrishnan: The Legacy of India: of G T. Garratt, p 257

ఈ విధముగ ఋగ్వేదమునందుగల రుద్రుడు, యజుర్వేదమున ననేకవిశిష్టనామధారియై, సర్వాధిపతియై, విశ్వనాథుడై ఉమాపతియై, శివనామ ప్రాధాన్యమున శైవవాదమునకు ఆధారుడై పరిణమించినట్లు స్పష్టమగుచున్నది. అంత ఋూర్వోక్తరీతి వైదిక రుద్ర-శివుడు ఆగమ శాస్త్రమునకుగూడ నధినాథుడై, క్రమమన్యాయమున భారత సంస్కృతిరంగమున అతి ప్రధాన పాత్ర వహించినట్లు సర్వ విదితము.

## శివుడు - ఉపనిషత్తులు

Upanishads, the first flowers of awaking India's spirituality 104 భారతీయ పారమార్థిక తత్త్వోదయసూచిక ప్రథమ పుష్పములు ఉపనిషత్తులు అని ఋషి దరువాలా మహాశయునిచే గీర్తింపబడిన, Upanishads, where breathes the early and deep Hindu consciousness of God భారతీయ ప్రాచీన ప్రగాఢ పరమాత్మస్ఫురణ మెచట బహిర్గతమో అవి ఉపనిషత్తులు అని మజుందారు పండితునిచే స్తుతింపబడిన వేదభాగములై యున్నను విశిష్ట ప్రత్యేకత నార్జించి, వేదాంతమన్న యశస్సు గడించి, జీవ, జగ దీశ్వర పరస్పర సంబంధముల ప్రతిపాదించి, జీవునికి బరమాత్మను బొందు మార్గము నుపదేశించి, తారణోపాయమును జూపినవీ ఉపనిషత్తులు. వేదములగల నితర భాగములకంటె నీ యుపనిషత్తులే కాలాంతర జన్యములైన ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది వివిధ

104. Sri Rusi J. Daruwala : The Indian Express, 30-9-1962.

తాత్త్విక సిద్ధాంతములకు మూలములై సహస్రాధిక భాష్యముల ఆచార్యకోటినుండి బొంది, మానవసమాజమునకు నిత్యజ్యోతులై వెలుగొందినవి. అవి శివునిగూర్చియు రుద్రునిగూర్చియు నేమి వచించి యున్నవో కొంచె మవలోకించెదముగాక వేదముల భాగము లైన ఉపనిషత్తులు అనేక రకములై యున్నను, అందు వ్యవహారమున ప్రసిద్ధములై యున్నవి, నూట ఎనిమిది మాత్రమని తజ్ఞుల వచనము. అందు శైవపరములు పదునైదు అని ప్రతీతి. యోగ ప్రధానములు ఇరువది, వైష్ణములు పదునాలుగు, శాక్తములు ఎనిమిది, సన్న్యసపరములు పదునేడు, సామాన్య వేదాంతపరములు ఇరువది నాలుగు, ప్రసిద్ధ దశోపనిషత్తులను గలిసి మొత్తమునకు అష్టోత్తరశతము లగుచున్నవి.

ఇందు ప్రఖ్యాతములై ఆచార్యులచే ప్రస్థానత్రయమున జేర్చ బడి అనేక భాష్యముల పండితులనుండి పొందియున్న ఈశావాస్యాది దశోపనిషత్తులలో, రుద్ర-శివ ప్రస్తావనము అభావము. అట బ్రహ్మ విష్ణు మహేశ్వరరూప మూర్తిత్రయముగూడ అగోచరము. సగుణ నిర్గుణ బ్రహ్మముల ప్రతిపాదనము గావించి, నిర్గుణమును వివరించి, దాని బొందు మార్గముల బోధించి, అటులే సగుణ బ్రహ్మమునకు సృష్టిస్థితి లయాది కార్యభారములను మోపి, తద్వివరణమును మాత్రము గావించి, అతని బొందు వివిధోపాయములగూడ దశోప నిషత్తుల గాంచగలము. నిర్గుణము బ్రహ్మము నా వ్యవహరింపబడ, సగుణము ఈశాన, ఈశ్వర, సర్వేశ్వర, ఈశ, మొదలగాగల నామములచే రూపింపబడి యున్నది.

దశోపనిషత్తులలో ప్రథమమైన ఈశోపనిషత్తు తన ప్రథమ మంత్రమును 'ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్' (ఈశ.1) ఈ జగత్తులో నున్న సర్వము ఈశ్వరునిచే నావృతము అని ఈశ శబ్దముతో ప్రారంభించినది. కఠోపనిషత్తు 'అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి। ఈశానో భూత భవ్యస్య న తతో విజుగుప్సత ఏతద్వైతత్' (2.1.12) ఆత్మ అంగుష్ఠమాత్రుడై హృదయాకాశమున నుండి, త్రికాలములకు పాలకుడై యున్నాడు అనియు, మాండూక్యోపనిషత్తు 'ఏష సర్వేశ్వరః ఏష సర్వజ్ఞః' (6) అతడు సర్వమునకు పాలకుడు, అతడు సర్వజ్ఞుడు అని సగుణ బ్రహ్మమును సూచించినది. ఆయుపనిషత్తు 'ప్రపంచోప శమం శాంతం శివం అద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః' (7.12) అను మంత్రద్వయమున దురీయమును అభి వర్ణించుచు, దాని సర్వలక్షణ విలక్షణత్వముల సూచించి, అంత్యమున, నట్లు వచించెను. ఇందు శివశబ్దము గోచరము. కాని ఇది మంగళకరత్వ సూచికముగ నుపయుక్తమని విదితము. వైదిక రుద్రుడుగాని, శైవమున కాధారభూతుడైన గౌరీవల్లభుడు శంకరుడు గాని యిందు అభావమని స్పష్టము. కాని ప్రశ్నోపనిషత్తులో 'ఇంద్రస్త్వం ప్రాణతేజసా రుద్రోసి పరిరక్షితా' (2.9) ఈ మంత్ర ప్రకరణము నాలోచించిన, ప్రాణమునకు ఇంద్రియములకు జరిగిన పోరాటమున ఇంద్రియములు ప్రాణాధిక్యతను గుర్తించినపై అద్దాని గొనియాడుచు, సర్వదేవతలు నా ప్రాణమే అని అన్వయించుచు, వైదికమైన ఇంద్రాది దేవతలతో రుద్రుని స్మరించి, ఆ రుద్రుడు

గూడ ప్రాణమే అని ఇంద్రియములు గొనియాడియున్నవి. అందుచే నచట రుద్ర శబ్దమున కేప్రత్యేకతయు గానరాదు.

శైవ పరములు నాలుగు ఉపనిషత్తులు రుద్ర-శివుని గూర్చి యెట్లు వచించియున్నవో చూచెదముగాక। అందు ప్రధానమనదగు శ్వేతాశ్వతరోపనిష త్తాత్పర్యమును గాంచెదముగాక. Here, it is Siva or Rudra who not only is declared the creator, preserver and destroyer of religious belief, but is even identified with the Brahman or the Suprime Spirit of philosophy 105 ఇచట శివుడు సృష్టిస్థితి సంహారములకు గర్త యని ప్రకటింపపడుటయేగాక, తాత్త్విక విచారణమున బ్రహ్మముతో గూడ నేకత్వము చేయబడెను అని తెలియుచున్నది. ఈ యుపనిషత్తు సాంఖ్య వేదాంతముల సమన్వయపరుప మిగుల కృషిగావించి అందులకై శివ, శక్తుల నుపయోగించుకొనినట్లు పండితాభిప్రాయము. ప్రారంభముననే 'కిం కారణం బ్రహ్మ కుతః స్మ జాతా జీవామే కేన క్వ చ సంప్రతిష్ఠా' (1.1) బ్రహ్మ మెట్టి కారణము.? మన మెటనుండి జనితము.? ఎవనిచే మనము జీవించుచున్నాము? మన మెవనిపై నాధారపడియున్నాము? అని తత్త్వ మీమాంసమునే ప్రస్తావించినది. ఆ విషయముల జర్చించి, మూడవ అధ్యాయమున 'య ఏకో జాలవానీశత ఈశనీభిః సర్వాల్లోకా నీశత ఈశనీభిః। య ఏవైక ఉద్భవే సంభవే చ య ఏత ద్విదురమృతాస్తే భవంతి'

105. Dr. E. Roer : The Twelve Principal Upanishads, Vol. 1, p 255.

(3.1) ఎవడు ఒకడై యుండునో, మాయావియై తన ఈశత్వముచే పాలించునో, అతడు, తన పాలనశక్తులచే సర్వలోకముల నియమించునో, ప్రపంచోత్పత్తి సంభవములలో నెవడు ఏకమై యుండునో, అతని నెరింగినవారు అమృతత్వము నొందుదురు అని సర్వేశ్వరత్వము ను ప్రతిపాదించి, 'ఏకో హి రుద్రో న ద్వితీయాయ' ఏకమైన వాడు రుద్రుడు అత డద్వితీయుడు అని పూర్వ శ్లోకార్థము నతని కన్వయించినది. ఇచట రుద్రుడు పరబ్రహ్మ స్థానమున కన్వయింప బడెను. అతడే సర్వచక్షువు సర్వతోముఖుడు (3.3), మొదలగు సర్వత్వము నన్వయించి, అతడే దేవతలగూడ సృజించి వారి కధికారముల ప్రసాదించినవాడని తెలిపి (3.4), 'యాతే రుద్ర శివా తనూరఘోరాఽపాపకాశినీ' (3.5) శివ ప్రదమైన అఘోరమైన నీ రూపముతో రుద్రా, అని శివ శబ్దముతో రుద్రుని శివ శబ్ద తాత్పర్యమున నన్వయించి చూపెను. గిరివాసి యనియు, శరచాప ధారి యనియు తెలిపి, మానవులకు ప్రపంచమునకు అపకారము చేయవలదని రుద్రుని ప్రార్థించి (3.6) బ్రహ్మనిర్వచనము తర్వాత చేయబడెను. ఈ మంత్రము వైదిక రుద్రుని లక్షణముల సూచించు చున్నది. అతని వర్ణించుచు, 'సర్వాననశిరోగ్రీవః.... సర్వవ్యాపీ స భగవాన్ తస్మాత్సర్వగతః శివః' (3.11) సర్వముఖములు సర్వ శిరములు, అన్నియు తానై, సర్వవ్యాపియై అతడు సర్వవ్యాపియు శివం కరుడునై యున్నాడు అని బ్రహ్మమునుగూర్చి తెలుపుచు శివ శబ్దము నుపయోగించినది.

చతుర్థాధ్యాయమున ప్రకృతి పురుషుల తత్త్వమును బోధించుచు, 'మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరః।' (4.10) మాయ అనగా ప్రకృతి అగును. అమ్మాయాశక్తిగలవాడు మహేశ్వరుడు. అతని శక్తులచే నీ జగత్తు అంతయు వ్యాప్తము అని ఉపనిషత్తు బోధించినది. తర్వాత మంత్రమున మరల రుద్ర ప్రస్తావనము గావించి, విశ్వాధిపుడు, సర్వజ్ఞుడు, దేవతాగణముల స్రష్ట, అని అతని నుతించుచు, సూక్ష్మాతిసూక్ష్మమైనవాడు, వ్యాపకుడు, స్రష్ట, అనేకరూపుడు అయిన వానిని, జ్ఞాత్వాశివం శాంతి మత్యంతమేతి' (4.14) శివంకరుని గ్రహించి, అత్యంతమైన శాంతిని జ్ఞానులు పొందుదురు అనియు, 'జ్ఞాత్వా శివం సర్వభూతేషు గూఢం' (4.16) సర్వభూతజాతముల నిగూఢముగ నంతర్యామిగ నున్న మంగళకరుని (శివుని) నెరింగి సర్వ పాపముల నుండి ముక్తి నొందెదరు అని వాకొనెను. అధ్యాయాంతమున 'రుద్ర యత్తే దక్షిణం ముఖం తేన మాం పాహి నిత్యం' (4.21) రుద్రా ! నీ శుభంకరమైన ముఖము నన్ను సదా కాపాడుగాక అని ప్రపంచమునగల ఆర్తుల ద్వారమున ఉపనిషత్తు రుద్రునికి మాత్రమే పూర్వమంత్రార్థముల సంపూర్తిగ నన్వయించి ప్రార్థించినది. మరల రుద్రుని ఋగ్వేదీయ రుద్రత్వమును సంస్మరించియుండనోపు, ఉపనిషత్తు 'మా న స్తోకే తనయే' (4 22) మా పుత్రుల, పౌత్రుల, మమ్ము, మా అశ్వముల మా వీరుల నీ కోపానలమునకు గురి కానీయకుము. నీకు మా హవిస్సుల నర్పించెదము అని భయానక హృదయముతో ప్రార్థించినది.

అంత పంచమాధ్యాయమున శ్వేతాశ్వతరోపనిషత్తు మరల తత్త్వవిచారణమున మునింగి, కపిలుని స్మరించి (5.2), బ్రహ్మము వేదగుహ్యోపనిషత్తు అనగా వేదములలో గుప్తమై ఉపనిషత్తులచే బ్రతిపాదింపబడినట్లు విదితము జేసి (5.6), జీవునిలో నంగుష్ఠ మాత్ర పురుషుడై యున్నట్లు స్పష్టపరచి (5.7), అతని సర్వా కృతిని సుందరముగ 'నైవ స్త్రీ న పుమానేష న చైవాయం న పుంసకః। యద్యచ్ఛరీరమాదత్తే తేన తేన స యుజ్యతే॥' (5.10) బ్రహ్మము స్త్రీకాదు, పురుషుడు కాదు, నపుంసకుడునుగూడ కాదు. ఏ యే శరీరముల నాతడు ధరించునో అందత డుండును అని వివరించినదీ ఉపనిషత్తు. అంత మరల నధ్యాయాంతమున శివ స్మరణము గావింపనోపు, 'భావగ్రాహ్యమనీడాఖ్యం భావాభావకరం శివం। కళా సర్గకరం దేవం యే విదు స్తే జహు స్తనుం॥' (5.14) శుద్ధ భావనచే నెరుంగదగినవాని, అభౌతిక స్వరూపుని, సృష్టి సంహారముల కారకుని, గ్రహించిన జ్ఞానులు విదేహముక్తి నొందె దరు అని స్పష్టము గావించియున్నది.

ఆరవ అధ్యాయమున బూర్వ విషయముల వివరించుచు, శ్వేతాశ్వతరము, 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దేవతా నాం పరమం చ దైవతం।' [6.7] ఈశ్వరులకు మహేశ్వరుడును, దేవతలకు మహాదేవుడునైన పరమేశ్వరుని బ్రస్తావించి, అతని ఋషీశ్వరు లెరింగినట్లు వాకొనినది. అతనికి కార్యకారణములు, సమ అధికములు మొదలగునవి లేవనియు, [6.8), 'న తస్య కశ్చి

త్వరిత ర స్తి లోకే న చేశితా నైవ చ తస్య లింగం' [6.9] అతనికి ప్రభువుగాని, పాలకుడుగాని, కారణముగాని లేరు అని అతని గుర్తించుటకు లింగము, చిహ్నముగూడ లేదని లింగశబ్దము గూడ నిట ఉపనిషత్తు సూచించినది. అతని గ్రహింప సాంఖ్య, యోగములచే సాధ్యము అని 'సాంఖ్యయోగాధిగమ్యం' (6.13) అనియు విశదపరచి, 'నాన్యః పంథా విద్యతేఽయనాయ' (6.15) జ్ఞానముచేత గాక నన్యముచే నతని గ్రహించుట నసాధ్య మనియు ప్రకటించి, 'వేదాంతే పరమం గుహ్యంపురాకల్పే ప్రచోదితం' (6 22) వేదాంతముల గోప్యమైనదియు, పూర్వ కల్పములలో నుపదేశింపబడినదియు నని తన బోధిత విషయ విశిష్టత్వమునుకూడ శ్వేతాశ్వతరోపనిషత్తు ప్రకటించుకొనినది.

ఇందు ఒక విశేషము గలదు. ఈ యుపనిషత్తు వేదప్రధాను డైన రుద్రుని పరబ్రహ్మముగ నన్వయించుచు, తర్వాత సంప్రదాయముల కధిక ప్రధానమైన శివ పదమును బలుమారుపయోగించుచు, విశేషణరూపముగగాని నామవాచకముగగాని యీ శివ పదమును అన్వయింప నవకాశ మొసంగియున్నది. అందుచే నిట శివపదము ద్వంద్వార్థముల కాలవాలమై శైవులకు నామవాచకముగను, అన్యులకు విశేషణముగను అర్థమును స్ఫురింపజేయుట నిందు కాననగును. ఈ విధముగ నీ యుపనిషత్తు does not appear to be composed in a sectarian spirit 106 ఎట్టి పాక్షికదృష్టితో

106. Sir R. G. Bhandarkar: Collected Works, Vol. iv, p 151

నిర్మింపబడలేదు. అయినను, We have here all the elements of Saivism and the further growth of the creed 107 అందు శైవమత లక్షణములన్నియు, పరల దాని అభివృద్ధి విషయములు గోచరము.

మరియు శైవోపనిషత్తులలో నధర్వశిరముగూడ ముఖ్యముగ తజ్ఞుల అభిప్రాయము. ఈ యుపనిషత్తు రుద్రుని అసమాన అద్వితీయ తత్త్వము బోధించుటకై యుపయుక్తమైనట్లు ప్రథమ మంత్రముననే రుద్రతత్త్వము నవగాహన మొనరించుకొన దేవతలే రుద్రలోకమున కరిగి, ఆతని తన తత్త్వము నుపదేశింపగోర, నాతడు 'అహమేకః ప్రథమ మాస వర్తామి చ భవిష్యామి చ చాన్యః కశ్చిన్మత్తో వ్యతిరిక్తః ఇతి' (1.1) ప్రథమమున నేనొక్కడనే యుంటిని. వర్తమాన భవిష్యత్తులలోగూడ నటులే ఉన్నాడను, ఉండెదను. నా కన్యుడు ఎవడును లేడు, ఉండడు, అని దేవతల కుపదేశించెను. అంత నతడు సర్వవ్యాపియై రూపొంద, దేవత లతని ప్రార్థించిరి. అతడే భగవాన్, చతుర్ముఖుడు (2 1), విష్ణువు (2.2), మహేశ్వరుడు [2 3], మొదలగు సర్వదేవతలు, భూతములు, సూర్య చంద్రాదులు అని సంబోధించి దేవతలు అతని స్తుతించిరి. అతని విశ్వరూపునిగ స్మరించి, అతని ప్రణవ స్వరూపునిగను (3 4), దేవతలు ప్రార్థించిరి. రుద్రుని సర్వవ్యాపకత్వమును దలంచి,

107. Prof. K. A. Nilakantha Sastri : The Cultural Heritage of India, Vol. 4, p 64.

అతడే పరబ్రహ్మముగగూడ విశ్వసించి [4.2], 'స ఏక స్స ఏకో రుద్రః స ఈశాన స్స భగవాన్ స్స మహేశ్వరః స మహాదేవః' [4.2] అతడే ఏకమైనవాడు, అతడే రుద్రుడు, అతడే ఈశానుడు, భగవంతుడు, మహేశ్వరుడు, అతడే మహాదేవుడు అని శైవమున శివుని ముఖ్య నామముల నిట చిత్రించె నీ యుపనిషత్తు. పంచమాధ్యాయమున పూర్వము రుద్రున కన్వయింపబడియున్న నామముల వ్యుత్పత్త్యర్థముల అధర్వశిరము నిర్వచించినది. అందు 'ఏకో రుద్రః' అను పదమునకు అర్థమును వివరించుచు 'ఏకో రుద్రో న ద్వితీయాయతస్థే తురీయ మిమం లోక మీశత ఈశనీయ ర్జననీయుః ప్రత్యఙ్ జనా స్తిష్ఠతి సంయుగ స్యాన్తకాలే సంహృత్య విశ్వా భువనాని గోప్తాతస్మాదుచ్యత ఏకో రుద్రః' (5.2) భేదశూన్యుడగు రుద్రుడే రెండవవానికొరకులేడు, యీ లోకమును అతడు పాలించుచున్నాడు. నియమించు శక్తిగలవాడతడు. సృష్టిశక్తి గలవాడు, సర్వాంతరుడై యుండును. యుగాంత కాలమున విశ్వములో భూతముల నన్నింటిని ఉపసంహరించుకొని సంరక్షించును. అందుచేత నతడు రుద్రు డనబడునని ఉపనిషత్తు వివరించినది. అటులే ఈశాన శబ్దమును [5.3], భగవచ్ఛబ్దమును [5-4], మహేశ్వర పదమును [5.5], మహాదేవ నామమును [5.6], న నిర్వచించి, 'త దేత ద్రుద్ర చరితం' [5.17] రుద్ర చరితమును ఉపనిషత్తు బోధించినది. అంత సమాప్తమున రుద్రధ్యానము నుపదేశించుచు, ఆ రుద్రుని బొందుడు అని ప్రబోధించుచు, నట్లు రుద్రు నుపాసించి అతని బొందుట 'వ్రతమేత త్పాశుపతం' పాశుపత వ్రతముగ విదితము

చేసినది. చివర భస్మధారణ ప్రాధాన్యతనుగూడ జిత్రించి, పాశుపత మతమునకు ప్రాతిపదికను ఏర్పాటు నీ యుపనిషత్తు గావించినట్లు దోచును. 'యో రుద్రో అగ్నౌ యో అప్స్వన్త ర్య ఓషధీర్వీరుధ ఆవివేశ। య ఇమా విశ్వాభూతాని చాక్లపే తస్మై రుద్రాయ నమో అస్తు' ఏ రుద్రుడు అగ్నియందును, జలమునందును, అభిమానియై యున్నాడో, ఏ రుద్రుడు అంతరమున ఓషధులందును అంతటను వ్యాపించియున్నాడో, ఏ రుద్రుడు విశ్వభూతముల జక్కగ నిర్మించెనో, అట్టి రుద్రునకు నమస్కారము అని రుద్ర ప్రణామము లతో ఉపనిషత్తు సమాప్తమయ్యెను. ఈ విధముగ నీ యుపనిషత్తు పాశుపతవ్రత దీక్షాదులకు బునాదుల వైచి, శివనామముల నిర్వచించి, శైవోపనిషత్తులలో ప్రధాన స్థానము నలంకరించినది. కాని చిత్రముగ నిందు శివ శబ్దము అగోచరము.

శైవము లనబరగు యితర ఉపనిషత్తుల గొంత విచారించె దముగాక। అందు స్కందోపనిషత్తు శైవాద్వైతమును ప్రతిపాదించుచు, నా పరమాత్మయే 'జ్యోతిషాం జ్యోతిః స ఏవ పరమేశ్వరః' [4] అని వచించి, 'జీవశ్శివో శివో జీవః స జీవః కేవలః శివః' [5] అని నిశ్చయించి, వివరణములకై 'పాశబద్ధ స్తథా జీవః పాశముక్త స్సదాశివః' [7] పాశబద్ధుడు జీవుడు తద్విముక్తుడు సదాశివుడనియు, 'తుషేణ బద్ధో వ్రీహి స్స్యాత్ తుషాభావే తు తండులః। ఏవం బద్ధ స్తథా జీవః కర్మనాశే సదా శివః॥, [8] పొట్టుతో బద్ధమైనది ధాన్యముకాగ, పొట్టులేని

బియ్యమగురీతి, గర్మ బద్ధుడు జీవుడై యుండ, దన్నాశమున సదా శివు డగును అని జీవ, శివ అభేదత్వమును తెలిపినది. రుద్ర హృదయోపనిషత్తుగూడ బూర్వోపనిషత్తు భావములనే వివరించుచు, 'సర్వదేవాత్మకో రుద్రః సర్వే దేవాః శివాత్మకాః' (4) రుద్రుడు సర్వదేవతల సమష్టిస్వరూపము అని, సర్వదేవతలు శివాత్మకులు అని ప్రారంభించి, వ్యక్త ప్రపంచము ఉమారూపమనియు, అవ్యక్తము మహేశ్వరుడనియు [10], అంతరాత్మ బ్రహ్మమైయుండ, బరమాత్మ మహేశ్వరుడనియు, సర్వభూతములు విష్ణ్వాత్మకములనియు [13]. 'కార్యం విష్ణుః క్రియా బ్రహ్మ కారణం తు మహేశ్వరః' [4] అని వచించి, రుద్రుడే యీ మూర్తిత్రయముగ దెలిపినది. విభిన్నత్వమున 'ధర్మో రుద్రో జగద్విష్ణుః సర్వజ్ఞానం పితామహః' [15] అని వాకొని, 'సర్వదేవాత్మకం రుద్రం నమస్కుర్యాత్ పృథక్ పృథక్' [24] సర్వదేవతా స్వరూపుడైన రుద్రునకు మరల మరల నమస్కారము చేయవలయునని ఆదేశించి, అవిద్యాగ్రంథుల నాశనముచే సనాతనరూపుడైన శివుని జెందగలమనియు, 'తదేతదమృతం సత్యం' అదియే అమృతపదము, అదియే సత్యమని నిశ్చయించి, ఘటాకాశ మఠాకాశములవలె జీవశివులకు అభేదమని తెలిపి, 'అద్వైతం పరమానందంశివం యాతి తు కేవలం' [47] అని పర్యవసానముగ బోధించి, అందుచే నిది 'బోద్ధవ్యం ముముక్షుభిః' (37) ముముక్షువులకు బోధింపదగినది అని శివాద్వైత్వ వాదమును యీ యుపనిషత్తు సూచించినది. మైత్రేయ్యుపనిషత్తు

హృత్పుండరీక మధ్యమున బరమేశ్వరుని యునికి దెలిపి, అతడు పరమ ప్రేమ గోచరుడని వాకొని (1.8), మూఢమైన వర్ణాశ్రమా చారములచే నాతడు అసాధ్యము అనియు వచించి (1.13), 'దేహో దేవాలయః ప్రోక్తః స జీవః కేవలః శివః' (2.1) దేహము దేవాలయ మనియు, అందున్న జీవుడు శివుడే అనియు అభిన్నత్వ మును ప్రతిపాదించి, అట్టి అభేదదర్శనమే జ్ఞానమనియు (2.2), అట్టి 'ద్వైతాద్వైతవిహీనోఽస్మి శివోఽస్మ్యహం' (3.4) ద్వైతాద్వైత వివర్జితమైనవాడను నేను శివుడను అను దృఢత్వమును అద్వైత స్ఫూర్తిని (3.6) స నెలకొల్పినది యుపనిషత్తు. త్రిశిఖబ్రాహ్మ ణోపనిషత్తు 'సర్వమిదం శివ ఏవ విజానీః' (1) అని శివాద్వైత మును దెలిపి, 'సవికార స్తథా జీవో నిర్వికార స్తథా శివః' (12) అనియు, 'అహంకారాభి మానేన జీవః స్యాద్ధి సదాశివః' (16) అహంకారాభిమానము చేతనే సదాశివుడు జీవుడగును అనియు నీ యుపనిషత్తు అద్వైత ప్రతిపాదనము గావించినది.

పాశుపత బ్రహ్మోపనిషత్తు 'సమస్త యాగానాం రుద్రః పశుపతిః కర్తా' (1) అని సూచించి, రుద్రుడు తమోమాయాత్మకు డని, శివుడే పశుపతి యనియు, అతడే 'సాక్షిస్సర్వస్య సర్వదా' [7] సర్వకాలముల సర్వసాక్షి యని తెలిపినది. శరభోపనిషత్తు శివాధిక్యతను బోధించుచు, 'ఏక ఏవ శివో నిత్య స్తతోఽన్య త్సకలం మృషా। తస్మా త్సరిత్యజ్య ధ్యేయాన్ విష్ణ్వాదికాన్ సురాన్॥' [30] ఏకమైన శివుడే నిత్యుడు, అన్యములు మృష.

అందుచే విష్ణ్వాది దేవతల ద్యజించి ధ్యానింపనగును. 'స ఏకో రుద్రో ధ్యేయః సర్వేషాం సర్వసిద్ధయే' [7] సర్వసిద్ధి ఫల ప్రాప్తికై రుద్రుడే ఎల్లరకు ధ్యేయము అని నిశ్చయించినది. వరాహోపనిషత్తు 'నమో మహ్యం పరేశాయ నమస్తుభ్యం శివాయ చ' [2.35] అని నమస్కరించి, శివునకు, 'సత్యచిద్ఘన మఖండ మద్వయం సర్వదృశ్యరహితం నిరామయం యత్పదం విమల మద్వయం శివం తత్సదాహమితి మౌనమాశ్రయ (3.6) ఆ అద్వయ బ్రహ్మపదము శివంకరమని రూఢపరచి, అదియే జీవుడని దృఢ పరచినది. ఆ శివుడు 'శివో గురుః శివో వేదః శివో దేవః శివః ప్రభుః। శివోస్మ్యహం శివః సర్వం శివాదన్య న్నకించన॥' [4.32] సర్వము అని తీర్మానించినది. దత్తాత్రేయోపనిషత్తు 'ఓం నమః శివాయ' మంత్రమును ఉపదేశింప, •బహ్వృచోపనిషత్తు శాంభవీవిద్యను బోధించినది.

బృహజ్జాబాలోపనిషత్తు శివశక్తుల కైక్యము జెప్పి, 'శివశక్తి భ్యాం నావ్యాప్త మిహ కించన' (2.9) శివశక్తులచే వ్యాప్తము కాని దేదియు లేదని భస్మ రుద్రాక్షధారణ శ్రేష్ఠత్వమును, విధాన మును బోధించినది. భస్మజాబాలోపనిషత్తు బ్రహ్మ విష్ణు రుద్రుల ఏక స్వరూపముగ శివుని జిత్రించి, 'అద్వైతం నిష్కలం నిష్క్రి యం శాంతం శివ మక్షర మవ్యయం, (2) అని అద్వైతము శివశంకరమని తెలిపి, అట్టి 'శివంనత్వా' అని శివునకు నమస్క రించినది. జాబాల్యుపనిషత్తు మహాదేవుడే దేవుడని నిశ్చయించి,

ఉత్తడు 'సర్వజ్ఞః సర్వేశ్వరః ఈశః పశుపతిః' అనియు దెల్పి, 'అహంకారావిష్టః సంసారీ జీవః స ఏవ పశుః' అని నిర్వచించి, 'తత్స్వామినః ఇవ సర్వజ్ఞ ఈశ పశుపతిః' అని శైవమున కధారభూతమైన పశు, పాశ, పశుపతుల బ్రస్తావించినదీ యుపనిషత్తు జాబాలోపనిషత్తు పూర్వోక్త శతరుద్రీయాధ్యాయమును స్మరించి, దాని జపముచే నమృతత్త్వము గలుగునని (3) వాగ్దాన మొసంగినది. రుద్రాక్ష జాబాలోపనిషత్తు రుద్రాక్ష మహాత్మ్యమును బోధించి, అద్దాని ధరింప నుద్బోధింప, 'సర్వసాక్షిస్వరూపాశ్చివ ఏవాస్మి కేవలః' (10.5) సర్వసాక్షియు శివుడను నేనే అని అరూఢత్వమును జాబాలదర్శనోపనిషత్తు అందించినది. దక్షిణామూర్త్యుపనిషత్తు శివ ధ్యానము గావించి, అతని రూపమును వర్ణించి, ధ్యానించెను. ఈ విధముగ శైవపరములు నా యుపనిషత్తులు శైవమున దార్శనిక విచారణమునకు గొంచెముగ బునాదుల వైచినవి. ముఖ్యముగ పాశుపత సిద్ధాంతమునకు నివి మార్గదర్శికములైనట్లు స్పష్టము.

శివ, రుద్ర, ప్రస్తావనము యితర ఉపనిషత్తులలోగూడ నందందు గానబడును. కైవల్యోపనిషత్తు శతరుద్రీయమును స్మరించి, శుద్ధబ్రహ్మమును ధ్యానించుచు, 'అచింతమవ్యక్త మనంతరూపం శివం ప్రశాంతమమృతం బ్రహ్మయోనిం' (6) అని అది శివ స్వరూపమైనదనియు వాకొని, చివరకు 'పురాతనోహం పురుషోహమీశం। హిరణ్మయోహం శివరూపమస్మి' (20) జీవుడే శివుడుగ అద్వైతమును దెలిపియున్నది. అధర్వ శిఖోపనిషత్తు రుద్రుని

ప్రస్తావించి [1] 'త్రిమూర్తుల వర్ణముల వివరించుచు, రక్తపీత వర్ణము బ్రహ్మకును, విద్యుత్కాంతి విష్ణువునకును 'శుభాశుభా శుక్లా రుద్రదైవత్యా' [1] శుభాశుభమైన తెల్లనివర్ణము రుద్రునికి అని వచించినది. మహాదేవుడు సర్వవ్యాపియనియు [2], తన శ్రేయము నకై రుద్రుని ప్రార్థించినది (8). పైంగలోపనిషత్తు 'సర్వేశో మాయాలేశ సమన్వితో వ్యష్టిదేహం ప్రవిశ్య తయా మోహితో జీవత్వ మగమత్' [1] సర్వేశుడే మాయామోహితుడై జీవుడయ్యె నని వచించును. అంతయు ఈశ్వరాజ్ఞచే జరుగునని [2] ప్రపన్న తనుగూడ నీ యుపనిషత్తు చూపినది.

నారాయణోపనిషత్తు ప్రథమమున 'నారాయణాత్ రుద్రో జాయతే' [1] అని వాక్రానియు, పురుషస్య విద్మహే మహాదేవస్య ధీమహి। తన్నో రుద్రః ప్రచోదయాత్। తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి। తన్నో రుద్రః ప్రచోదయాత్' [1.5] అను రుద్రగాయత్రీ మంత్రము నుపదేశించినది. అంత 'నిత్యో నారాయణః శివశ్చ నారాయణః' అని శివునిగూడ నారాయణునిగ వ్యక్తపరచి, దేవతలలో ప్రథముడు సర్వజ్ఞుడైన రుద్రుడని [3.3] బోధించి, 'శివాయ నమః। శివలింగాయ నమః। శర్వాయ నమః। శర్వలింగాయ నమః [3.16] అనురీతి శివస్మరణ, ధ్యానముల నా యుపనిషత్తు గావించినది. రుద్రునకు 'జ్యేష్ఠాయ నమః శ్రేష్ఠాయ నమః' (3.18) అని జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వములగూడ నన్వయించి 'నమో హిరణ్య బాహవే-పశుపతయే నమః' [3.22] అని రుద్రుని ధ్యానించినది.

'ఈశానః సర్వ విద్యానాం ఈశ్వరః సర్వభూతానాం-శివో మే అస్తు సదాశివోం' (3.21) అనియు శివత్వమును ఆ యుపనిషత్తు స్మరించినది. మరియు "సర్వో వై రుద్రస్తస్మైరుద్రాయ నమో అస్తు' (3.24) 'నమోరుద్రాయ పశుపతయే స్వాహా' (3.67) "ఈశః సర్వస్య జగతః ప్రభుః' (3.71) ఈశుడు, సర్వజగత్తునకు ప్రభువు అనియు స్తుతించి, నమస్కరించి, అంత్యమున మరల "నమో రుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాతు' (3.75) రుద్రునకు విష్ణువునకు నమస్కారము. నన్ను మృత్యువునుండి రక్షించెదరుగాక అని నారాయణోపనిషత్తు ప్రార్థించియున్నది.

మహోపనిషత్తు చిన్మాత్రమైన బ్రహ్మమును స్మరించి, అది 'శివం' [2.68] అని, అటులే 'శాశ్వతం శివం' (4.71) అనియు, 'సర్వం శాంతం నిరాలంబం వ్యోమస్థం శాశ్వతం శివం। అనామయ మనాభాస మనామక మకారణం॥' (5.45) అనియు, నా బ్రహ్మస్థితిని వివరించి, అందుగల 'శివ' పదమున కర్థమునకై 'శివ ఏవ స్వయం సాక్షాదయం బ్రహ్మ విదుత్తమః' [4.85] శివుడే ఆ బ్రహ్మముగ నిశ్చయించినది. ఈ యుపనిషత్తు శివునకు, మూర్తిత్రయమునకు విభిన్నత్వమును జూపుచు 'బ్రహ్మ విష్ణు రుద్రశ్చ సర్వా వా భూతజాతయః' [3.52] బ్రహవిష్ణురుద్రులు భూతముల నుండి జనించిరనియు, నభౌతిక మకారణుడు శివుడనియు వచించి యున్నది. యోగతత్త్వోపనిషత్తు 'త్రియక్షం వరదం రుద్రం తరుణా దిత్య సన్నిభం' [92] అను మంత్రమున రుద్రుని ఉదయభాస్కరు

వర్ణమున రూపొందించి, 'బిందురూపం మహాదేవం వ్యోమాకారం సదాశివం। శుద్ధస్ఫటిక సంకాశం ధృత బాలేందుమౌళికం॥' [99] 'పంచవక్త్రియుతం సౌమ్యం దశబాహుం త్రిలోచనం। సర్వాయుధర్ ధృతాకారం సర్వభూషణ భూషితం॥' [100] 'ఉమార్ధ దేహం వరదం సర్వకారణ కారణం॥' [101] అని మహాదేవుని రూప కల్పనమునుగూడ గావించి ఆనందించినది. యోగకుండలి ఉపనిషత్తు గూడ 'శివత్వమాప్నోతి నిర్ముక్తః సర్వ సంసృతేః' (20) అని వాగ్దాన మొసంగి, అట్టి శివు నాశ్రయింపుమని 'శివం మత్వా సమాశ్రయేత్' [2.13] ప్రబోధించినది

నారద పరివ్రాజకోపనిషత్తు 'సర్వాంగమయః శివః' [8.2] అని నుతించి, పురాణమైనవాడును, పురుషోత్తముడును సర్వదేవత లకు నుపాస్యమైనవాడును, అవ్యయుడును 'శివాచ్యుత' [9.17] అని శివుని స్మరించి, 'పరాత్పరం యన్మహతో మహాంతం స్వరూప తేజోమయ శాశ్వతం శివం' [9.18] అని పరాత్పరునే శివునిగ విశ్వసించెను. నిరాలంబోపనిషత్తు 'అనాద్యనంతశుద్ధం శివం శాంతం నిర్గుణం ఇత్యాది వాచ్యం అవిద్యాచైతన్యం బ్రహ్మ' అని వచింప, ధ్యానబిందూపనిషత్తు 'సర్వవేదమయం శివః' [33] అనియు, నాద బిందూపనిషత్తు 'తతః పరతరం శుద్ధం వ్యాపకం నిర్మలం శివం। సదోదితం పరంబ్రహ్మ జ్యోతిషాముదయో యతః॥' (17) అంతట శుద్ధమును వ్యాపకమైనదియు, నిర్మలమైనదియు, శుభంకరమునై పరం బ్రహ్మము సర్వ జ్యోతుల కాధారమైయున్నది అనియు, అతీంద్రియం

గుణాతీతం మనోలీనం యదాభవేత్। అనూపమం శివం శాంతం యోగయుక్తం సదా విశేత్॥' (18) అనియు నా బ్రహ్మముయొక్క-శివత్వ శాంతత్వ లక్షణములను సూచించియున్నది. శ్వేతాశ్వతరోపనిషత్తు మహేశ్వరున్ని 'యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః। తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః॥' (2.18) వేదములకు ముందుండి, వేదాంతములచే బ్రతిష్ఠితుడై సర్వలయానంతరముగూడ నున్నవాడు అని నిర్వచించినది. మంత్రికోపనిషత్తు 'కాలః ప్రాణశ్చభగవాన్ మృత్యుః శర్వో మహేశ్వరః। ఉగ్రో భవశ్చ రుద్రశ్చ .... (12) అనుచు రుద్ర నామముల మాత్రము క్రోడీకరించినది. నృసింహపూర్వతాపిన్యుపనిషత్తు 'ఋతం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణ పింగళం। ఊర్ధ్వరేతం విరూపాక్షం శంకరం నీలలోహితం। ఉమాపతిః పశుపతిః పినాకీ హ్యామితద్యుతిః। ఈశానః సర్వవిద్యానా మీశ్వరః సర్వభూతానాం ....'(1.6) అను మంత్రమున శంకరు నామమును జూపి, అతని లక్షణముల వివరించినది. బ్రహ్మబిందూపనిషత్తు బ్రహ్మ నిర్వచనమునకై 'నిర్వికల్ప మనంతం చ హేతుదృష్టాంతవర్జితం। అప్రమేయ మనాద్యం చ జ్ఞాత్వా చ పరమం శివం॥' (9) ఆ లక్షణములతో సహా శివత్వమును జూపియున్నది. ఈ విధముగ శాండిల్యోపనిషత్తు 'జ్ఞానం జ్ఞేయాత్మకం శివం' (1.7.34) 'ఆకాశ వత్సర్వగతం సుసూక్ష్మం. 'శివం ప్రశాంతం అమృతం తత్పరం చ బ్రహ్మ' (2) అని శివ శబ్దము నుపయోగించినది. 'నమస్తుభ్యం పరేశాయ

నమో మహ్యం శివాయ చ' (32) అని సన్న్యాసోపనిషత్తు వచింప, 'అథ శైవపదం యత్ర తద్బ్రహ్మ తత్పరం' (20) శైవపద మున్న ప్రదేశము బ్రహ్మపరముగ నవ్యయమని కుండికోపనిషత్తు వాదించును. ఆత్మోపనిషత్తు 'ఆత్మ సంజ్ఞః శివః శుద్ధ ఎక ఏవా ద్వయః సదా' (1) ఆత్మ సంజ్ఞికము శివుడు అని వాకొన, యతులచే యజ్ఞములచే యోగులచే, గామింపబడు ఏకో దేవః శివ రూపీ' (1) అనియు, నతడు నిరంజనుడు అనియు చెలిపి, శర్వదే సర్వజగత్తునకు 'విధాతా ధర్తా హర్తా' (15) అనియు నన్వయించి, 'ఓం నమః శివాయేతి యాజుష మంత్రోపాసకో రుద్రత్వం ప్రాప్నోతి। కల్యాణం ప్రాప్నోతి' (4) యజుర్వేదాంతర్గతమైన 'ఓం నమః శివాయ' అను మంత్రము నుపాసించువాడు రుద్రత్వమును పొందును. కళ్యాణమును అందుకొనును అని ప్రతిజ్ఞ జేసినది. పంచబ్రహ్మో పనిషత్తు 'శంభో ర్మహాదేవం జగద్గురుం' అని శంభుని కుపదేశ కత్వమును సూచించి, దహరాకాశ మధ్యమున నున్నవాడే 'స శివః సచ్చిదానందః సోన్వేష్టవ్యః ముముక్షుభిః' [35] సచ్చిదానందుడైన శివుడు. అతడే సర్వ ముముక్షువులకు అన్వేషింపదగినవాడు అని ప్రకటించెను. 'రుద్రారాధన తత్పరుడు' [2] బ్రహ్మలోకమును బొందునని అమృతనాదోపనిషత్తు వచించెను.

ఈ విధముగ సర్వోపనిషత్తులు రుద్ర-శివుని అనేక విధములుగ స్మరించి, వివరించి, వర్ణించి, ఆరాధించి, అందే లయించియుండుట గాంచియున్నాము. అతఃపూర్వము వేదభాగములలో నేర్పడని బ్రహ్మ

విష్ణు మహేశ్వరులు యిందు సుస్పష్టముగ మూర్తీభవించి యున్నారు. అందును, శివత్వమునకు మూర్తిత్రయమువ గల రుద్రాది శబ్దము లకును విభిన్నత్వము విస్పష్టముగ గోచరము. సదాశివత్వము పర బ్రహ్మపరముగ నన్వయింపబడియుండుట గాననగును. కాని రుద్రుడు ఒక్కొక్క స్థానమున మూర్తిత్రయములో నొకనిగను, ఒక్కొక్క చోట సాక్షాత్ పరబ్రహ్మముగను నన్వయింపబడి యుండుటయు గాంచదగును.

ఋగ్వేదములో నభావమై యజురాది వేదముల సూచింపబడిన ఉమాశక్తి శివునకు అర్ధాంగిగ నుపనిషత్తులు నిస్సంకోచముగ ప్రకటించినవి. కేనోపనిషత్తులో సూచంపబడిన ఉమా, శివసతి అని విదితము కాదు. కాని, కాలాంతరమున నైయుండనోపు. కొన్ని యుపనిషత్తులలో నుమ ప్రముఖ స్థానమును అధిష్ఠించి సృష్ట్యాదిక సర్వ కార్యములకు గర్తృత్వముల దానే స్వీకరించి, అతని అవినాభావరూప శక్తియై విరాజిల్లియున్నది. రంగనాథానంద స్వామి వచనములో In symbolic language of popular Hinduism, Sakti is the wife of Siva, and both are looked upon as the parents of the whole universe. This idea Siva and Sakti as the father and mother of the universe has inspired poets and philosophers, artists and mystics, saints and devotees in India for hundreds of years 108 సార్వజనీనమైన హిందూమతమున సాంకేతిక పరిభాషలో శక్తి

108. Swami Ranganadhananda : Prabuddha Bharata, 1959, p 109.

శివునకు భార్య అగును. వారిరువురు విశ్వమునకు జననీజనకులుగ బరిగణింప బడుదురు. ఈ భావము కవులను తత్త్వవేత్తలను, చిత్ర కారులను మౌనులను జ్ఞానులను భక్తులను అనేక వందల సంవత్స రములనుండి ఉత్సాహపరచుచున్నది. 'చాంపేయ గౌరార్ధ శరీరకాయై కర్పూర గౌరార్ధశరీరకాయ' ఆమె సువర్ణ వర్ణమున నుండ, నతడు కర్పూర శుక్ల వర్ణమున ప్రకాశించును. 'అంభోధర శ్యామల కుంతలాయై తటిత్ప్రభాతామ్రజ జటాధరాయ' వినూత్న శ్యామల మేఘవర్ణమున నామె కుంతలములుండ, నతని జటాజూటము విద్యుల్లత వర్ణమున దేజరిల్లును అని అర్ధనారీ నటీశ్వర స్తోత్ర సారము. His Parasakti Uma lends veriety, colour, beauty, glory and grandeur to Siva's form and is the very core of His being, the very essence of His nature, the very basis of His existence 109 అతని పరాశక్తి ఉమాదేవి, అతని స్వరూపమునకు నానాత్వము, సౌందర్యము, తేజస్సు, కీర్తి, మహత్తుల నొసంగెను. ఆమె అతని యునికికే మూలాధారము. అతని స్వభావమునకు సారము, అతనికే ఆధారము. అని ఆగమ శాస్త్ర వచనముగ ఆచార్య రోమా చౌధురి వచనములు. ఈ విధ ముగ కాలాంతర జన్యమైన శైవమత సిద్ధాంతముల కాధారమైన శక్తియు బరిణమించి, శివునితో నీ యుపనిషత్తుల నైక్యమై, అవి గా భావ సంబంధమున నెలకొని, అయినను దన ప్రత్యేకతను విశిష్టత్వ మును బ్రదర్శించుచు నున్నదని గ్రాహ్యము.

109. Dr. Roma Chaudhuri : Prabuddha Bharata, 1960, p 418.

# శివుడు - పురాణములు

'బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవ చ। భాగవతం నారదీయం మార్కండేయం చ కీర్తితం॥ ఆగ్నేయం చ భవిష్యం చ బ్రహ్మవైవర్త లింగకే। వారాహం చ తథా స్కాందం వామనం కూర్మసంజ్ఞికం॥ మాత్స్యం తత్ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్' అనునది భగవాన్ వ్యాస ప్రణీత మైన అష్టాదశ మహాపురాణములని ప్రతీతి. ప్రాచీన చారిత్రమును అభివ్యక్తము గావించు గ్రంథము పురాణమని నిర్వచనము. ఈ పదునెనిమిది మహాపురాణములలో 'కథ్యతే దశభిర్విప్రాః పురాణైః పరమేశ్వరః' (స్కాంద. 1.13) అనుచందము శైవ, వారాహ, మాత్స్య, భవిష్య, లింగ, బ్రహ్మాండ, మార్కండేయ, కౌర్మ, వామన, స్కాందములను పురాణదశకము శివపరములై యున్నవి. అనగా అష్టాదశ మహాపురాణములలో నధిక సంఖ్య శివపరముగ రూపొంది, సర్వదేవతాగణమునకు నితడే మహాదేవుడను అధికృతను జాటుచున్నవి. వైష్ణవ, భాగవత, నారదీయ గారుడములు అను పురాణ చతుష్టయము విష్ణుపరములు. బ్రాహ్మ పాద్మ పురాణము లుభయాత్మకములు. బ్రహ్మవైవర్తము ఆదిత్యపరము. ఆగ్నేయము అగ్నిపరముగ నిర్మింపబడినది. అందుచే పురాణకర్త యయిన వ్యాస భగవానుని దృష్టిలో శివుడే పరమాత్మ యనియు, నాతడే మహాదేవుడు, తారణోపాయమని విశదము. ఈ విషయము నిస్సందేహముగ నిర్వివాదముగ వ్యక్తము.

కాని పురాణములు బహువిధ సిద్ధాంతముల కాకరమై పరస్పర విరుద్ధములై, స్వపర విభేదమునకు లొంగి, ఆత్మస్తుతి పరనిందల కాలవాలములై యుండుటయు గాననగును. ఆ యా పురాణ తాత్ప ర్యమున నే దైవము ప్రధానమో అతని ఆకసమునకు ఎత్తి, అన్య దేవతల నాతని భక్తులుగను, సేవకులుగనుగూడ చిత్రించుట సామాన్యము. అట్టి దృక్పథము కాలక్రమమున ననేక వాదవివాదము లకు గురియై, పరస్పర నిందామలకును బోరాటములకును గారణము గనై, కాలాంతర వీరశైవ, వీరవైష్ణవ, మతములకు అవకాశ మొసంగియుండుటయు గాంచదగును.

అంతియగాక, బరదైవములగూర్చి రచించిన పురాణగ్రంథ ముల దామసికములుగను, స్వదేవతా సంబంధ పురాణము లను సాత్త్వికములుగను విభజించి దూషించుటయు గాన నగును. ఆ తామస పురాణ వచనముల బరవాదు లప్రమాణములుగ వాదించు టయు విచిత్రము. అటులైనచో 'ఇతిహాసపురాణాని పంచమం వేద మీశ్వరః। సర్వేభ్య ఏవ వక్త్రేభ్యః స సృజే సర్వదర్శనః।' (భాగ.3.12.39) పంచమ వేదమగు ఇతిహాస పురాణములను సర్వ ద్రష్టయగు పరమేశ్వరుడు సర్వముఖములనుండి సృజించెనని తెలియ బడుటచే, నీ పురాణములు అన్నియు సమానముగ ప్రామాణికములని గ్రాహ్యము. మరియు బరమర్షి భగవాన్ వ్యాసునిచే నిర్మితములైన అష్టాదశమహాపురాణములలో గొన్నిమాత్రము తామసికములై అప్రమాణములు ఎట్లగును? ఈ భావమును సమర్థించుచు బద్మపురాణము

'బ్రాహ్మం మూర్ధా హరేరేవ హృదయం పద్మ సంజ్ఞితం। వైష్ణవం దక్షిణో బాహుశ్శైవం వామే మహేశితుః॥ ఊరు భాగవతం జ్ఞేయం నాభిస్స్యా న్నారదీయకం। మార్కండేయం చ దక్షాంఘ్రిర్వామో హ్యాగ్నేయ ముచ్యతే॥ భవిష్యం దక్షిణో జానుర్విష్ణోరేవ మహాత్మనః। బ్రహ్మవైవర్త సంజ్ఞాతం వామజాను రుదాహృతం॥ లైంగంతు గుల్ఫకం దక్షం వారాహం వామ గుల్ఫకం। స్కాందం పురాణం లోమాని త్వగస్య వామనం శ్రుతం॥ కౌర్మం పృష్ఠం సమాఖ్యాతం మాత్స్యం మేధః ప్రకీర్త్యతే। మజ్జా తు గారుడం ప్రోక్తం బ్రహ్మాండం చాస్థిగీయతే॥' (పద్మ. 1.62) బ్రాహ్మము విష్ణుమూర్తికి శిరస్సనియు, పాద్మము హృదయమనియు, వైష్ణవము దక్షిణ బాహువు, శైవము వామబాహువు, భాగవతము ఊరువులు, నారదీయము నాభి, మార్కండేయము దక్షిణాంఘ్రి, ఆగ్నేయము వామ పాదము, భవిష్యము దక్షిణ జానువు, బ్రహ్మవైవర్తము వామ జానువు, లైంగము దక్షిణ గుల్ఫము, వారాహము వామ గుల్ఫము, స్కాందము లోమములు, వామనము చర్మము, కూర్మము పృష్ఠ భాగము, మాత్స్యము మేధస్సు, గారుడము మజ్జ, బ్రహ్మాండము అస్థి యనియు నివ్విధముగ శ్రీహరి పురాణములనే అవయవములుగ గల వాడుగ నిష్పక్షపాతముగ చిత్రించినది. అట్టిచో వీనిలో వేని ద్రోసివాజనుట ? కాన, అన్నియు సమ ప్రామాణ్యములే అని స్పష్టము. అందుచే 'సాత్వికా మోక్షదాః ప్రోక్తా రాజసా స్స్వర్గదా శ్శుభాః తథైవ తామసా దేవి నిరయప్రాప్తి హేతవః॥' సాత్విక పురాణములు మోక్షదములు, రాజసములు స్వర్గప్రాప్తి హేతువులు, తామస

పురాణములు నరకమును బొందించును అను పద్మ పురాణవాక్యము కల్పితము అనియు బండితుల నిర్ణయము.

ఇంతదనుక శైవపురాణములు పదియు దామసము లనియు, వైష్ణవములు సాత్వికము లనెడి వాదమును సమీక్షించి యున్నాము. అటులే 'దశ చైవ పురాణాని సాత్వికాని విదుర్బుధాః। తామసాని తు చత్వారి వైష్ణవాని ప్రచక్షతే॥' (స్కాంద) శివ పురాణ దశకము సాత్వికములై యొప్ప, వైష్ణవ పురాణ చతుష్టయము తామసములు అని స్కాందపురాణము వెల్లడించినది. కాని యీ వాదముగూడ పూర్వ వాదమువలె అసమంజసము, అనాదరణీయము. ఇదియు గల్పితవచనమై విష్ణుద్వేషులచే నందు ప్రక్షిప్తములుగ నిష్పక్షపాత పండితవర్గ సముచిత అభిప్రాయము. అష్టాదశ పురాణము లన్నియు ప్రామాణికములే యనియు సర్వాంగీకారము.

పురాణాంతర విషయముల బరిశీలించినచో స్వోత్కర్షయు బరనిందయు గోచరము శైవపరములు శివుని ప్రధాన దైవముగ నిర్మించి. విష్ణ్వాది అన్యదైవముల శివారాధకులనుగ చిత్రించును. అటులే వైష్ణవములు శివబ్రహ్మల నప్రధానముొనరించి, విష్ణుభక్తు లనుగ రూపొందించును. ఈ విధానము సామాన్య పఠితలకు గొంత గలవరమును, సంశయములను గలుగజేయును. అంతియగాక, గొన్ని సందర్భముల నసహ్యము గూడ గలుగును. కాని, అట స్వీయ దైవమునకు శ్రేష్ఠత్వముల గల్పించి, భక్తుల భక్తి నినుమడింపజేసి,

సంపూర్ణ ప్రపత్తికి మార్గగాములగుటకై నా రచన లుపయుక్తము లగుటకు మహర్షులు రచించిరని గ్రహించినచో నెట్టి బాధయు గానరాదు. రచనముల నతిశయోక్తులొక యలంకారముగాన శైవపర పురాణములు శివతత్పరతకు దోహదకారులనియే గ్రహింపవలయుగాని విష్ణు, బ్రహ్మ ద్వేషపూరితములని తీర్మానింపరాదు. అటులే వైష్ణ వములు శివనిందాపూర్వకముగాక, విష్ణుభక్తి ప్రపూరితములు అని గైకొనుటుచితము. ఈ తాత్పర్యమున మాత్రమే యీ పురాణములలో ననేక గాధలు ఘట్టములు అల్లబడి, ఆ యా యిష్టదేవతల సంస్తు తించుచు. గ్రంథములు నిర్మింపబడినవి. ఆ యా దేవతల మాహాత్మ్య ప్రకటనార్థము అన్య దేవతాదుల రంగమున దింపి, యిష్టదైవ శ్రేష్ఠత్వమును ప్రతిపాదించుట జరుగుచున్నది. అందుచే నన్యదైవ ముల గించపరచినట్లు గోచరముగాని, అసలు ముఖ్య తాత్పర్యము అన్య దేవతాగణముల నవమానించుట కాదని విశాల హృదయముల, నా గాధల అంతరార్థముల గ్రహింపవలెను. భక్తుల చిత్త లక్ష్యము కొరకుమాత్రమే అట్లు నిర్మితములని మరల నెరింగెదముగాక.

ఈ విషయమును దీర్ఘదృష్టి సమాలోచించి, శివానంద సర్వస్వతీ స్వామి, What is the inner meaning of all the Saiva allusions about Vishnu worshipping Siva and all the Vaisunava allusions about Siva worshipping Vishnu? 110 విష్ణువు శివుని ఆరాధించుట, శివుడు విష్ణువు నర్చించుట యను

110 Swami Sivananda Saraswati : Lord Siva and His Worship, p 106.

సూచనల కంతరార్థమేమి? అని ప్రశ్నించి, The lower Siva must take Narayana the Parapara or Paramjyoti as his superior. The lower Vishnu must take Siva, Paramjyoti or Parapara as his superior. The higher Vishnu and higher Siva are identical. They are inferior to Para the Highest 110 అపర శివుడు పరాపరుడని పరంజ్యోతి యనబడు నారాయణుని అధికునిగ బరిగణింపవలెను. అటులే అపర విష్ణువు పరాపరుడనియు పరంజ్యోతియనియు నాబడు శివుని అధికునిగ జూడవలెను. పర శివవిష్ణువు లేకమే యగుదురు. వీరిరువురును పరమునకు తక్కువవారే అని సమాధానమును చెప్పికొనెను. అనగా అంతస్థు భేదమున నిరువురు శివులు నిరువురు విష్ణువులు గలరనియు, నందు ప్రథమ అంతస్థున నున్నవాడు పై అంతస్థువాని నధికునిగ వ్యవహరింపవలయుననియు నిట గ్రాహ్యము.

అందుచే బురాణముల శైవపరములైన గాథలు అనేకము లున్నను, వానిద్వారమున నే సిద్ధాంతము ద్యోతకము కాకుండుటచే నిట నాయా కథల నిందు బ్రస్తావించుట లేదు. పురాణములలో శివుడు భిన్న భిన్న సంఘటనములలో నిరికి, చలించి, నొక్కొకచో తన వ్యక్తిత్వమును గోల్పోవ, గొన్ని ప్రదేశముల దన గొప్పదనమును గాపాడుకొనుటయేగాక నినుమడింపచేసికొనును. పూర్వ వేదోపనిషత్తుల సూచింపబడని అసంఖ్యాక సంశయాస్పద విషయములు అతనికి గల్పింపబడినవి అతడు అసురగణములతో

110. Swami Sivananda Saraswati : Lord Siva and His Worship, p 106.

యుద్ధముల గావించును, తనకు సహాయముగ షణ్ముఖ వీరభద్రాదుల సృజించును. ఉమాదేవినేగాక, వివిధ రూపముల విమోహితుడై వివాహముల గావించుకొనును. భక్తుల తపస్సునకు మెచ్చి, అనివార్య ప్రమాదకర వరములగూడ నొసంగునంతటి మంచితనమును ప్రకటించి, భోళాశంకరుడని కీర్తిగాంచును. ఒక్కొక్కచో మూర్తిత్రయములలో నొక్కడై విరాజిల్లి, వారిలో న్యూనాధిక్యతలకు బాలై, పరియొకచో త్రిమూర్తుల కాధారభూతమైన పరమేశ్వరుడై వారినే నియమించి శాసించును. మరియు గొన్ని ఘట్టముల నా శివుడు సాక్షాత్పరబ్రహ్మమై ఎల్లరికందరానివాడై అనిర్వాచుడై, శుద్ధ పారమార్థిక వ్యవస్థలో నుండిపోవును. కైలాసగిరిపై ఉమాసతితో సరస సల్లాపముల గడుపు శంకరుడు, ఆ ఉమాదేవిని తన శరీరములో నర్ధభాగమున లయిమొనర్చి, అంత నా దేవిని ప్రత్యేక వ్యక్తిత్వము లేని శక్తినిగ బరిణమింపజేసి, తనయందే అప్రత్యక్ష రూపముగ లీనము గావించుకొనును. అప్పుడాయమ ఎవ్విధముగను ప్రత్యేకత లేక దన యునికిని సృష్ట్యాది కర్మలచే ననుమాన ప్రమాణము ననుసరించి స్పష్టపరుపగలుగుచుండును. ఆ సమయముల, బూర్వము యుద్ధములగూడ గావించిన శివుడు, సంపూర్ణ అసంగత్వమున, సర్వకార్యముల కతీతుడై, సర్వకారణత్వమునకుగూడ బరుడై, ఇంద్రియములకేగాక బుద్ధికిగూడ అగ్రాహ్యుడై సదాశివుడై యొప్పారును. ఈ విధముగ బురాణముల శంకరుడు అతి స్థూలము నాబడు ప్రాపంచిక విషయములనుండి అతి సూక్ష్మ పారమార్థిక సత్యమైన పరబ్రహ్మమువరకు వివిధ పరిణామముల ననుభవించి సర్వతోముఖ

సర్వవిధ ముముక్షుకోటికి, సాధకులకు, ఆ యా స్థానముల నాదర్శ్యముగ, నారాధ్యముగ, సాధ్యముగ, ప్ర దర్శించును. అట్టి సర్వోపయుక్త దైవము శివేతరముగ లేదనుట స్పష్టము. అట్టి మహదాశయమును వ్యక్తపరచువా డితర దేవతలలో నభావము. అట్లు పురాణములలో రుద్ర-శివ పరిణామము సర్వతోముఖమై, సర్వాకర్షణీయమై, సర్వవిధ సాధకోపయుక్తమై వెలుగొందుట సుస్పష్టము. శైవమత సిద్ధాంతములకు ప్రాతిపదికలు పురాణముల నెక్కుడుగ నేర్పడినట్లు విదితము.

## శివ నామావళి

మహాదేవ విరూపాక్ష గంగాధర మృడాఽ వ్యయ। ఇత్థం వదంతి యే విప్రా తే కృతార్థా న సంశయః॥' (14 అ) ఈ నామముల నే ద్విజులు వచించెదరో వారు కృతార్థులనుటలో సంశయము లేదని బృహన్నారదీయ పురాణ వాక్యము. 'భవాయ దేవాయ నమః। శర్వాయ దేవాయ నమః। ఈశానాయ దేవాయ నమః। పశుపతయే దేవాయ నమః। రుద్రాయ దేవాయ నమః। ఉగ్రాయ దేవాయ నమః। భీమాయ దేవాయ నమః।' అని మహన్యాసము శివనామముల స్మరింప, శివమహిమ్న స్తోత్రము, 'భవాయ క్షితిమూర్తయే నమః। శర్వాయ జలమూర్తయే నమః। ఉగ్రాయ తేజోమూర్తయే నమః। రుద్రాయ వాయుమూర్తయే నమః। భీమాయాకాశ మూర్తయే నమః। మహాదేవాయ సోమమూర్తయే నమః। పశుపతయే యజ్ఞమూర్తయే నమః। ఈశానాయ అర్కమూర్తయే నమః।' (28) అని ఎనమండుగురు శివులను స్తుతించి ఏకముగ ప్రార్థించియున్నది.

కాని యీ నామములన్నియు బూర్వోక్తముగ యజుర్వేదీయ శతరుద్రీయమున రూపొంది, కాలాంతర గ్రంథముల కాధారములై యున్నవి. భాష్యకర్త నీలకంఠాచార్య వచనములలో, 'భవ శర్వేశాన పశుపతి రుద్రోగ్ర భీమమహాదేవాభిధా నాష్టక స్యాధికరణం వాచ్యం బ్రహ్మ' (బ్ర.సూ.భా.1.1.2) భవ శర్వ ఈశాన, పశుపతి, రుద్ర ఉగ్ర, భీమ, మహాదేవ. అష్టనామములు బ్రహ్మవాచకములని భాష్యమున వచించి, 'భవ శివ శర్వ పశుపతి పరమేశ్వర మహాదేవ రుద్ర శంభు ప్రభృతి పర్యాయవాచక శబ్ద.... (బ్ర.సూ.భా.1.1.1) ఆ పదములు బాహ్యమున కన్యార్థ గోచరములై యున్నను, అవి యొకే బ్రహ్మమునకు బర్యాయ పదములని వాకొని యున్నాడు.

అయినను ఆ యా శబ్దములకు బ్రత్యేక వ్యుత్పత్తి అర్థములుండుటచే వాని అన్వయము నా యా మూర్తులకు ఉచితములగుటచే వాని గ్రహించుటయు సమంజసము. ఆ యా నామముల రుద్ర పరముగ బర్థాన్వయములతో నుపయోగించిన రుద్రాధ్యాయమునకు భాష్యకారుడైన సాయన మహాశయుడు ఆ యా పదములకు అన్వయార్థముల జూపియున్నాడు. 'శివతమా శివం' (1 అనువాక. 2. మం) 'శివతమా శాంతతమా శివం శాంతం' (సాయన భాష్య) 'నీలగ్రీవః' (1.8) 'రుద్రో నీలగ్రీవః కాలకూటధారణేన నీలవర్ణ గ్రీవ యస్యాసౌ నీలగ్రీవః' (సాయన) కాలకూటవిషమును ధరించుట వలన నీలకంఠమేర్పడుటచే నీలగ్రీవుడు రుద్రుడు. 'భగవో' (1.10 భగవో భగవాన్ పూజావాన్ మహదైశ్వర్య సంపన్నరుద్ర

(ప్రాయన) పూజావంతుడై మహదైశ్వర్య వంతుడు రుద్రుడు భగవంతుడు. 'కకుభాయ' (3.2) 'కకుభ సదృశాయ ప్రధానభూతాయ' అండమువలె ప్రధానభూతుడు రుద్రుడు 'నమో భవాయ చ రుద్రాయ చ' (5.1) 'భవంతి ప్రాణినోఽస్మాదితి భవ। రుత్ రోదన హేతుభూతం దుఃఖం ద్రావయతీతి రుద్రః।' ప్రాణులలో నుండుటచే భవుడును, రోదన కారణమైన దుఃఖమును బోగొట్టువాడు రుద్రుడు. 'నమః శర్వాయ చ పశుపతయే చ' (5 2) 'శృణాతి హినస్తి పాపమితి శర్వః। పశుసమానాజ్ఞానినః పురుషాన్పాలయతీతి పశుపతిః' పాపములను హీనపరచువాడు శర్వుడు, పశుసమానులై అజ్ఞులైయున్న పురుషుల బాలించువాడు పశుపతి. 'శితికంఠాయ' (5.3) 'శితి' శ్వేత వర్ణోఽవశిష్టః కంఠప్రదేశే' కంఠ ప్రదేశమున శ్వేతవర్ణము గలవాడు శితికంఠుడు. 'కపర్దినే చ వ్యుప్తకేశాయ' (5.4) 'జటాజూటోఽస్యాస్తీతి కపర్దీ। ముండితకేశః వ్యుప్తకేశః' జటాజూటధారి కపర్ది, కేశముల ఖండించుకొనినవాడు వ్యుప్తకేశుడు. 'సోమాయ చ' (8.1) 'ఉమయా సహవర్తత ఇతి సోమః' ఉమాసహితుడై యుండుటచే సోముడు. 'శంగాయ చ పశుపతయే చ' (8.3) 'శం సుఖం గమయతి ప్రాపయతీతి శంగః। పశూనాం పాలయితా పశుపతిః' సుఖమును ప్రాపకము చేయువాడు శంగుడు. పశుపాలకుడు పశుపతి. 'ఉగ్రాయ చ భీమాయ చ' (8.4) 'విరోధినో నాశయితుం క్రోధయుక్తః ఉగ్రః। దర్శన మాత్రేణ విరోధినోభయహేతు భీమః।' విరోధి నాశనమునకై క్రోధయుక్తుడు ఉగ్రుడు. చూచినవెంటనే విరోధులు భయపడుటచే భీముడు. 'తారాయ చ' [8.8] 'తారః

ప్రణవప్రతి పాద్యః॥' ప్రణవస్వరూపుడై సంసారసాగరమునుండి తరింపజేయువాడు. 'శంభవే చ' [8 9] 'శం సుఖం భావయత్యుత్పా దయతీతి వా శంభుః' సుఖమును గలిగినవాడు లేక జనింపచేయు వాడు శంభువు 'శంకరాయ చ' [8 10] 'ప్రియాది రూపేణ శం లౌకికసుఖం కరోతీతి శంకరః' లౌకికసుఖమును నిడువాడు శంకరుడు. 'శివాయ చ శివతరాయ చ' [8.11] 'శివః కల్యాణరూపః స్వయం నిష్కల్మషః అతిశయేన శివతరః' స్వయముగ నిష్కల్మషుడై కల్యాణరూపుడు శివుడు, అనుచందము అందందు ఉపయుక్త శబ్దము లకు భాష్యకారుడు సాయనాచార్యుడు నిర్వచనముల నొసంగియున్నాడు.

వానికే బ్రహ్మసూత్రభాష్యకర్త నీలకంఠాచార్యుడు నిర్వచన ముల నొసంగెను. 'సర్వత్ర సదా భవతీతి భవ శబ్దవాచ్యం' (బ్ర.సూ.భా. 1.1.2) సర్వత్ర సదా యుండుటచే భవుడు. 'శర్వ శబ్దేన శౄ హింసాయా మితి ధాత్వర్థాన కాశాత్ సకల సంహర్తృ బ్రహ్మ ప్రతిపాద్యతే' (1.1.2) సర్వ సంహారకుడు శర్వుడు. 'నిరుపాధిక పరమైశ్వర్య విశిష్టత్వా దీశానశబ్దవాచ్యం బ్రహ్మ (1.1.2) పరమేశ్వరత్వము గలుగుటచే నీశానుడు. 'పరతేజోభి రనభిభవనీయ త్వాత్ ఉగ్రశబ్ద వాచత్వం బ్రహ్మణః' (1.1.2) పరప్రకాశముచే ప్రకాశింపబడనివాడు ఉగ్రుడు. 'నియామకత్వేన నిఖిల చేతనభయ హేతుతయా భీమ శబ్దాభిధేయం బ్రహ్మ' (1.1.2) నియంతయై సకల చేతనములకు భయహేతువుగాన భీముడు. 'మహత్వేన దీప్య మానతయా మహాదేవ ఇత్యుచ్యతే శివః' (1.1.2) మహత్వముచే

ప్రకాశించువాడు మహాదేవుడు. 'ఈశ్వర స్యేశిత వ్యాపేక్షితయా పశుపతి శబ్దవాచ్యం బ్రహ్మ' (1.1.2) పాలకత్వమున పశుపతి. ('శివాభిధేయం పరబ్రహ్మ' (1.1.4) అని నీలకంఠా చార్యుడు తెలిపి, శివశబ్దవాచ్యం వస్తుకారణత్వేన సకల పూర్వభావి బ్రహ్మేతి విజ్ఞాయతే' (1.1.3) వస్తువుల కారణము కావుటచే సకలమునకు ముందున్నవాడు బ్రహ్మము అని శివ శబ్దమునకు భావము అనియు నిర్వచించెను. నీలకంఠుడే 'నిరస్త సమస్త దోష కళంక నిరతిశయ మంగళాధారత్వం హి శివత్వం' (1.1.4) అనియు శివ నిర్వచనము గావించెను. పై విధముగ నీలకంఠాచార్యుడు ఆ నామములకు ప్రత్యేక ముగ అర్థముల జూపియున్నాడు.

వానికి మహాభారతముగూడ అర్థముల దెలిపియున్నది. (అను 161.4) సీ॥ 'ఉగ్రత్వమున బ్రతాపోన్నతి రుద్రనామము దాల్చె దేవసంఘములకెల్ల। మహతి నా బొలుపారు మహనీయ దేవత గావున విను మహాదేవుడయ్యె। నఖిల సత్కర్మ ఫలాకార శుభములు సేయు పేడుక కల్మి శివుడనంగ। జనియెస్థిర తేజమున వెలుగొందుట నంచిత స్థాణుసమాఖ్యబరగె। ధూమ్రమపుజాయ జటల, వలన ధూర్జటి యను పేర వరలె హరుడు' (అను.5.398) భూతములెల్ల పశువులు దా బతి గావున పశుపతి నా వెలుంగు।' (అను.5.400) మరియు ఏటవాలు కన్నులు గలవాడు కావున విరూపాక్షుడు అనురీతి నా అర్థముల మహాభారత గ్రంథము వివరించినది.

'శివమిచ్ఛ న్మనుష్యాణాం తస్మాదేవ శివః స్మృతః' మనుష్యులచే శివత్వము వాంఛింపబడుటచే నా శివత్వమను దేవుడే శివుడు అని మహాభారతము వచింప' 'సంసారవ్యాధి భేషజం అనంత దుఃఖశమనం। శివ ఇత్యక్షర ద్వయం' (18) అని శివతత్త్వ సుధానిధి వాక్యము. అదేవిధముగ 'బుద్ధీంద్రియ నియంతృత్వాదీశ్వరః' (2) బుద్ధీంద్రియముల నియమించుటచే నీశ్వరుడని నిరాలంబోపనిషత్తు వాక్యాన, 'ఈశ్వరః అనిర్వచనీయ ప్రేమస్వరూపః' అనియు ఈశ్వరుడు వర్ణింపబడియున్నాడు. ఈశ్వర శబ్దమునకు వివేకానంద స్వామియు జక్కని నిర్వచనముల నొసంగెను. Paramatman as ruling Maya is Iswara 111 మాయను పాలించు పరమాత్మయే ఈశ్వరుడనియు, Iswara is the highest posible reading of the Absalute by the human mind 112 మానవచిత్తముచే బరతత్త్వమునకు గల అత్యున్నత నిర్వచనమే ఈశ్వరుడు అనియు, Iswara is the Atman as seen or grasped by mind 113 మనస్సుచే జూడబడిన, లేక గ్రహింపబడిన ఆత్మయే ఈశ్వరుడు అని యా యతీశ్వరుని అన్వయార్థము. ఈ విధముగ శివనామములకు సుప్రసిద్ధముగ ననేకరీతుల అన్వయములు చేయబడినవి.

111. Swami Vivekananda : The Complete Works, Vol. 7, p 64.

112. Swami Vivekananda : The Complete Works, Vol. 3, p 37.

113. Swami Vivekananda : The Complete Works, Vol. 7, p 60.

## రుద్ర - శివుడు : గుణ, వర్ణములు

పూర్వగ్రంథమున బురాణతాత్పర్య ప్రసంగ సందర్భమున, నా పురాణములుగూడ సత్వరజస్తమో రూపముగ త్రివిధములై విరాజిల్లుటయు, నవియు, వైష్ణవులకు శైవపురాణములు తామసికములై నరకహేతువులగుచుండ, శైవులకు వైష్ణవ పురాణములు తామసిక ములై నరకభాధాకారణము లగుచుండుటయు, నా విభాగి మటుల పాక్షిక దృక్పథ కల్పనమనియు గాంచియున్నాము. అదేవిధముగ నిట రుద్ర - శివునకు సత్త్వరజస్తమో గుణములును, తదనుకూల వర్ణము లును చాల వరకు కల్పింపబడినట్లు తోచును.

మూర్తిత్రయమునకు నీ గుణ, వర్ణ, నిర్ణయము పూర్వ గ్రంథముల జూడబడిన వారివారి కార్యస్థితుల ననుసరించి ఏర్పడినవి. ముఖ్యముగ సగుణ బ్రహ్మము సచ్చిదానంద లక్షణోపేతుడై, సృష్టి స్థితి లయ కారణముగ నీ జగజ్జీవులకు అగుచున్నాడు. కాని విభిన్నములు కాకపోయినను భిన్నకార్యములుగ దోచు నీ త్రివిధ కార్యములు ప్రత్యేక వ్యక్తులచే నిర్వహింపబడుచుండునటుల విశ్వ సింపబడి, సృష్టి కార్య నిర్వాహకుడు చతుర్ముఖ బ్రహ్మయనియు, నా సృష్టికి పాలకుడై రక్షకుడై పోషకుడుగ విష్ణువు గలడనియు, గాలాంతరమున నా జీవజగత్తుల లయ మొనరించు కర్తృత్వము రుద్రునిదనియు నిర్ణయింపబడెను. ఆ మూర్తి త్రయమునకు నా యా కార్యములందు సహాయశక్తులుగ సరస్వతి లక్ష్మి పార్వతులు భార్యలుగగూడ రూపొందింపబడిరి.

ఇందు చతుర్ముఖునకు పూర్వచారిత్రమున నెవ్విధమైన సమస్యలును లేక, అన్ని గ్రంథముల నతడు ఒకే మూర్తిగ నొకేవిధముగ నుండుటచే నతని గుణ, వర్ణముల నెట్టి విభిన్నత్వము గానరాదు. అదియునుగాక, అనూహ్యాకారణమున శివవిష్ణువులకువలె నతనికి గుణ, రూప, వర్ణముల దమతమ కభిమతముగ జిత్రించుకొని, ఆతని నున్నతస్థాయిలో దేవదేవుడుగ రూపొందించుట కెట్టి యనుచరులు లేరు. కాని విష్ణుశివుల కట్లు కాదు. ఆయా మతావలంబకులు తమ ఇష్టదేవునకు ఉత్కృష్టగుణ, వర్ణముల జూచి ఆరాధించుకొనుట సహజమైయున్నది. అందుచే త్రిగుణ నిర్ణయమున, వర్ణ కల్పమున దారతమ్యములు ఈ మూర్తిద్వయమున మాత్రమే మిగుల గోచరము.

## మూర్తిత్రయము - త్రిగుణములు

సృష్టి స్థితి లయముల గావించుటకు బ్రహ్మ విష్ణు శివులు అని నిర్ణయము. వారికి సత్త్వ రజ స్తమములను అన్వయింపవలెను. ఇందు పూర్వోక్తమురీతి బ్రహ్మదేవుని విషయమై వాదించు భక్తులు శూన్యము, విష్ణుపరముగ ననేకులు గలరు. అయినను, విష్ణుదేవుని పూర్వచారిత్రము విభిన్నతత్త్వములతో గూడనిదై యుండుటయు గాంచనగును. కాని శివుని విషయమున అటుల కాదు. పూర్వము గ్రహించియున్నట్లు, ఋగ్వేదమున రుద్రుడుగను, అందును విభిన్న వర్ణములతో విభిన్న తత్త్వములతో, బరస్పర విభేదముల నచ్చుట అతడు ప్రత్యక్షముగదా. అంత, యజుర్వేదాదుల శివత్వము

నొంది, శివ నామమును స్థిరముగ గైకొని, యింకను ఈశాన మహేశ్వరాది అనేక నామాంతరములగూడ బొంది, ఒక్కొక్క నామమునకు కార్యవిభిన్నత్వముల గలిగి, పూర్వమువలె పరస్పర విభిన్నలక్షణముల శోభిల్లి, అనేక క్లిష్టత్వముల మన ముందుంచె నీ శివుడు. అంత బురాణముల సామాన్య మానవలక్షణములనుండి, పరబ్రహ్మమువరకు సర్వవిధ సోపానములలో గోచరించి, ఇదమిత్థ మని తీర్మానింప గష్టసాధ్యమైన మూర్తిత్వమును బ్రదర్శించి యున్నాడు.

## శివుడు తామసికుడా ?

కావున నీ శివునికి, మూర్తిత్రయ స్థానమున రుద్రుడని శివుడని, ఈశ్వరుడని, పరమేశ్వరుడని, మహేశ్వరుడనియు మొదలగు వివిధ నామములు అన్వయింపబడుటచే, నాయా నామముల బూర్వ చారిత్రముగూడ నా నామములతో నా మూర్తి నావరించి, ఆ యా గుణ, వర్ణముల జిత్రించెను. ఉదాహరణమునకు, రుద్రుడు, వేదమున ఉగ్రుడు, యుద్ధకౌశలుడు, ఒక్కొక్కచో దుష్టకార్య నిర్వాహకుడు. అట్టివా డెట్లుండును? తామసగుణ విశిష్టుడై యుండవలెను. రౌద్ర మున నుండుటచే భయంకరుడై యుండవలెను. అందుచే నాతనికి సృష్టి స్థితి లయములలో లయమునకు సంహారమను పద విభేదమున సంహారకార్యము ఒసంగబడెను. అందుచే బ్రహ్మ సృజింప, విష్ణువు పోషింప, రుద్రుడు సంహరించును. రుద్రునకు దామసము నన్వ యింప, పోషకుడైన విష్ణువునకు సత్త్వ మీయబడెను. బ్రహ్మకు

రజస్సు మిగిలెను. 'తమోమాయాత్మకో రుద్రః। సాత్త్వికమాయాత్మకో విష్ణుః। రాజసమాయాత్మకో బ్రహ్మా।' (పాశుపతబ్రహ్మ.1) అని ఉపనిషత్తు వచనము. 'త ఏవ సద్గుణా స్తస్యా స్త్రైగుణ్యైర్మాత్రయో భవన్। రజోగుణో రక్తవర్ణో శుక్లవర్ణస్తు సాత్వికః। తమోగుణః కృష్ణవర్ణ స్త్రైగుణ్యై ర్మాత్రయ స్తథా॥ బ్రహ్మాశ్చ విష్ణుశ్చ రుద్రశ్చ దేవా స్త్రిగుణ సంభవాః।....' (4) అను సుధానిధి శ్లోకముల జక్కగ త్రిమూర్తులు, వారి గుణములు, వారి వర్ణములు, స్పష్టపరుపబడినవి. తదనుసారముగ బ్రహ్మ రజో గుణవిశిష్టుడై రక్తవర్ణముగలవాడగుచుండ, విష్ణువు సత్త్వగుణమున ధవళవర్ణము గలిగియుండును. అంత రుద్రుడు తమోగుణముతో కృష్ణవర్ణమున భాసించును. 'అకారః పీతవర్ణః స్యాద్రజోగుణ ఉదీరితః' (12) 'ఉకారః సాత్త్వికః శుక్లో మకారః కృష్ణతామసః' (ధ్యానబిందు. 13) మూర్తిత్రయమును ప్రణవమునకు అన్వయించిన ఉపనిషత్తులుకూడ నైవిధముగ గుణ, వర్ణముల నిర్ణయించినవి.

## సత్త్వము - శివుడు

అట్లుగాక సంహారకర్త అనుటకు బదులు ఉపసంహారకర్త అనియు, లయకర్తయనియు శివు నన్వయించుచో రుద్రునిలోగల ఉగ్రత్వ మదృశ్యమై, శాంతత్వము గోచరించి, కృష్ణత్వమభావమై, శుక్లత్వము ముందుకు వచ్చును. 'ప్రథమా రక్తపీతా మహద్బ్రహ్మ దైవత్యా। ద్వితీయా విద్యుమతీ విష్ణు దైవత్యా। తృతీయా శుభా శుభా శుక్లా రుద్రదైవత్యా' (అధర్వశిఖ.1) ఇచ్చట బ్రహ్మదేవునికి

రక్తిపీతవర్ణము, విష్ణువునకు విద్యుద్వర్ణము, రుద్రునికి శుక్లవర్ణము తెలుపబడినది. మాండూక్యాది యుపనిషత్తులు ఈ మూర్తిత్రయమును అ ఉ మ అర్ధమాత్రాత్మక ప్రణవమునకును, అంతజాగ్రత్స్వప్న సుషుప్తి తురీయములకును సమన్వయించుచు, అకార జాగ్రత్తులు చతుర్ముఖునకు, ఉకార స్వప్నములు మాధవునకును, మకార నిద్రలు ఈశ్వరునకు జూపియున్నవి. అందు అకార ఉకారముల కంటె మకారము తురీయమైన అర్థమాత్రకు సన్నిహితము. మకార రూపమైన సుషుప్తియు దురీయమునకు దగ్గరదై, యనేక విషయముల దాని బోలుచు మిగుల జేరువగ నున్నది. త్రిగుణాతీతమైన తురీయ ప్రాప్తికి, తమస్సు చాలదూరమైయుండ, సత్వము చాల సన్నిహితమై 'సత్త్వాత్ సంజాయతే జ్ఞానం' అను కీర్తి నార్జించినది. తాత్వికముగగూడ సుషుప్తి ఆవరణ మాయారూపమై ఆత్మకు దగ్గరనుండ, స్వప్న జాగ్రత్తులు విక్షేపమాయారూపములై దూర దూర స్థానముల నొందియున్నవి. మరియు నిద్ర అజ్ఞానస్థితియై యుండ, స్వప్నజాగ్రత్తులు అన్యథాజ్ఞానరూపములై జీవునకు అతి ప్రమాదభరితములై వెలుగొందును. అందుచే బాహ్య దృష్టికి సుప్తావస్థ అజ్ఞానకారణమున తమోగుణమని కీర్తిగాంచినను, యథార్థమున నదియే సత్త్వాంశమై యున్నది. అందుచేత నిటనున్న ప్రాజ్ఞుడు శుద్ధమాయావిష్టుడైన ఈశ్వరునితో బోల్పబడెను. శుద్ధమాయయే ఆవరణమాయ యనబడును. అది సాత్వికమని వేరుగ వచింప ననావశ్యకము. అంత స్వప్నములోని తైజసుడు కొంచెము అన్యథాజ్ఞానమున మునిగి, ప్రాపంచిక సంబంధమునుగలిగి, మనస్సులోనే

ఊహించి ఇంద్రియ సాహాయ్యము లేకయే ప్రవృత్తులపై నాధారపడి, రజస్సులో సుఖదుఃఖముల ననుభవింప, జాగ్రత్తలో విశ్వుడు, విశ్వరూపమును ధరించెనో యనగ స్థూలమైన సర్వ విశ్వముతో స్థూలేంద్రియములద్వారమున సంబంధ బాంధవ్యముల నెలకొల్పి, 'స్థూలభుక్' అనబడి, తీవ్రతర సుఖదుఃఖాదుల నిరికి యున్నాడు. కాని ప్రాజ్ఞుని కేవిషయ సంబంధములేక, హాయిగ, ప్రశాంతస్థితిలో 'ఆనందభుక్' అయి యున్నాడు. అట్టి ప్రాజ్ఞు డెట్లు తమోగుణ విశిష్టుడగును? అతని రూపాంతరమైన ఈశ్వరుడు ఎట్లు తమోగుణ రూపు డనబడును? జాగ్రత్ దృష్టికి సుషుప్తి అయోమయత్వమున అంధకారబంధురమైనట్లు గోచరించి, తమస్సు నాబరగును గాని అట్లనుట యుక్తిబాహ్యము, అనుభవ దూరము. ఈ దృష్టితో శాస్త్రవాక్యముల నన్వయించుకొన జెల్లుగాని, తదన్యార్థములు అనుచితములు అని దీని నిశ్చితార్థము.

ఈ అభిప్రాయము ప్రకారము బ్రహ్మ విష్ణు మహేశ్వరుల వలెనె, జాగ్రత్ స్వప్న సుషుప్తులవలె, సత్త్వ రజస్తమములు, కొంచెము తలక్రిందులై తమో రజ స్సత్త్వములుగ మారి, ఆ యా మూర్తులకు అన్వయించును. అనగా, బ్రహ్మదేవునికి దమస్సు అన్వయము. అవును, సృష్టికార్యము అన్యథాజ్ఞానపరమై, విక్షేప మాయా కారణమై, సర్వ వికారాకార భూయిష్ఠమై యుండునుగదా! అటులే పోషణ కార్యమునకు సత్త్వతమములకంటె రజోగుణమే అధికముగ నవసరము. రజోగుణము క్రియాత్మకముగదా! ఆ రజో

గుణ మాహాత్మ్యము చేతనేగదా విష్ణువు పోషణ, రక్షణ కార్యముల, కొటంకిదాయక అసురశక్తుల నడంప, పెక్కవతారముల నెత్తి వారి దునుమాడుట? అందుచే విష్ణువునకు రజోగుణ మన్వయము. అంత, ప్రపంచమున సుఖదుఃఖ ద్వంద్వముల నిరికి, విసివి వేసారిన జీవునికి, గొలది హాయి నొసంగు నుద్దేశ్యమున, తల్లి శిశువును లాలించి, జోలపాటల దేల్చి నిద్ర బుచ్చువిధాన, మహేశ్వరుడు, జీవుని ఇంద్రియ ప్రవృత్తుల నియమించి, శాంతమున లయింప జేసి, జీవునికి గొంతకాలము ఆనందము నొసంగుచున్నాడు. ఆ యానందము నుపనిషత్తులు బ్రాహ్మీస్థితితో అనగా బ్రహ్మానంద స్థితితో బోల్చి యున్నవి. అట్టి హాయి, ఆనందము తమస్సులో గలుగునా? అత్యుత్తమ సత్త్వాంశ జనితమే అది.

అందుచే ప్రణవమున మకారాక్షరమే మహేశ్వరున కన్వయించినచో, అవస్థాత్రయమున సుషుప్తియే శివునకు గలిపినచో, శివుని సత్త్వలక్షణముచే నలంకరించి, అతని మూర్తిత్రయమున ఉత్తమస్థాయి నుంచుట సముచితము. ఇందు జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వ నిర్ణయము లెట్లున్నను శివుడు యీ విధానమున శివంకరుడై, శంకరుడై, శంగుడై, శంభువై, ఈశ్వరుడై, పూర్వాపూర్వ వ్యుత్పత్త్యర్థములకు సంపూర్ణ అన్వయార్థమున ప్రకాశించును. అట్లు కాదేని శాస్త్ర తాత్పర్యమునకు విరుద్ధత్వము వాటిల్లును.

బ్రహ్మవిద్యోపనిషత్తు 'మకార స్త్వగ్ని సంకాశో విధూమో విద్యుతోపమః' (8) మకారము ధూమరహిత అగ్నిచందము విద్యు

త్కాంతి నుండును అని వచించి, 'ఈశ్వరః పరమో దేవో మకారః పరికీర్తితః' (8) ఈశ్వరుని బరమ దైవముగ బోధించినది. 'ఈశ్వరస్య విజానీయా దంతస్సత్త్వే బహిస్తమః' (4) బాహ్యమునకు తమోగుణమున దోచి, అంతరమున సత్త్వ గుణాధికుడు ఈశ్వరుడు అని శివ తత్త్వ సుధానిధి అంతరార్థమును వెలిబుచ్చును. కృష్ణోపనిషత్తు 'ప్రోక్తా చ సాత్వికీ రుద్రే శక్తే బ్రహ్మణి రాజసీ। తామసీ దైత్యపక్షేతు....' (8) సంపూర్తిగ రుద్రునికి సత్త్వము నొసంగి, అసురసంహారకుడైన విష్ణువునకు దామసగుణము నన్వయించినది. శివగీతయు 'ప్రథమా రక్తవర్ణా స్యా ద్ద్వితీయా భాస్వరా మతా। తృతీయా విద్యుదాభాసా చతుర్థీ శుక్లవర్ణినీ।' (15.22) ప్రథమమాత్ర రక్తవర్ణముగలది, రెండవది భాస్వర వర్ణమును, మూడవది మెరుపు కాంతిని, నాల్గవది శుక్ల వర్ణము గలది అనియు వాకొనియున్నది.

## రుద్ర వర్ణము

అయినను వివిధ శాస్త్రములు రుద్రుని ఎట్లెట్లు యీ విషయమున జిత్రించినచో యినుమంత చూచెదముగాక ! 'రోహితాయ' (2.9) ఎర్రని వర్ణముగ రుద్రాధ్యాయము, (9.63) ముక్తిఖండమున సూతసంహితయు, నదేపదమున వచించెను. 'యద్రుం తరుణాదిత్య సన్నిభం' (9) ఉదయభాస్కర వర్ణము అని యోగతత్త్వోపనిషత్తు తెలుప, తామ్రో అరుణ ఉత బభ్రుః' (1,7) ఉదయకాల సూర్యునివలె రక్త వర్ణము శివునకు అని నమకము వాకొను

చున్నది. 'కదళీ పుష్ప సంకాశం సర్వవేదమయం శివం' (33) అరటిపువ్వువలె ఎర్రని వర్ణముగలవాడు వేదమయుడైన శివుడని ధ్యానబిందూపనిషత్తుకూడ వచించుచున్నది. 'జ్వల త్పావకసంకాశం' (5.16) రుద్రాధ్యాయము, 'అనలస్కంద వపుషః' (10) అని శివ మహిమ్న స్తోత్రము, 'జ్యోతిర్మయోయం లింగ' అను వివిధరీతుల నా శివ స్వరూపము ఎర్రనికాంతితో ఆ వర్ణముతో గూడియున్నట్లు శాస్త్ర వచనములు గలవు.

మరియు కొన్ని గ్రంథములు 'క్షీరగౌరి త్రీనేత్ర। పాలవలె తెల్లని కాంతి గలవాడు త్రినేత్రుడు అని దక్షిణా మూర్త్యుపనిషత్తు, 'నీలగ్రీవాయ చ శితికంఠాయ చ' (5.3) నీలకంఠునకు, ధవళ వర్ణునకు అనియు, 'నీలగ్రీవః' (11.3) అని రుద్రాధ్యాయము తెలుప, సందు వ్యాఖ్యాత సాయనుడు 'ప్రదేశాంతరే శ్వేతవర్ణః' అని దేహము శ్వేతవర్ణము అనియు, 'విలోహిత' (10.11) 'లోహిత రహితం శ్వేత ఇత్యర్థః' అనియు అర్థమును తెలిపియున్నాడు. శివతత్త్వ సుధానిధియు, 'అంతస్సత్వగుణోద్భాసి శుద్ధస్ఫటిక సన్నిభం' (12) అనియు, దాని వ్యాఖ్యానమో అను రీతి 'ధవళాయ వపుషి నిఖిలే' (14) చర్మమంతయు ధవళవర్ణము గలవాడు అని స్పష్టపరచినది. అటులే శుద్ధస్ఫటిక సంకాశం త్రినేత్రం' అని మహాన్యాసము ప్రార్థింప, 'గోక్షీర ధవళాకారః' (8.20) సూతసంహిత తెలుపుచున్నది. 'హిరణ్యవర్ణాయ' (3.22) అని నారాయణోపనిషత్తు, 'శరచ్చంద్ర ప్రకాశేన వపుషా శితం

ద్యుతిం' అనియు, 'పూర్ణశశాంకమండలనిభం' అనియు, 'ప్రాలేం దూచల కుందుకుందధవళం' అనియు మహాన్యాసము కొనియాడ, కర్పూర గౌరార్ధ శరీరాయ' (1) కర్పూరమువలె ధవళవర్ణముగల వానికి అని అర్ధనారీ నటేశ్వర స్తోత్రము పఠించుచున్నది. 'కోటి సూర్య ప్రతీకాశం' (4.7) 'కోటిమధ్యాహ్న సూర్యాభతి' (12.36) అని మహాదేవుని సూర్యప్రకాశముతో బోల్చుటయేగాక, 'శుద్ధ స్ఫటిక విగ్రహం' 4.2.), 'శుద్ధ స్ఫటికసంకాశః త్రినేత్రః చంద్రశేఖరః' (8.1), 'శుద్ధ స్ఫటిక సంకాశం....' (12.28) అను శ్లోకముల స్ఫటిక వర్ణముగల వానిగ శివగీతా గ్రంథము చిత్రించియున్నది. ఈ విధముగ నా మూర్తిని ధవళవర్ణము గలవానిగ నీ గ్రంథములు రూపించుట గాంచియున్నాము.

రుద్రాధ్యాయ పాఠమున రుద్ర శివ శబ్దము లుభయము లుపయోగింపబడిన (1.3) మంత్రమునకు భాష్యకర్త సాయనా చార్యుడు, రుద్రునకు 'తనువౌ ఘోరాఽన్యా శివాన్యా ఇతి' ఘోర శివరూపములు రెండు గలవనియు, నందు 'హింసికా ఘోరా అనుగ్రాహికా శివా' అని వివరించెను. అందు ఘోరము తామసిక రజోగుణ భూయిష్ఠత్వమున బూర్వోక్త కృష్ణ, రక్తవర్ణముల గలిగి యుండ, శివ పరము సాత్త్వికమై ధవళ వర్ణమును బొందియుండ నగునేమో ! ఈ రెండు రుద్రరూపములు కాలాంతర గుణ, వర్ణ, వివరణమున నింతగ విభిన్నత్వమును గలుగజేసి యుండును.

శైవమున మరియొక విధానముగూడ గలదు. శివుడు మూర్తి త్రయములో నొక్కడుగ బరిగణింపబడక, నీ ముప్పుర కాధార

భూతమైన బరమేశ్వరుడుగ విశ్వసింపబడును. పద్మ పురాణము 'మహేశః పరం బ్రహ్మ శాంత సూక్ష్మ పరాత్పరః। తస్యేచ్ఛా భవత్సూర్వం జగత్స్థితికారిణీ। వామాంగాదభవం తస్య సోహం విష్ణురితి స్మృతః। జనయామాస ధాతారం దక్షిణాం త్సదాశివః। మధ్యతో రుద్ర మీశానం కాలాత్మ పరమేశ్వరః' మహేశ్వరుడు పరబ్రహ్మము బరాత్పరుడు. అతని యిచ్ఛాశక్తియే జగత్సృష్ట్యంత కారిణి. అతని వామాంగమువలన విష్ణుమూర్తినైన నే నుద్భవించితిని. దక్షిణాంగమువలన బ్రహ్మయు, మధ్యభాగమునుండి రుద్రుడుద్భవించిరి అని మహేశ్వరుడైన శివుడే, మూర్తిత్రయమునకు గారణముగ నుడివినది. పరమేశ్వరుడే యీ మూర్తుల సృజించెనని శివ కర్ణామృతమున (47) అప్పయ దీక్షితుల వాదము. ఈ విషయము మహాభారతము అనుశాసనిక పర్వమునగూడ బ్రస్తాపితము. శివ పురాణమున విశ్వేశ్వర సంహితలోగూడ నిటులే శివుడే మూర్తి త్రయమును గల్పించి, ఆ యా కార్యముల వారి కొసంగినట్లు తెలుపుచున్నది. శివ రహస్యములో ఉపదేశకాండమున నిదే విషయము వివరింపబడినది. శివుడు సమస్త భువనములకు కర్తయై, గుణ త్రయాత్మకముగ మూర్తిత్రయమును సృజించి, సృష్టిస్థితి లయ కార్యనిర్వహణమును, వారిచే గావించెను. ఇటుల మూర్తిత్రయములో జేరని మహేశ్వరుడు బ్రహ్మవిద్యోపనిషత్ప్రకారము 'బ్రహ్మణో హృదయస్థానం కంఠే విష్ణుః సమాశ్రితః। తాలుమధ్యే స్థితో రుద్రో లలాటస్థో మహేశ్వరః॥' (41) బ్రహ్మ విష్ణు రుద్రుల స్థానముల

గాక ప్రత్యేక స్థానాధిపతిగ రూపొందెను. అందు చేతనే మాండూక్యాది యుపనిషత్తులు అతని 'శాంతం శివ మద్వైత్వం చతుర్థం మన్యంతే స ఆత్మా' (7) అని శివుని నాలుగవవానిగ ప్రత్యేకత జూపించియున్నవని శైవమతావలంబకుల వాదము. ఇచట శివ శబ్దము బరబ్రహ్మావాచకముగ వారి వాదము. అప్పయ దీక్షితులు శివకర్ణామృతములో 'యః పరః స మహేశ్వరః' అని రచించెను. శివాత్మకమైన మహేశ్వరుదే జగత్సృష్ట్యాదుల నిర్వహింప త్రిగుణముల ధరించి, బ్రహ్మ విష్ణు రుద్రాది మూర్తుల దాల్చినట్లు సూత సంహితా వాక్యములు. అనగా శివుడు 'ఏక ఏవ' ఒక్కడై యున్నను, మూర్తి త్రయముగ నావిర్భవించి, నా యా విహిత కార్యముల నిర్వహించెనని విదితము.

కావున శైవుల శివుడు is not one of the Trinity, Brahma Vishnu and Rudra; he is the Surreme Lord, Parameswara, the Self of all beings, immutable and ever perfect. Even when Siva is identified with Rudra, the destroyer of the world, say the Saivas, he is superior to the other two, because at the time o pralaya he alone stands uneffected and exists eternally as the Supreme Being 114 బ్రహ్మ విష్ణు రుద్రులతో మూర్తి త్రయమున నుండడు. అతడు పరమేశ్వరుడై, సర్వాత్మ స్వరూపుడై, అవ్యయుడై, నిత్య నిర్మలుడై యొప్పారును. అట్లుగాక, శివుని,

114. Prof. T. M. P. Mahadevan : Prabuddha Bharata, 1953, p 132.

సంహార కర్తయగు రుద్రునితో నేకము గావించినను, శైవమత ప్రకారము, బ్రహ్మ విష్ణువులకత దధికుడు. మహాప్రళయకాలమున నత డొక్కడు మాత్రమే నిత్యుడై, పరబ్రహ్మమై యుండునుగదా। శైవ మతావలంబికులలో ముఖ్యుడైన అప్పారు అను నాయనారుని భావమున శివుడు త్రివిధము. ప్రథముడు ప్రళయకర్తయై, జీవుల పాశత్రయమునుగూడ నుద్ధరించును. ద్వితీయుడు పరాపరు డనబడును. ఇట నతడు అర్ధనారీశ్వర మూర్తియై, పరం జ్యోతియై, చతుర్ముఖ మాషవుల కర్థముకాని ఆకారమున వెలుగొందెను. తృతీయుడు యీ రెండు మూర్తులకుగూడ నతీతుడై, పరముడని బ్రఖ్యాతితో బ్రహ్మ విష్ణు రుద్రులకు కారణుడై, పరిశుద్ధ శివరూపుడై యుండును. శైవ సిద్ధాంతమున శివ మనగా నీ తత్త్వమే యగును. ఇదియే ఔపనిషదమైన పరబ్రహ్మతత్త్వము.

శివునిలో గల పరాపరత్వ ద్వివిధ విభాగము, వైష్ణవమున గూడ గలదనియు, నందుచే బరశివుని అపర విష్ణువు గొలువ, బరవిష్ణుని అపరశివుడు గొల్చునట్లు ఆ యా పురాణములు బోధించునని శివానంద సరస్వతీస్వామి సమన్వయింప యత్నించెను. 115 ఎటులైన శివునకు విభిన్న తత్త్వములతో అనేక రూపకల్పనము గలదని స్పష్టము.

అందుచే నీ శివునకు గేవల సత్త్వగుణము నన్వయించుట సముచితమే యగును. 'సత్త్వానాం పతయే నమః' (2.13) అని

115. Swami Sivananda Saraswati : Lord Siva and His Worship. P 106.

రుద్రాధ్యాయము కీర్తించినను, 'శాంతత్వా చ్ఛివః' అని అర్థములం జూపినను, 'పరబ్రహ్మణః శివస్య పదం తు నిరతిశయ సుఖరూప మనావృత్తి లక్షణమేవ' (బ్ర. సూ. భా. 1.3.25) పరబ్రహ్మము యొక్క శివపదము నిరతిశయ సుఖరూపమని నీలకంఠాచార్యుడు నిర్వచించినను సమంజసమే అగుచున్నది.

ఈ విధముగ శైవ రహస్యమును గ్రహించిన శివభక్తుడగు సుదర్శనాచార్యుడు 'బ్రహ్మాసి విష్ణురసి సర్వమసీతి యస్త్వాం మాస్తాం ఉపాసనవిధౌ కథయంతి మూఢాః। తద్దేవతాంతర నికర్ష ని గుహనాయ। మోహాయ వా భజతి జల్పిత మల్పవాదః' ఓపరశివా ! నీవే చతుర్భుజుడవు. విష్ణుదేవతవు. ఇతర దేవతలును నీవే అని మూఢులు కొందరు యూహించెదరు. కాని ఇది తుచ్ఛవాదము. ఆ దేవతలకు నీతో సామ్య మెన్నటికిని చేకూరనేరదు అని ప్రగాఢ విశ్వాసమున శివస్తుతి జేయుటయు సామాన్యమే యగుచున్నది. పరాపర విభాగమున స్థూలమునుండి అతి సూక్ష్మమువరకు గల సర్వ స్వరూపముల దా నధిష్ఠించి, సర్వము తానెయై, సర్వ విధ సాధకకోటి కాదర్శమై, శ్రేష్ఠమై, ఆరాధ్యదైవమై, గమ్యమై విరాజిలు నా పరమశివునకు శతకోటి ప్రణామములు. ఆ మూర్తి భారతీయ సంస్కృతీ గగనమున మహాప్రకాశము. ఆ మూర్తి దీప్తిపుంజముచే ననేక ముముక్షుహృదయ కారాగారములు ప్రకాశ వంతములై యొప్పారినవి. ఆ అసమాన అద్భుత అగోచర శివతత్త్వమును సదా హృదయ పీఠముల నధిష్ఠింపజేసి అనుభవించెదము గాక !



# శైవాచార్య సంప్రదాయము

## గురు పరంపర

శ్లో॥ సురాసురేంద్రార్చిత పాదపద్మం
సమస్త కళ్యాణనిధాన మీశం।
త్రిశూల పాశాంకుశ చాపహస్తం
శ్రీ నీలకంఠం ప్రణమామి నిత్యం॥

శివతత్త్వ సుధానిధి

దేవదానవులచే నారాధింపబడు పాదపద్మములు గలవాని, సకల శివంకర లక్షణ సంపదగల బరమేశ్వరుని, త్రిశూల పాశ అంకుశ చాపాది ఆయుధ హస్తుని, శ్రీ నీలకంఠుడగు మహాదేవునికి సదా ప్రణామ మొసంగెదను. అట్టి పరమ కృపానిధియైన శివుని తత్త్వము ను గ్రహించి, అనుభవించి, అజ్ఞ జనోద్ధరణ కార్యదీక్షాదక్షులై అనేక కష్ట నిష్ఠురముల కోర్చి, జగతి నా పరమ తత్త్వమును ప్రసాదించిన ఆచార్యవర్యులగూర్చి గ్రహించెదముగాక! 'రేవణో మరుల శ్చైకోరామ స్సిద్ధాత్రయ స్మృతాః। శ్వేతాచార్యో లాకు లేశో నీలకంఠో జగద్గురుః॥ ఉద్భటః కోటిపల్లిశ్చ పేమారాధ్యః ప్రకీర్తితః॥ శ్రీపతి ర్మంచనశ్చైవ మల్లికార్జున పండితః॥ రేవణ మరుల ఏకోరామ శ్వేతాచార్య లకులేశ నీలకంఠ ఉద్భట విశ్వా

రాధ్య వేమన శ్రీపతి మంచన మల్లికార్జునులు అసంఖ్యాక శైవా చార్యులలో ద్వాదశాచార్యులై ఆ యా కాలములందు భక్తుల నుద్ధ రించు సంకల్పమున శివాంశమున జనించి శివమత ప్రచారము గావించిరి. మరియొక పరిగణమున బై శ్వేతాచార్య లకులేశుల స్థానముల హరదత్త భాస్కర భట్టులు అలంకరించిరి. ఇందు నీ ద్వాదశాచార్యలు మువ్వురు మువ్వురుగ వర్గీకరింపబడి, సిద్ధత్రయము : రేవణ, మరుల, ఏకోరామ సిద్ధులును, ఆరాధ్యత్రయము : ఉద్భట, వేమన, విశ్వారాధ్యులును, పండితత్రయము : శ్రీపతి, మల్లికార్జున, మంచన పండితులును, ఆచార్యత్రయము : శ్రీకంఠ హరదత్త భాస్కరభట్టాచార్యులు అనబడిరి. ద్వాదశాచార్యవర్యుల కొన్ని గ్రంథములు కాలగర్భమున నదృశ్యము లయినవి. కాని శ్రీనీలకంఠా చార్యులను పరనామముగల శ్రీకంఠ కృత ప్రస్థానత్రయ భాష్యములు మాత్రము గలవు.

గురుపరంపరా స్తోత్రమున 'సదాశివ సమారంభాం నీల కంఠాఖ్య మధ్యమాం। అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరం పరాం॥' అనియు 'నీలకంఠారాధ్య' అని గాని, శివాది నిజగురు పర్యంతము స్మరింపబడుచున్నారు. కాని కొంతవరకు పరిమితము. కాని 'సదాశివం శివం స్కందం కేశవం పద్మ సంభవం। నందీశ్వరం కుంభయోనిం భరద్వాజాత్రి గౌతమాన్॥ దధీచి ముప మన్యుం చ మార్కండేయం పరాశరం। శ్వేతం చ లకులేశం చ నీలకంఠ శివాహ్వయం॥ రేవణకం మరుళం చైకోరామ ముద్భట

దేశికం। శ్రీపతిం మంచనం చైవ మల్లికార్జున పండితం॥ విశ్వారాధ్యం వేమనం చ ప్రణమామ్యభి మతాప్తయే।' అను కల్యాణదేశ సంప్రదాయ గురుపరంపరాస్తుతి సమగ్రముగ నున్నది. దక్షిణదేశ శైవసంప్రదాయము, కల్యాణదేశీయము, స్కంద గురుపరంపర, నందికేశ గురుపరంపర మొదలగు ననేక సంప్రదాయము లిందు గోచరము.

శ్రీరామానుజ, మధ్వ, నింబార్క, వల్లభ, చైతన్యులను వైష్ణవ పంచాచార్యులవలె శైవమునకుగూడ శ్రీ నీలకంఠ, శంకర, పండితారాధ్య, త్ర్యంబకారాధ్య, అప్పయదీక్షితులు శైవపంచాచార్యులై శైవమును ప్రచారముమ జేసిరి అనియు గొందరు శైవుల విశ్వాసము. ప్రసిద్ధ అద్వైత సిద్ధాంత ఉపదేశకాచార్యుడు శ్రీశంకరుని గూడ వీరు తమ శైవాచార్యులలో లీనమొనర్చుకొనుట యిందు గమనార్హము.

కాని యీ పరంపరలలో ప్రఖ్యాతులైన దక్షిణదేశ నాయనారులుగాని, కాశ్మీర సంప్రదాయమునకు జెందిన వసుగుప్త అభినవగుప్తాదులు గాని లేకుండుట చిత్రము. అందుచే నందు సదాశివుని నుండి బ్రహ్మ విష్ణువులను, అనేక మహర్షులను కాలాంతర ఆచార్యులవరకు జేర్చియున్నను అసంపూర్ణముగ ఆ గురుపరంపర యుండుట స్పష్టము. నాయనారులనుండియే దాక్షిణాత్య శైవమైన విశిష్ట శివాద్వైతము జనించి, విజృంభించిన దనవగను. అటులే కాశ్మీర ఆచార్యులనుండి శైవాద్వైతము ప్రచారము కాబడినదని

స్పష్టము. అటులే మహారాష్ట్రమున ప్రచారమునగల పాశుపతము నకు లకులేశుడు ముఖ్య ప్రవర్తక. అతని తర్వాత గురుపరంపర గానబడదు. అంత ఆంధ్ర కర్ణాటకముల లింగాయత సిద్ధాంతమును ప్రతిపాదించి, వీరశైవము నుద్ధరించిన బసవేశ్వరుడుగూడ నిందు ప్రస్తావింపబడలేదు. అందుచే మరల నీ గురుపరంపర సంకుచిత మనుట సిస్పష్టము. ప్రప్రథమమున, శివ విశిష్టాద్వైతమును ప్రచారము గావించుచు, దమ అపార భక్తి పారవశ్యమున నమూల్య గ్రంథరచనముల గావించి, దక్షిణాపథమను సంపూర్తిగ శైవపరము నొనరించి, మించి, శివ తదాత్మ్యమునొందియున్న నాయనారుల గురించి క్లుప్తముగ జూచెదముగాక.

## నాయనారులు

The songs of Jnaneswar in the Maratha country, the hymns of the Alwars and the Saivite saints in the South, the songs of Kabir, Mirabai, and more than all, the work of Tulsidas, have created the popular religion of India. Even today it is in those that modern India finds its mental nourishment 116 మహారాష్ట్ర దేశమున జ్ఞానేశ్వరుని అభంగములు, దక్షిణమున అళ్వారుల, శైవ నాయనారుల పాశురములు, కబీరు మీరాబాయిల యొక్కయు, అన్నింటి కంటె నధికతరముగ తులసీదాసుని రామాయణము, హిందూ

116. Dr. K. M. Panikkar: Religious Movements, Triveni, P 12.

దేశమున సార్వజనీన మతమును నిర్మించినవి. నేటికిగూడ వాని నుండియే ఆధునిక భరతఖండము, మానసిక ఆహారమును పొందు చున్నది అని ఆచార్య పనిక్కారుని సముచిత వాక్యములు. భారతీయ సంస్కృతీ గగన మండలమున బూర్వోక్త రచనములు మహా జ్యోతులు, అజ్ఞానాంధ విచ్ఛేదక ప్రకాశశక్తులు. ఈ దక్షిణ శైవమత రచనములన్నియు belong to the period from the fifth to the nineth centuries [117] అయిదునుండి తొమ్మిదవ శతాబ్దమువరకుగల కాలమునకు జెందినవని రాష్ట్రపతి రాధాకృష్ణుని నిర్ణయము.

సాంప్రదాయికముగ అరువది ముగ్గురు నాయనారుల జీవిత ప్రభావములు గోచరము. వారి ప్రభావము జనసామాన్యముపై అసమానము, అద్భుతము. ఆళ్వారుల జీవిత విశేషముల వర్ణించు గ్రంథము పవిత్రమై 'దివ్య ప్రబంధము'గ కీర్తిగాంచి, పారాయణ యోగ్యమైనట్లు ఈ నాయనారుల జీవిత చరిత్రల నుపదేశించు గ్రంథముగూడ నతి పవిత్రస్థానము నలంకరించి, ప్రఖ్యాతమై, 'పెరియ పురాణ' మనుపేర సుప్రసిద్ధి నార్జించియున్నది. ఈ నాయనారులు వివిధ వర్ణములకు జెందినవారై, జాతి వర్ణ వ్యవస్థల కతీతముగ నుండుట గమనార్హము. వారిలో ఆదిశైవులు, బ్రాహ్మణులు, రాజులు, వర్తకులు, కృషీవలులు, అటవికులు, పల్లెవారు,

117. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p 723.

పంచముకులు, స్త్రీలు, సర్వజాతులుండుట ముఖ్యము. సర్వసమత్వము యిట ప్రస్ఫుటక్రియ దోచును.

ఆదిశైవులు నల్వురు: సుందరమూర్తి నాయనారు, పుకళ్ఱైై నాయనారు (ఖ్యాతిసహాయ నాయనారు), శడైయ నాయనారు, ఇశై జ్ఞానియమ్మలు.

బ్రాహ్మణులు పండ్రెండుగురు : కుంగిలియకలయ (గుగ్గులు కలశనాయనారు), మురుగ, రుద్రపశుపతి, చండేశ్వర, అప్పూది యడిగళ్, తిరుజ్ఞానసంబంధమూర్తి (శ్రీజ్ఞానసంబంధమూర్తి), సోమా నిమార, ఉరప్పులి, గణనాథ, పూజలార్ నాయనారులు.

మహాముద్ర బ్రాహ్మణుడు : చిరుతొండనాయనారు [బాలభక్త నాయనారు].

క్షత్రియులు పదునొక్కండుగురు : చేరమాన్ పెరుమాళ్, పుకళ్చోళ (కీర్తిచోళ), నెడుమార, ఇడంగళి, మంగయర్కరశిఅమ్మ (మహిళానాయకి), కోచ్చంగచోళ (వీరార్వురురాజ్యపాలకులు), పెరుమ్ పొరుళ్ (సద్వస్తు నాయనార్), కూత్తువ, నరసింగమునైయర్రైయ, అయ్యడికళ్ కాడవర్కోన్, కళర్సింగ నాయనారులు.

వైశ్యులు అయిదుగురు : ఇయర్పగై, అమర్నీతి, మూర్తి, కారక్కాలమ్మ, కలికంబనాయనారులు

వెలమలు పదముగ్గురు : ఇళయాన్కుడిమార, విరనిర్మండ, మానక్కంజార, అరివాట్టాయ, తిరునావుక్కరసు [శ్రీవాగీశ

నాయనారు], ఏయర్‌కోన్‌కలికాృమ, మూర్త, శాక్య (శ్లాఘ్య నాయనారు), శక్తి, వాయిలార్ (మౌననాయనార్), మునైయడువార్, చేరుత్తుణై, కోల్పులి నాయనారులు.

గొల్లవా రిద్వరు: తిరుమూల, ఆనాయనాయనారులు; పుళింధు లోకరు: తిరునీలకంఠనాయనారు; మాతంగులోకరు; తిరునీ కంఠ యప్పాణనాయనారు; భరతు లోకరు: అతిభక్త నాయనారు; శబరు లోకరు: కణ్ణప్పనాయనారు; శౌండు లోకరు: ఏనాదినాయనారు; తంతువాయకు లోకరు; నేశనాయనారు (మిత్రనాయనారు); తైలకారు లోకరు; కలియ నాయనారు; రజకు లోకరు; తిరుకుృరిప్పుతొండ నాయనారు (చిన్నభక్త నాయనారు); పంచము లోకరు: తిరునాళై ప్పోవార్‌నాయనారు (అపరవార గమ్యనాయనారు); సంశయ వర్ణ స్థులారుగురు: ఎరిభక్తనాయనారు, కులచ్చిరై, పెరుమిళ పైకురుంబ, దండియడిగళ్, కణంపుల్ల, కారినాయనారులు.

ఈ అరువదిమువ్వురు నాయనారులలో న్యూనాధిక్యతలు అంత రంగికముగ లేకున్నను, వారివారి సంస్కారముల ననుసరించియు, వారి జీవిత విశేషములనుబట్టియు, వారి ఉద్దీపనములైన రచనముల వలనను, బాహ్యమునకు గొంత తారతమ్యములు అవశ్యగోచరము. దాని ననుసరించి, వారిలో గొందరికి ప్రముఖ స్థానమును సంఘము ఒసంగి గౌరవించినది. అందుచే నితరుల ననాదర దృష్టి సంఘము జూచుట కాదు అని తెలియవలయును. నాయనారు లెల్లరు అసా ధారణ శివసేవా తత్పరతయు, త్యాగశీలతయు జూపిరి. They even

prepared to stake everything they had, including their lives; to please Siva and obtain His Grace 118 శివుని మెప్పించి, అతని యనుగ్రహప్రాప్తి నొందుటకు వారు, తమ ప్రాణములనైన నర్పింప సంసిద్ధులై యుండిరి. అందనేక నాయనారులు తమ భక్తి జనితములైన మహత్తులనుగూడ ప్రకటించి, భక్తిని జనులలో నెలకొల్పిరి.

ఈ విభజనము ననుసరించి, నల్వురు నాయనారులు అతి ముఖ్యము అని సంప్రదాయము. అప్పార్, సుందరార్, తిరుజ్ఞాన సంబంధార్, మనిక్కవాచగార్ అను నల్వురును సుప్రసిద్ధులు. వారి జీవితములు నాలుగు భక్తితత్త్వములపై నాధారపడియుండెను. అప్పార్ అనబడు తిరునవక్కరసు నాయనారు దాస్యమార్గము ననుసరింప, సుందరార్ సఖ్యమార్గమున బోవును. తిరుజ్ఞాన సంబంధుని అవలంబనము సత్పుత్రమార్గము అనగా వాత్సల్య మార్గమున గమనింప, మాణిక్కవాచగార్ మార్గము జ్ఞానమార్గము అనగా జీవేశ్వరైక్య విధానము నవలంబించెను అని వైద్యనాథ మహాశయుని నిర్ణయము. మరియు నాయనారుల రచనములు సుప్రసిద్ధములై, ద్వాదశకముగ గీర్తిగాంచినవి. తిరుజ్ఞానసంబంధునివి మొదటి మూడు గ్రంథములును, తిరునవుక్కరసార్ (వాగీశ అప్పార్) గ్రంథములు నాల్గవ అయిదవ గ్రంథముల స్థానము నలంకరించెను. అంత సుందరార్ రచనము ఏడవది అగుచుండ, నీ ఏడు ముఖ్య గ్రంథములు

118. Sri K. Vaidyanadhan: The Indian Express, 26-4-1964

'తేవారం' శివస్తోత్రములుగ ప్రఖ్యాతములైనవి. మాణిక్యవాచగార్ (తిరువాచకము, తిరుకోవయార్) ఎనిమిదవదిగాక, సెందనార్ యింక నెనిమిదిమంది కర్తల గ్రంథములు (తిరుఈశయప్ప, పల్లాండు) తొమ్మిదవ స్థానము నొందెను. తిరుమూలార్ [తిరుమందిరం] దశమము కాగ, నక్కీరార్, కరైకల్అమ్మార్, పట్టినాథార్, మొదః గు వారి రచనములు పదునొకండవదిగ వ్యవహారము. సెక్కియార్ [పెరియ పురాణము] పండ్రెండవదిగ బరిగణితము.

అందుచే వీందు ప్రముఖుల దివ్యచారిత్రములను, వితరుల గూర్చియు నిసుమంత గ్రహింప యత్నించెదము గాక ;

## తిరుజ్ఞానసంబంధ నాయనారు

చోళదేశమున శియ్యాలి అను గ్రామమున శివపాద హృద యుడు నా బ్రాహ్మణుడు కలడు. భగవతి అతని ధర్మపత్ని. పుత్ర సంతానమునకై ఆ బ్రాహ్మణ దంపతులు నందు గల ద్రోణేశ్వరుని ప్రార్థింప, క్రీ. శ. 629 వ సంవత్సరమున వారికి పుత్రోత్పత్తి గలిగెను. ఆ శిశువు చిరుప్రాయంబున నుండి శివభక్తియుక్తుడై, శివ సాక్షాత్కార కాంక్ష విలపించువాడు. ఆ బిడ్డనికి దిరుజ్ఞాన సంబంధార్ అని నామకరణ మొసంగి, ఆ దంపతు లల్లారుముద్దుగ బెంచుకొనుచుండిరి.

ఒక దినమున శివపాదుడు స్నానమాడుటకై తటాకమున కరుగుచు, శిశువునుగూడ వెంటగొని చని, ఆ శిశువును దటాకపు

బొడ్డున గూర్చుండ జేసి, తా స్నానార్థము వెడలెను. అంత నా బిడ్డడు విలపింపజూచి, కరుణామయులైన పార్వతీ పరమేశ్వరు లటగల ఆలయమునుంచి అరుదెంచి, బాలునకు గిరిజ స్తన్యము నొసంగి అనుగ్రహించి వెడలిపోయిరి. ఈ విషయమును నాకర్ణించి నవా రెల్లరు విస్మయానంద సంభరితులైరి. అప్పుడే ఆ బాల చంద్రుడు శివపార్వతుల స్తుతించుచు గొన్ని వృత్తముల జెప్పెనట.

బాలత్వమున నున్న జ్ఞానసంబంధుడు, తీర్థయాత్రార్థియై కొన్ని శివక్షేత్రముల దర్శించి, ఆయా మూర్తులపై ననేక వృత్తముల రచించెను. ఈతని వృత్తములు లయయుక్తములై యొప్పారుటచే నీలకంఠయాళ్పాణుడను గాయకుడు వీణావాద్యమునకు వాని అను సంధించి, ప్రజానీకమున కానందరంజికముగ నందించెను. చిదంబ రాది క్షేత్రముల దర్శించి, అచ్చటగల శివమూర్తుల సేవించి, స్తుతించి, మరల జ్ఞానసంబందుడు స్వస్థానమును జేరెను.

యుక్తకాలమున శివపాదుడు కుమారునికి నుపనయనాదికము గావించి, సద్గురు సాన్నిధ్యమున విద్యాభ్యాసమునకై పంప, నచిర కాలమున వేదవేదాంగవిద్యల నన్నింటిని సాధించి సంపూర్ణ విద్యా స్వరూపుడుగ జ్ఞానసంబంధుడయ్యెను. ఈతని కీర్తి నాలకించిన వాగీశనాయనారు యీతని దర్శించి, స్తుతించెను.

మరల దీర్ఘయాత్రా సంకల్పము గలిగి, సబాంధవముగ జ్ఞాన సంబంధుడు బయలుదేరెను. ఒకచో నొక రాజకన్యకకు అవహించిన

పిశాచమును శివ ప్రార్థనములచే బో ద్రోలెను. చోళదేశమున ప్రవేశించి, తిరుచినాపల్లి జంబుకేశ్వరముల దర్శించి, ఒకచో దండ్రి శివపాదునిచే యాగమును జేయించెను. మార్గమున నీలకంఠయాప్పాణుని తల్లి స్వగ్రామము ధర్మపురమునకును, నంత జిరుతొండనాయనారుని వాసమైన తిరుచ్చెంగాట్టంగులిని వెడలి, అందు నా నాయనారుని యింట విందారగించి, అతని కీర్తనముల స్తుతించెను. తిరుమంగళ గ్రామమున సర్పగ్రస్థుడైన వైశ్యుని బ్రతికించి, తిరుప్పుగలూరున మురుగనాయనారునుగూడ జ్ఞానసంబంధుడు దర్శించెను. తిరువాలూరున వాగీశనాయనారుతో గలిసి, యుండ, నటకు నీలక్కనాయనారు, చిరుతొండర నాయనారుగూడ వచ్చి చేరిరి. అయిదుగురు నాయనారులు మహానందమున గొంతకాల మచట నుండిరి.

అంత వాగీశ నాయనారుతో గలిసి జ్ఞానసంబంధుడు తిరువరట్టానమునకు గుగ్గులు కలశనాయనారు కోర వెళ్ళిరి. వీరిరువురు తిరువీళిమిళల గ్రామమున నుండ, దేశమున ఘోర క్షామము గలిగెను. వీరిరువురు ప్రత్యేక మఠముల నెలకొల్పి, అందు శివ ప్రసాదముగ లభించిన ధనముతో నిరతాన్నదానము గావింపదొడగిరి. క్షామ నివారణానంతర మిరువురు వేదారణ్యమునకు జని, అచట చిరకాలమునుండి మూతబడియున్న ముఖ్య ద్వారమును దెరిపించిరి.

ఇట్లు చోళరాజ్యమున వీరిరువురు దుండ, బ్రక్కగల పాండ్య దేశరాజు జైనమతమును స్వీకరించుటయు, బ్రజానీకమును గూడ నా

మతాంతరు లగుటయు విని, రాజపత్నియు, సుతయు, శైవము నవలంబించువారై జ్ఞానసంబంధుని ఆహ్వానింప, యువకుడైయుండియు ధైర్యమున నతడు జైనుల నెదుర్కొని వాదింప నందరిగెను. వాగీశుడుమాత్రము తగు హెచ్చరికలు జ్ఞానసంబందునికి జేసి తా చోళరాజ్యమున వేదారణ్యమున నుండిపోయెను. రాణియగు మహిళా నాయకి ఘన సన్మానమున జ్ఞానసంబంధుని ఆహ్వానించెను. ఆచట గౌరవ మర్యాదలతో మధుర సుందరేశ్వరస్వామిని దర్శించి, జ్ఞాన సంబంధుడు తనకు ప్రత్యేకింపబడిన మఠమున విడిదిజేసెను. శియ్యాళినుండి యీ బాలబ్రహ్మణు రాక అటగల జైనులకు భయ భ్రాంతుల కలుగ జేయ, వారు సంబంధుడుండు మఠమునకు అగ్ని ముట్టించిరి. కాని వారి సంకల్పము విఫలమయ్యెను. ఆ ప్రభువునకు గల వ్యాధినిగూడ సంబంధుడు నివారణము గావించుటచే నా రాజు నకు అతనిపై భక్తి కుదిరెను. అంత నటగల జైనులతోసహా రాజు శైవమత స్వీకారము గావించెను.

అట తిరునెల్వేలి రామేశ్వరము మొదలగు క్షేత్రముల దర్శించి, పాండ్యరాజును అతని భార్యను మధురకు సాగనంపి, జ్ఞానసంబంధుడు స్వస్థానము జేర బయలుదేరెను. మధ్య, నదుల బర్వతముల దాటుచు, బౌద్ధుల నివాసమగు బోధిమంగళ గ్రామ మున కత దరుదెంచెను. అట నా బౌద్ధుల నోడించి, శైవమతావ లంబకులనుగ నీ బాలప్రజ్ఞుడు గావించెను.

తిరుప్పూదురు_త్తి గ్రామమునగల వాగీశనాయనారును మరల గలిసికొని పాండ్యదేశమున జరిగిన వృత్తాంతముల జెప్పికొని ఆనందించిరి. వాగీశుడు పాండ్య మండలమునకై వెడల జ్ఞాన సంబంధుడు శియ్యాలిని జేరుకొనెను.

కొంతకాలము తలిదండ్రులతోనుండి, మరల దొండమండల మును దర్శింప. తిరుప్పాదిపులియూరు మొదలగు క్షేత్రముల దాటి, తిరువణ్ణామలను దర్శించి, తిరువొత్తూరు జేరెను. అట జైనుల బౌద్ధుల శైవమున జేర్పించి, కంచీపురముమీదుగ కారక్కాలమ్మ గ్రామమైన తిరుప్పాచూరును దర్శించి కాళహస్తికి జేరెను. అట నుండి తిరువట్టూరు జేరి అట నుండెను. మైలాపూరులో శివమిత్రుని కుమార్తె పుష్పవతి సర్పగ్రస్థ యగుట గాంచి ఆమెను బ్రతికించెను. ఆమె మరణింప నామె శరీరమును దహన మొనర్చి, ఆ యస్థికల జూప, నందుండి తన శక్తిచే నామె నుజ్జీవింపజేసినట్లు చారిత్రము. ఆమెను జ్ఞానసంబంధుని కొసగి వివాహముసేయ శివమిత్రుడు సంకల్పింప నామెను పుత్రికా దృష్టిగాంచు సంబంధుడు సమ్మతింప జాలదయ్యెను. మరల పక్షితీర్థము, చిదంబరము మొదలగు క్షేత్ర ముల దర్శించి సంబంధుడు శియ్యాళి చేరుకొనెను.

నాటికి జ్ఞానసంబంధునకు పదునాలుగు సంవత్సరములు మాత్రము వయస్సు. శివపాదుడు పుత్రుని అపార విద్యా వైదుష్య మునకు, దేశవ్యాప్త కీర్తికిని వేవిధములు సంతోషించి, తన కర్తవ్యమైన వివాహమునుగూడ జేయ సంకల్పించెను. తిరునల్లూరు

గ్రామవాసియగు నంబాండారునంబి కుమార్తె నొసంగి అతి వైభవముగ బరిణయము వారిరువురికి గావించిరి.

వివాహానంతర మా జ్ఞానసంబంధుడు శివుని ప్రార్థింప, శంకరుడు మహాజ్యోతివలె నా విర్భవించి, అందు నెల్లర ప్రవేశింప నాజ్ఞ యిడెననియు, నంత నూత్నవధూవరులు, బంధువులు ఇతరు లందరు ఆ మహాజ్యోతి ప్రవేశించి అదృశ్యమైనట్లు గాథ. వివాహానంతర మీ మహాత్ముని చరిత్ర అకస్మాత్తుగ నిట్లదృశ్యమగుట కేమిహేతువో!

## వాగీశ నాయనారు

తిరుజ్ఞానసంబంధ నాయనారుచే 'అప్పార్' అని పిలవబడిన వాగీశనాయనారు జ్ఞానసంబంధునికి నిసుమంత జ్యేష్ఠుడై సుమారు క్రీ. శ. 600 సంవత్సరమున నొక గొప్ప ధనిక వెల్లాల కుటుంబమున దక్షిణ అర్కాటుజిల్లా తిరువామూరిలో జనించెను. పుశగనారు తండ్రియు మాదిని తల్లి, తిలకవతి యను పుత్రికను వారు ప్రథమతః - బొంది, అంత నీ బాలుని గాంచిరి. 'మరుణీక్కియరు' అను నామ మాతని కుంచిరి. ఈతడు బాల్యమునందే తన అతిమానుష బుద్ధిబలమున గురుసన్నిధానమున సకల విద్యల నార్జించి, జననీ జనకుల కెంతయో ఆనందమును గూర్చుచుండెను.

కాలవంశమున నతని సోదరి 'తిలకవతి' యుక్తవయస్కురాలగుటచే, నామెకు వివాహ ప్రయత్నముల దలిదండ్రులు గావించుచుండ, 'గలప్పగయారు' అను సైన్యాధిపతి ఆమెను దన కొసంగ

గోరెను. కాని వివాహప్రయత్నముల నన్నింటి నేర్పాటుగావించిన తర్వాత అత్యవసరముచే నా సైన్యాధిపతి యుద్ధరంగమున కరిగెను. ఈ మధ్యకాలమున వృద్ధుడైన 'పుళగనారు' కాలధర్మము నొంద, నాతని భార్య మాదినియు నా సుత సుతుల నేశోకుల జేసి సహగమనము జేసెను. అటులే కాలవశమున నా సైన్యాధిపతియు రణమున గూలెను. అంత నా 'తిలకవతి' సహగమనార్థము సంసిద్ధము కాగ, సోదరుడు చింతించి, సోదరిని బ్రతిమలాడి నివారింపజేసెను. అంత ఆ సహోదరులు అట నుండుచు, వైరాగ్యమున ధనమును వెచ్చించుచు, సత్ర తటాక, వనముల నిర్మించుచు నుండిరి.

అయినను దనకు జ్ఞానము సంప్రాప్తించి, శాంతి ప్రాప్తిల కుండుటచే జ్ఞాన సముపార్జనముకొరకు నతడు ఆసేతు హిమనగ పర్యంత తీర్థయాత్ర గావింప నిశ్చయించి, బయల్వెడలి, పాటలీపుత్ర నగరమునకు నేగెను. అచటగల జైనమతాచార్యుల జూచి, ఆ మత ముత్కృష్టమని నిశ్చయించి, జైనమతావలంబకుడై, ఆ శాస్త్రముల జదివి, ప్రజ్ఞాశీలుడై ధర్మసేను డను నామమున ఆచార్యస్థానమును గూడ నతడలంకరించెను.

తిలకవతియు దమ్మునికై స్వగ్రామమున నిరీక్షించి, విసివి, తిరువీధి యను వీరట్టాన క్షేత్రమునకు, జని అందుండు శివమూర్తికి సేవల జేయుచునుండెను. క్రమముగ దమ్ముని మతాంతరస్వీకార వార్తయు దెలిసి, ఆమె మిగుల గుంది, శివుని ప్రార్థించుచుండెను. పాటలీపుత్రమున గల ధర్మసేనునకు అకస్మాత్తుగ శూలవ్యాధి

సంప్రాప్తింప, నటగల జైనాచార్యు లెంతయో కృషి సల్పినను ఆ వ్యాధి అతనికి నివారణము కాజాలదయ్యెను. అపు డతనికి దన యక్క మనసా దోచి, ఆమె జేర బుద్ధి కలిగి, జైనమతమును దూరమందుంచి 'తిలకవతిని' ఆతడు జేరెను. ఆమెయు దమ్ముని కొరకు శివుని ప్రార్థింప, నచిరకాలమున నా వ్యాధి నివారింప, నాతనికి అనర్గళ కవితా శక్తియు ఉదయించెను. వెంటనే అనేక వృత్తములలో నా శివమూర్తిని వర్ణించి, ఆతడు స్తుతింప, సంత సించిన సాంబశివు డాతనికి 'వాగీశుడని' నామకరణము జేసెను.

పాటలీపుత్రమున గల జైనాచార్యులీ విషయముల విని, ఈతని హింసింప బగ బూని, జైనరాజగు పల్లవ పాలకుని జెంతకేగి, వాగీశునిపై అనేక నిందలతో నభియోగము జేసిరి. జైనవాదులకు లొంగియున్న అ రాజు వెంటనే వాగీశుని బంధించి, కారాగారమున నుంచెను. అయినను అతడు చలింపక శివధ్యానమున సంతోషముగ నుండ నాతని నెట్టులైన సాధింపబూని రాజు అనేక విధముల నాతని జంపజూచెను. కాని అ ప్రయత్నములన్నియు నిష్ఫలము లయ్యెను. చిట్టచివరకు నతని సముద్రమున బడద్రోయ, శివ మాహాత్మ్యమున నిరపాయముగ నా భక్తాగ్రగణ్యుడు తిరుప్పాది రిప్పులియూరు క్షేత్రమున ఒడ్డునకు జేరెను.

మార్గమునగల ననేక శివ క్షేత్రముల దర్శించుచు నాతడు మరల తిరువీధిగల సోదరిని జేరెను. ఈ విషయమును సాకల్యముగ

నాలకించిన ఆ పల్లవరాజు పశ్చాత్తప్తుడై, వాగీశు నాశ్రయించి, శైవ మతమును స్వీకరించి, జైనుల బరిమార్చెను.

పిమ్మట, వాగీశుడు అనేక శివక్షేత్రముల దర్శించుచు ఓదంబరాదుల జూచి, కీర్తించి, తిరునల్లూరున శివకృపా పాత్రుడయ్యెను. తాగళూరు గ్రామమున నొక సర్ప ద్రష్టుని బ్రతికించి, జ్ఞాన సంబంధనాయనారును గలిసికొనెను. వారిరువురు అనేక స్థలముల గలసి దిరిగి, అనేక అద్భుత కార్యముల గావించిరి. వడదళి అను స్థలమున నా యూరిపాలకుల సహాయముతో నొక శివాలయమును నిర్మించి, జైనాచార్యులు గోప్యముగ దాచి ఉంచిన లింగమును అట బ్రతిష్ఠింపజేసిరి. మరల నతడు, యాత్రల గావించుచు, జంబుకేశ్వరాదులను అరుణాచల, కాంచీపుర, పక్షితీర్థము, కాళహస్తి మొదలగు అనేక క్షేత్రముల దర్శించి గానము జేసెను. ఉత్తరకాశీక్షేత్రదర్శనార్థము సంకల్పించి, కాశీక్షేత్రమునుగాంచి, అంత ప్రయాసతో నుత్తరకాశికై ప్రయాణమును వాగీశుడు సాగింప నెంచెను. కాని అసాధ్యముగ నుండుట అలసి ఒక్కచో నుండ, శంకరుడు సాక్షాత్కరించి, పంచవద క్షేత్రమునకు బొమ్మని ఆదేశించెను. వాగీశుడు అంత నట జేరి, జ్ఞానసంబంధునితో శివమత ప్రచారము జేసెను.

ధనరాసులు ఎదుట నిలచినను, సుందర యువతులు ఆకర్షింప నెంచినను, జలింపని వైరాగ్య జ్ఞాననిష్ఠుడై, వాగీశనాయనారు జ్ఞాన తేజమున శివప్రసన్నుడై వెలుగొందెను.

# సుందరమూర్తి నాయనారు

దక్షిణదేశమున దిరునావలూరు అను దివ్యక్షేత్రమున శడయి నాయనారు అను ఆదిశైవుడు ఇశేజానమ్మ అను భార్యతో నుండెను. ఆతనికి క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దమున 'సుందరమూర్తి' జనించెను. 'నంబియారూరివారు' అనియు నితనికి నామాంతరము గలదు. ఆ బాలుని సౌందర్యమునకు ముగ్ధుడైన నా ప్రాంతపు రాజు నరసింగము నాయనారు, ఆతని తలిదండ్రుల సమ్మతింపజేసి, తన నగరమునకు గొంపోయి పెంచుచుండెను. సహజ పాండిత్య సంపన్నుడైన సుందరుడు అచిరకాలమున విద్యాబుద్ధుల నార్జించి శోభాయమానముగ నుండెను.

తండ్రి శడయనాయనారు పుత్రుని వివాహ యోగ్య ప్రాయమును దిలకించి, పుత్తూరు గ్రామవాసి యగు నొక కన్యకను స్థిరపరచెను. వివాహకాలమున కెల్లరట కరిగి, ముహూర్తమునకై సకల సన్నాహములతో వేచియుండ, నొక వృద్ధ బ్రాహ్మణు డట కరుదెంచి, సుందరుని పితామహుడు వంశపారంపర్యముగ నతని సేవించుచున్నట్లు పత్రము వ్రాసి యిచ్చుటను దెలిపి, వాదమునకు దిగెను. వివాహ ప్రయత్నములనన్నింటిని నిలిపి, వృద్ధుని వాదమును విచారింప, సుందరమూర్తి ఆతని గ్రామమైన తిరువణ్ణెనల్లూరున కరిగెను. ఆ వృద్ధుడు అటగల శివాలయమున కరిగి అంతదృశ్యమగుటచే నాతడు ఈశ్వరుడని గ్రహించి, సుందరమూర్తి ఆ శివశంకరు సేవలో జీవితమును గడుప దీర్మానించికొనెను.

ఆ ప్రాంతములగల శివక్షేత్రముల జూడ నాతడు వెడలి, సిద్ధవటము నా క్షేత్రమున దర్శనాదికమైన పిమ్మట విశ్రాంతికై శయనించెను. అచటికొక వృద్ధుదేతెంచి, సుందరుని శిరముపై బాదములనుంచి పరుండెను. సుందరుడు మేల్కాంచి, ప్రశ్నింప నా వృద్ధునకు నేత్రరోగ మున్నదని విని, మరియొకచో బవళింప, మరల నా వృద్ధు డటగూడ బ్రత్యక్షమగుచుండె. మరల సుందరు డాతని బ్రశ్నింప, నా వృద్ధు డదృశ్యమయ్యెను. ఈశ్వరుడే తనను బరీక్షింప నేతెంచెనని యెరింగి, అతని అనేక వృత్తములతో స్తుతించెను. మరల శివక్షేత్ర దర్శనార్థమై బయలుదేరి దక్షిణమున గల కమలాలయమునకు శివునాజ్ఞచే చేరెను. అందలి పౌరులాతని మిగుల గౌరవముతో నారాధించిరి.

ఇట్లుండ నాయూర నా ఆలయమున బరిచారికముగనుండి మాలల నిర్మించు 'పరవ' అను వేశ్య యువతిని అత డొకచో జూచి, ఆమెను వివాహమాడ సంకల్పించెను. అటులే ఆమెయు గోర వారిరువురకు అచ్చటనే పరిణయమాయెను. అందుచే నతడు అచటనే పరవతో గాలక్షేపము జేయుచుండెను. వారి పోషణార్థమై గండయలూరు గ్రామవాసి సర్వము నొసంగుచుండెను.

కొంతకాలమునకు అతనికి మరల దీర్ఘక్షేత్రదర్శన లాలసత్వ ముదయింప బయలుదేరి, అందందు క్షేత్రనాథుల పద్యములచే గీర్తించుచు, పక్షితీర్థమును జేరెను. అచట సాంబశివుడే అతనికి అన్నపానముల నేర్పాటు గావించెను. అంత నుత్తర భారతమునగల

క్షేత్రములగూడ దర్శించి సుందరుడు తిరువట్టూరునకు జేరెను. ఈ గ్రామమున 'సంకిలి' అను కన్య శివభక్తునే వివాహమాడ నిశ్చయించి, యిట శివ సేవాసగ్నమై యుండ, నామెను సుందరమూర్తి జూచుటయు, నట్లే ఆమె యితని గాంచుటయు జరిగెను. పరస్పర ప్రేమ పాశబద్ధులై, వారిరువురు వివాహమాడిరి. వివాహసమయమున వకుళ వృక్షచ్ఛాయలో బరస్పర మెండొరులు ఎడబాటు కాగూడదను ప్రతిజ్ఞల వారు గైకొనిరి.

కాని కొంతకాలమైన పిమ్మట గమలాలయమున గల వల్మీక నాథుని సేవించు బుద్ధి వొడమ నాతడు పయనమయ్యెను. సంకిలి కిడిన వాగ్దానము భంగమగుటచే నతడు వెంటనే అంధుడయ్యెనట. కాంచీనగరమునకు పరసాయమున నరుగుదెంచి ఏకామ్రేశ్వరుని నేత్రభిక్ష నిడ బ్రార్థింప, నా మహాదేవు డనుగ్రహించి వామనేత్రము నొసంగెనట. అంత గమలాలయమునకు జేరి, వల్మీకనాథుని బ్రార్థింప కుడికన్నుగూడ వచ్చెనట. అట నా దేవదేవుని అనేక వృత్తములతో గీర్తించి, ప్రథమ భార్యయగు పరవను జేరబోవ, నామె యాతని దిరస్కరించెను. ఎట్టకేలకు శివానుగ్రహముచే వారిరువురికి మరల బొత్తు కలిసెను.

తనతో భేదాభిప్రాయములుగల కలికామనాయనారుని వ్యాధిని నిర్మూలింపజేసి, అతని స్నేహము నార్జించె సుందరమూర్తి. మరల దక్షిణక్షేత్రములకేగి రామేశ్వరాదుల దర్శించి ఆ యా మూర్తుల స్తుతించి, కమలాలయమునకు నాయనారుచేరెను. అప్పుడాతనివెంట

జేర దేశాధీశుడు సపరివారముగ నుండెను. ఆ భూపాలకుని కోర్కెపై వతనితో బయలుదేరి, మార్గమధ్యమున బంచనద క్షేత్రమును జూచి, పిమ్మట జేర పెరుమాళ్ళని నగరమునకు సుందరమూర్తి ఏగెను. కొంతకాలమట నుండి, రాజలాంఛనములతో బూజాగౌరముల స్వీకరించి, తిరుగుప్రయాణమగుచుండ నా రాజు, నా రాజగురువును అనేక ధనకనక పస్తువులతో సన్మానించి, సైనికులనిచ్చి బంపెను. కాని మార్గమధ్యమున జోరులు ధనమునంతటిని అపహరించిరి. అయినను పరమేశ్వరానుగ్రహమున నవి లభింప 'పరవ'ను జేరి, సుందర మూర్తి నాయనారు సుఖముగ నుండెను.

ఇట్లుండ, సుందరమూర్తి ఆ భూపాలునిజూడ కొంత కాలమట నుండి మహోదయమను గ్రామమున మహేశ్వరుని ప్రార్థించెను. అటనుండి సుందరమూర్తి నాయనారు కైలాసమున శివసాన్నిధ్యమును జేరెను.

## మాణిక్యవాచకనాయనారు

సంప్రదాయము ననుసరించి మాణిక్యవాచకనాయనారు బ్రాహ్మణ శైవ కుటుంబమున వడవూరు గ్రామమున మధుర ప్రాంతముల క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దమున జనించెను. అతని, గ్రామనామమున వడమీరార్ అనియు నందురు. అతని సర్వాకర్షణ స్వరూపము, విద్యావైదుష్యము సర్వజన సమ్మోదకరముగ నుండెను. అందుచే మధురాధీశ్వరు అస్థానమున ఇరువది వత్సరములు పూర్తి కాక కార్యమే మంత్రి పదవి అతనికి ప్రాప్తించెను.

పై విధముగ సకలైశ్వర్య సుఖసంపదల నుయ్యాలలూగు చుండినను, అతనికి మనశ్శాంతి లేదయ్యెను. ఇట్లుండ నా రాజు అశ్వముల గొన్నింటి గొన నతని నుద్యోగించి, తిరుప్పెందురై పురమునకు బంపెను. అట అతని అదృష్టవశమున మార్గమధ్యమున గల పెరుందురై గ్రామమున నున్న ఆలయమున కతఁ దరుగ, నచట నొక నిమ్మచెట్టుక్రింద శిష్యుల కుపదేశించుచున్న సద్గురువు అతనికి ప్రత్యక్షమయ్యెను. సద్గురువు దర్శనముచే నతనికి హృదయము పొంగ నాతడట నిలిచిపోయి, రాజకార్య నిర్వహణమునే విస్మరించెను. మరియు నా ఆలయోద్ధరణమునకై ఆ ధనమును వెచ్చించెను.

క్రమముగ నీ విషయము నాలకించిన ప్రభువు అతని బంధితుని గావించెను. కాని అశ్వములు నాయనారు వచనముల ప్రకారము మధురను జేరగ, రాజు సంతోషించెను. కాని నిశిసమయమున నవి సృగాల రూపముల దాల్చి ఆ నగరమున సంక్షోభము జేసెనట ఇంతలో మధురా నగరమునకు ప్రక్కనగల వైఘనది పొంగి పురముపై బడియెను. అందులకు నా భూపాలకుడు భక్తుడై అతని జెరసాలనుండి విడిపించెను.

అంత నాయనారు సర్వ ప్రపంచ బాధ్యతలనుండి విముక్తుడై, విశ్వేశ్వరు పద్య కీర్తనముచే గీర్తించుచు, దేశమున బర్యటింప జొచ్చెను. అతని రచనము లాబాలగోపాలమునకు నుత్తేజకరములై భక్తిజ్ఞాన ప్రబోధకములై యొప్పారెను. మాణిక్యవాచకుడు క్రమ

ముగ జిదంబరమునకు జేరి, తన రచనముల బాడుచుండ, నా రచనములన్నియు లిఖితము లయ్యెను. ఈ గ్రంథమే 'తిరువాచకము' నా ప్రఖ్యాతి నొంది, యింటింట నుపయుక్తము నొందియున్నది. కాలాంతరమున నాతడు చిదంబరేశ్వరునియం దైక్యము నొందెను.

## తిరుమూల నాయనారు

తిరువావడుదుర యను పురమునకు దగ్గరగల చాత్తగ్రామమున మూలుడను గొల్లవా డొకడుండెను. అతడు నిత్యము గ్రామపశువుల కావేరిప్రాంత కాననములకు గొనిపోయి, మేపి, సాయంకాలమునకు నితర కాపరులతోబాటు స్వగ్రామమునకు దిరిగి జేరుచుండెను. కాల వశమున నొక దినమున నతడా అరణ్యమున మరణింప, తన తోడికాపరులు దుఃఖించుచుండిరి. ఆ సమయమున నా మార్గమున జనుచున్న ఒక శివయోగి జూచి, కరుణజనింప, నొకచో తన దేహమును దించి, ఆ బాలుని దేహమున బ్రవేశించెను. పశుకాపరుల కానందముగ మూలుడు నిద్రనుండి లేచినట్లు లేచి, కూరుచుండ, వారు పశువులతో గ్రామమునకు వెడలిరి. ఈ క్రొత్త మూలుడును మౌనముద్రతో నూరును జేరి, పశువులు నిజ గృహముల కేగినను, దనకు అంతయు గ్రొత్త యగుటచే నొక్కచో నుండిపోయెను. భార్యా బంధు మిత్రులు బ్రతిమలాడినను, వారిని గుర్తింపలేక పోయెను.

అంత వారు అతని ద్యజింప, నా మూలుడు తిరువావడుదురై క్షేత్రమునకు జేరి, ఒక అశ్వత్థ వృక్షముక్రింద నివసించుచు, అట,

దవ అసమాన ధీవిశేషమున గామికాది శైవాగమ సందోహముల మూడువేల వృత్తములలో ద్రావిడమున విరచించెను. ఈ గ్రంథము 'తిరుమంత్ర' మని ప్రఖ్యాతి నొందెను.

## కారక్కాలమ్మ

చోళరాజ్యమున గారక్కాలు అను గ్రామమున ధన దత్తుడను వైశ్యుని కుమార్తెగ బుణ్యవతి జనించెను. ఆ పుత్రికను అతడు పరమదత్తు డను వాని కొసంగి పరిణయము గావించి, పుణ్యవతి ఏకైక పుత్రిక అగుటచే నల్లునిగూడ నింటివద్ద నుంచుకొని, వ్యాపారమునకై అల్లునికి విశేషధనము నొసంగెను. పరమదత్తుడును వ్యాపారమునుజేసి, ధనము నార్జించి సుఖముగ నుండెను.

ఇట్లుండ నొకదినమున బరమదత్తుడు రెండు మామిడి పండ్లను బుణ్యవతికి బంపెను. కాని అత డింటికి జేరులోపల నొక శివ భక్తుడు ఆకటిగొని అర్థింప, బుణ్యవతి అతని కొక ఫలము నొసంగెను. అంత భర్త అరుదెంచి, ఒక పండును భుజించి, రెండవదాని విషయము నడుగ, నామె చింతించి, లోనికరిగి, శివుని బ్రార్థింప నామెకు బరమేశ్వరుడొక ఫలము నిడెనట. దానిని భుజించిన భర్త ఆశ్చర్యచకితుడై విషయము నారసి, భార్యయొక్క అసాధారణ భక్తిశక్తులకు విస్మయము జెంగి, ఆమెను భార్యగ జూచుట దోషభూయిష్ఠముగ నిర్ణయించుకొని, తదను గుణముగ వ్యవహరించుచుండెను.

కొంతకాలమునకు వ్యాపారవ్యాజమున బాండ్య దేశమున కేగి, అచట నొక వైశ్యకన్యకను వివాహమాడి, అందే అతడుండెను. ఈ విషయమున నాలకించిన పుణ్యవతి బంధువుల సహాయమున నాతని చెంతకు అరుగ, నాతడు సతీసుత సమేతముగ బుణ్యవతికి నమస్కరించి, ఆమె తన భార్యకాక దనకు దేవత యని పలికెను.

అంతట బుణ్యవతి పుణ్యక్షేత్ర దర్శన లాలసయై కైలాస మున కరుగ నిశ్చయించెను. అచట కైలాస పర్వతమును పాదము లతో ద్రొక్కరాదని నిశ్చయించి, ఆమె తన శిరోభాగముచే గైలాసగిరి నెక్కెను. శివాజ్ఞ ననుసరించి, ఆమె తిరువాలంగుడులో నివసించుచు, శివసేవల గావించుచు నుండెడిది. ఆమె శివస్తోత్ర ముల ననేకము రచించి ధన్య యయ్యెను.

## నీలకంఠ నాయనారు

చిదంబరక్షేత్రమున గుమ్మరి వర్ణమునకు జెంది, సత్యధర్మ శీలపరుఁడై, గృహస్థ ధర్మమును నడుపుకొనుచు శివ సేవారతి నొక డుండెను. శివుడు క్షీరాబ్ధి మథనకాలమున హాలాహలము మ్రింగి, నీలకంఠుడైన శివునిగూర్చి ఎక్కువగ జెప్పుచుండువాడుగాన నితనికి నీలకంఠుడని పర్యాయనామ మేర్పడెను.

కాలవశమున నొక నా డతడు ఒక వేశ్యగృహమున కరిగి, స్వగృహమున కరుదెంచుట గనిన భార్య, అతని నిందింపక, నిక తన శరీరమును దాకుట కతనికి అధికారము పోయినదని వచించెను.

అందులకు వగచి, నాటనుండి స్వీయ భార్యా శరీరమేగాక, సకల స్త్రీ శరీరములును బవిత్రములని, పూజ్యమని, అతడు విశ్వసించి, అట్లు అవలోకింప బ్రతిజ్ఞ గొనెను.

కొంతకాలమున కతని గృహమునకు శివయోగి యొకడు ఏతెంచి, తనయొద్దనున్న యొక భిక్షాపాత్రమును, జాగ్రత్తపరుప నీలకంఠున కొసంగి, యాత్రార్థమై వెడలిపోయెను. కొంతకాలమునకు తిరిగివచ్చిన యోగి తన పాత్రనర్థింప, నీలకంఠుడు పాత్రకొరకై వెదకి, యింట గానరాకుంటచే వగచి, శివయోగికి జరిత్రను మనవి జేసి క్షమింప గోరెను. కాని శివయోగి సమ్మతింపక నా దంపతు లిర్వురు జేతుల వట్టుకొని కొలనిలో స్నానమాచరించి, పాత్రను అపహరింపలేదని వచించినచో సమ్మతించెదనని వాకొనెను. కాని స్త్రీ శరీరమును దాకనను ప్రతిజ్ఞ ఎట్లు? అందుచే నొక దండమును గొని దంపతులు చెరియొక చివర బట్టుకొని స్నానమాచరించుచుండ గాంచి, అతని దీక్షాపాలనమునకు సంతసించి, శివయోగి రూపమున నున్న మహేశ్వరుడు వారికి వృద్ధత్వమును నివారించి, అదృశ్యమయ్యెను. జితేంద్రియులు కావున వారికి నిత్య యౌవనత్వమును ప్రసాదించి, తన సన్నిధానవాసమునుగూడ బరమశివు డొసంగెను.

## ఇయర్పగై నాయనారు

చోళదేశమున కావేరి సముద్ర సంగమస్థానమున గావేరీ పట్టణమున ఇయర్పగై నాయనారుండెను. అతడు వైశ్యకులజుడై

శివకైంకర్య దీక్షాపరుడై యుండెను. శివభక్తులెప్పు డేది యడిగినను దానమిచ్చుటయే అతని మహిమ. అతని కీర్తి నల్గడల ప్రసరించెను.

అతని బరీక్ష సేయుటకై శివు డొక బ్రాహ్మణ రూపమున నేతెంచి, నాయనారుతో, అతని భార్యను దన కిమ్మని గోరెను. అందుల కానందము నొంది, భార్యచే సమ్మతింపజేసి, ఆ బ్రాహ్మణు నెవరును హింసింపకుండుటకై, తానే ఆయుధహస్తుడై నిలచెను. బ్రాహ్మణుడు ఆ సతిని గొని ముందరగుచుండ ఆయుధ హస్తుడగు నాయనారు వెనుక జనుచుండెను. అలతిదూరమ ననే ఆ యూరివారు యీ సంఘటనమునకు వగచి, అ సతీమణిని రక్షింప, బ్రాహ్మణు నాటంకపరచిరి. కాని నాయనారు వారి నెదుర్కొని పారద్రోలెను.

అందుల కానందము జెందిన బ్రాహ్మణరూప శంకరుడు వారిరువురికి సాక్షాత్కరించి, వారికి శివసాయుజ్యమును బ్రసాదించెను.

## నేత్రేశ (కన్నప్ప) నాయనారు

పొత్తప్పనాడునందు ఉడుప్పూరిలో బోయల రాజైన నాదడనువా డుండెను. అతనికి భార్య దత్త. వారికి షణ్ముఖ వరప్రసాద బలమున నొక సుతు డుద్భవింప వానికి దిన్నడు అను నామకరణ మొసంగిరి. బాల్యముననే తిన్నడు విలువిద్యయం దారితేరి బాలకులలో నగ్రగణ్యుడై యొప్పారెను.

ఒకనాడు అతడు మిత్రులతో వేటకొరకు అరణ్యమున కరిగి, యొక అడవిపందిని వెంటాడి, పర్వెత్తి, అతిదూరము వెడలి,

ఎట్టకేలకు దాని జంపెను. శ్రమదీర్చుకొని, కొంచెము నీరమును ద్రావ ప్రక్కనున్న సువర్ణముఖి నదికి బోయి, అటనున్న ఆలయమును, అందు నేకాంతముగనున్న శివలింగ స్వరూపమును గాంచి ముగ్ధుడై, భక్తుడై, యిట కాననముల నొక్కడుగ నున్న యీ ఈశ్వరునకు ఆహారపానీయము లెట్లు అని చింతించి, శంకరునకు ఆకలి యున్నదేమో అను విశ్వాసమున దన యాకలిదప్పుల మరచి, ఏకాగ్రచిత్తుడై చింతించి, ప్రథమతః శివునకు ఆహారమును నివేదింప దిన్నడు ఎంచెను.

ఒక్క శివుని ఆట వదలి చనలేక, పలు పర్యాయములు వెనుదిరుగుచు, నెట్టకేలకు నా వరాహ శవమున్న చోటునుజేరి, దాని మాంసమును పచనము గావించి, ఆ మాంసమును జేత బట్టుకొని, ఒక చేత బుష్పముల ధరించి, నోట జలమును గైకొని, తిరిగి శివుని చేరెను. నోటనున్న జలముల లింగమునకు స్నాన మాచరింపజేసి, పుష్పములతో బూజించి, మాంసమును నివేదించెను. ఆతని భక్తి కపరిమితానందము నొందిన పరమ శివుడు స్థూల శరీరముతో ప్రత్యక్షమై, యాతని నివేదిత పదార్థముల స్వీకరించెను.

నాడు మధ్యాహ్నము శివార్చనిమునకై ఏతెంచిన శివార్చకుడు, ఆలయమునగల మాంసఖండములను, ఎముకలను జూచి, ఆలయమును శివుని గళంకమొనర్చినవా డెవడని సంశయించి, చింతించి, అంతయు శుద్ధిచేసి, యథాశాస్త్రముగ శివుని బూజించి, నైవేద్యమునుంచి, జరిగిన అపచారమునకై కైలాసనాథుని ప్రార్థింప, నా గిరీశుడు

తిన్నని భక్తి తీవ్రతను నిరూపింప నా శివార్చకుని మరునటిదినము ముందుగ ఆలయమున కేతెంచి, దాగి, జరుగు విషయముల దర్శింప నాన నిడెను.

యథాపూర్వకముగ దిన్నడు ఆలయమున కరిగి, పుక్కిట జలముతో లింగాభిషేకము జేసి, తన శిరముననున్న పుష్పములతో పూజించి, మాంసమును శివునకు బెట్ట నుద్యుక్తుడయ్యెను. కాని శివుడు ప్రత్యక్షము కాడుగదా! అందులకు వగచి, కారణముగానక, అతి దుఃఖమున నతడుండ, నంతలో శివనేత్రము ఒకటి నీరు గ్రక్కుచుండెను. అందుల కాశ్చర్యమున దిన్నడు నేత్రమును దుడిచినను, అది నివారింప, రక్తము గారజొచ్చెను. శివుని కెంత బాధగనున్నదో యీ కన్నువలన అని తిన్నడు మిగుల చింతాక్రాంతుడై, బాధానివారణమునకై ఎంత యత్నించినను రక్తము నిలువదయ్యెను. పరమ భక్తాగ్రగణ్యు డగుటచే నతని కుపాయము దొరికెను శివ నేత్రమునకు దన నేత్రము నమర్చుట సమంజస మని విశ్వసించి, తన ఖడ్గమున దననేత్రము నొకదానిని దీసి, మహేశ్వరున కర్పించెను. కాని వెంటనే శివ ద్వితీయ నేత్రము గూడ జల, రక్తముల వదలజొచ్చెను. అయినను భయము జెందని తిన్నడు, తన రెండవ కన్నునుగూడ శంభువున కర్పింప సంసిద్ధుడై, ఆ నేత్రమునుగూడ దీసిన తా గ్రుడ్డి యగుగాన, నీ నేత్రము నెట నుంపవలయునో గానరాదు కావున, ఉమాపతి ద్వితీయ నేత్రస్థానమున దన పాదమును గుర్తుగనుంచి, ఖడ్గముచే దన నేత్రమును

బెరుక సుద్యుక్తుడయ్యెను. అప్పుడు గౌరీపతి అతని అపార భక్తి విశేషమునకు సంతుష్టుడై సాక్షాత్కరించి, రక్షించెను. దాగియున్న అర్చకుడు అచ్చెరువంది, తన భక్తి లేమికి సిగ్గుజెందెను.

ఈ విధముగ శివునకై స్వీయ నేత్రముల నర్పించిన మహా భక్తుడగుటచే నతడు 'కన్నప్ప' అనియు, 'నేత్రేశు' డనియు ప్రఖ్యాతుడయ్యెను. అతని భక్తియు, దానికిమించిన త్యాగము అపారము, అసామాన్యములుగదా!

# మూర్తి నాయనారు

పాండ్యదేశమున మధురానగరమున సుందరేశ్వర సేవాకైంకర మున మునింగి, నిత్యము గంధలేపనము నొసంగు శివ మహాభక్తుడు మూర్తినాయనారు. జైనమతమును స్వీకరించిన కర్ణాటక రాజు మధు రనుగూడ బాలించుచు, సుందరేశ్వర కైంకర్యములకు నాటంకముల గలుగజేయుచుండెను. ముఖ్యముగ మూర్తినాయనారుకు చందన కాష్ఠములు అలభ్యమయ్యెను. అందుచే శివభక్తులు, అందును మూర్తి నాయనారు మిగుల వంత నొందెను.

ఇంతలో నా రాజు అకస్మాత్తుగ మరణింప, నతని రాజ్యాధి పత్యమునకై పుత్రులు లేకుండుటచే మంత్రులు సంప్రదాయవిధానము ననుసరించి, పట్టపుటేనుగునకు పూలమాల నొసంగి నగరములోనికి బంపిరి. అదియు పురవీధుల దిరిగి, ఆలయముదగ్గరనున్న మూర్తి నాయనారునకా హారమును వైచి, తనపై గూరుచుండ చేసికొనెను.

అందులకు హర్షించి, మంత్రులు అతనికి బట్టాభిషేకము చేయగ, నా మూర్తినాయనారు రాజలాంఛనముల ద్రోసి పైచి, విభూతియే పట్టాభిషేకద్రవ్యముగను, రుద్రాక్షలే ఆభరణములుగను, జటయే కిరీటముగను నుంచుకొని, రాజ్యపాలనమునకు గడంగెను. అతని శివభక్తి మహాత్మ్యమున జైనమతము నిర్మూలింపబడి, శైవము సుస్థిరత నొందెను. ప్రభుపై యుండియు, శివభక్తుని చిహ్నములనే యుపయోగించుచు నానందించిన అదర్శవంతుడైన మూర్తినాయనారు గొప్పదన మెంతటి దనవలయును ।

## అపరవారగమ్య నాయనారు

నందనారు అను పంచముడు చోళదేశమున అరుసూరు గ్రామమున నుండెను. అతడు మిగుల శివభక్తియుతుడై శివధ్యానపరుడై యుండెను. చర్మవాద్యములకు చర్మమును వేయుట కులవృత్తిగ నుండె నాతనికి. కాని శివుని ప్రత్యక్షముగ దర్శింప నలవికాకుండుటచే, దేవాలయ ముఖద్వారమునకు ఎదుట నిలువబడి, మహేశ్వరుని అనేకరీతుల ప్రార్థించి అతడు తృప్తి పడెడువాడు.

ఒకపర్యాయము ప్రక్కనగల తిరుప్పంగూరునకు జని, అట నున్న పరమేశ్వరు దర్శింప నతి ప్రేమభక్తి పూరితుడై ద్వారమునకు నెదుటగ నిలచియుండుటగాంచి, ప్రేమమూర్తి యగు శంకరుడు భక్తుని అనుగ్రహించి, దర్శనమునకు అడ్డముగ నున్న నందీశ్వరుని ప్రక్కకు జరుగ నాజ్ఞాపించెనట. అంత నా నందీశ్వరుడు ప్రక్కకు తొలగి, నందనారునకు శివ దర్శనమగునట్లు గావించెను.

నందనారు భక్తియుక్తుడై అనేక శివక్షేత్రముల దర్శించుచు, నందందు తటాకాదుల నిర్మించుచు, శివభక్తులసేవయు జేసికొనుచుండెను. అటులే చిదంబర క్షేత్రమున నటరాజ దర్శనలాలసుడై అరుదెంచి, ప్రపత్తితో నటరాజును బ్రార్థించుచు, దన నీచ జన్మమును నిందించుకొనుచు, నెల్లరవలె లోనికరిగి, కనకసభను గాంచు అదృష్టము లేమికై మిక్కిలిగ దుఃఖించుచుండెను. అట నటరాజస్వామి అతని ననుగ్రహింపనెంచి అచ్చటగల బ్రాహ్మణ సభాపతికి స్వప్నమున దోచి, నందనారుచే అగ్నిప్రవేశము చేయించిన, సద్బ్రాహ్మణు డగునని తెలిపి, అట్లు గావించి, అతనిని ఆలయము లోనికి దీసికొని రండని అజ్ఞాపించెను. అటులే నందనారునకుగూడ శివుడాజ్ఞాపించుటతో, నా బ్రాహ్మణసంఘ సహాయమున నేర్పడిన అగ్నిగుండమున బ్రవేశించి, ప్రపూతుడై వెలుపలకు రాగ, గాంచి, సద్బ్రాహ్మణు లాతని ఆనందముతో ఆలయములోనికి గొంపోయిరి. అటగల సర్వానందమయ కనకసభను, అందు అధిష్ఠించియున్న సమ్మోహనరూపుని నటరాజస్వామిని దర్శించి, అవ్యయానందమున మునింగి నందనారు శివ సాయుజ్యమును పొందెను.

## నమినందియడిగళ్ నాయనారు

చోళమండలమున ఎమంపేరూరు గ్రామమున నమినంది యడిగళ్ నాయనారు అను బ్రాహ్మణుడు శివభక్తి అతిశయింప, నిత్య పంచాక్షరీ జపమున మునిగియుండెను. అప్పుడప్పుడతడు తిరువాలూరున కరిగి, అందుండు వల్మీకనాథుని సేవించుకొనుచుండెను.

ఒక దినమున యథాప్రకార మతఁడటకేగి దీపారాధనమున ఘృతము లేకుండుటచే, నొక గృహమున కరిగి ఘృతమునకై అర్థించెను. కాని ఆ గృహస్థుడు జైనమతావలంబకుఁడగుటచే హేళనముగ, శివ ఫాలమున నగ్నియుండునుగదా యింక దీపారాధన ఏల అని వచించెను. అందులకు జింతించి, నాయనారు ఆలయమునకు వచ్చి, మనోవ్యాకులమున నుండ, నశరీరవాణి ప్రక్క కొలనులోని ఉదకముతో దీపము వెలిగింప నాజ్ఞ నిడెను. అతఁడటులే జేయ జ్వాజ్వల్యమానముగ నా దీపిక వెలుగ జొచ్చెను.

అదే విధముగ నతఁడు నిత్యము గావించుచు ఆనందమున నుండెను. ఇల్లుండ జైనరాజుల నోడించి, దండియడిగళ్ నాయనారు రాజ్యము నధిష్ఠించి, తిరువాలూరి ఆలయాధికారిగ నుండ, నతని ప్రార్థించి నియమించెను. దాని నిర్వహించుచు నొక దినమున మహోత్సవమును జరిపి, అందు అనేకజాతులు గలసియుండుటచే దా మైలపడినట్లు భావించి, స్నానాదికముచే ప్రాయశ్చిత్తాది కర్మల బరిశుద్ధత నొంద నుద్యుక్తుఁడగుట, బరమశివుడు స్వప్నమున దోచి, నా యూరనున్నవారెల్లరు శివస్వరూపులని దెలియబరచెను. అట్లు తన అజ్ఞానమును బారద్రోలి. తిరువాలూరు కమలాలయముల శివసేవారతి నుండి అతఁడు శివసాయుజ్యము నొందెను.

## మూర్ఖ నాయనారు

తొండమండలమున దిరుపేర్కాడు గ్రామమున నొక వెలమ శివభక్తుడుండెను. అతడు శివభక్తులకు విరివిగ నిత్య సమారాధనము

గావించుచుండెను. కాని కాలగతమున నతని సంపదయంతయు నదృశ్యమగుటచే, గుంభకోణమున జూదముచే ధనము నార్జించుచు, యథాపూర్వకముగ సమారాధనముల నిర్వహించుచు. కాని తన ధనార్జనాపద్ధతి దూష్యమని వచించువారిని ఆతడు కడు మూర్ఖుడై హింసించుటయు, జంపుటయు జరిగెడిది. అందుచే నతనికి మూర్ఖ నాయనారని ప్రఖ్యాతి గలిగెను.

ఈ విధముగ పర శివభక్తితో సేవారతి జంగమసేవాకార్యమున, శివాలయ స్థాపన విధానమున, శివ కైంకర్య లాలసత్వమున, సర్వత్యాగ మహత్మ్యమున, భక్త్యుద్రేకమున, దక్షిణాపథమున దమ అపార శివభక్తి పారవశ్యమున అత్యుత్తమ అభౌతిక వృత్తిగా నోన్నతత దేశము నల్గడల ముంచెత్తి, దక్షిణ దేశము సంపూర్తిగ శైవతత్పరము నా ప్రసిద్ధి నార్జించి, నాయన్మారులు నాయనారులు అని ఖ్యాతిగాంచిన శివభక్తుల మధుర చారిత్రముల గొన్నింటి గాంచి యున్నారము. పరమశివుపై భక్తి అతిమానుష అమానుష కార్యముల గావించి, ఒక్కొక్కచో బాష దత్వమునుగూడ బ్రదర్శించి, తమకు ఎదురాడు నెల్లర, చివరకు భార్యాసుతులనైన సంహరింప వెనుకంజ వేయని వీరి శివభక్తి లాలసత్వము అనమానము. శివకైంకర్యము నకై ఎట్టి దారుణ కార్యమునైనను, ఎట్టి హేయ కార్యమునైనను జేయుటకు వెనుకాడని వీరి భక్తితత్పరతయు నసాధారణము. దక్షిణ దేశమున బ్రబలిన శైవ మతమునకు వీరసమాన ప్రాతిపదిక లనదగును. వీరి శైవసిద్ధాంత మగ్నతయే, నా యా కాలముల

విజృంభించిన జైన, బౌద్ధమతములు, దక్షిణ భారతమున క్షీణ మొనరించి, రూపుమాపివైచినవనుట అతిశయోక్తి గానేరదు.

ఈ అరువది మువ్వురు నాయనారుల చరిత్రమును సైక్కి-యారు అను నాతడు రచింప, నది 'పెరియపురాణము' నా ప్రఖ్యాతి నార్జించి, సర్వవ్యాప్తమై, నిత్యపారాయణ యోగ్యమై, సర్వ శైవుల హృదయస్థానముల నలంకరించెను. ఈ గ్రంథకర్త మద్రాసుదగ్గర కున్నత్తూరు గ్రామమున నివసించెడివాడు అని ప్రతీతి. అట్టి రచనము దక్షిణాపథమునకు ప్రసాదించి, అతడు ధన్యత గాంచెనుగదా!

## ద్వాదశాచార్యులు

'రేవణో మరుల శ్చైకోరామస్సిద్ధత్రయ స్స్మృతాః। శ్వేతాచార్యో లాకులీశో నీలకంఠో జగద్గురుః॥ ఉద్భటః కోటిపల్లిశ్చ వేమారాధ్యః ప్రకీర్తితః। శ్రీపతి ర్మంచనశ్చైవ మల్లికార్జున పండితః॥' అను శ్లోకార్థమున దోచు ద్వాదశాచార్యులు శైవ ప్రచారమున ప్రముఖులుగ బరిగణింపబడియున్నారు. ముఖ్యముగ వీరి జీవిత విశేషములగూర్చి యినుమంత జూచెదముగాక.

రేవణారాధ్యుడు: ఇతడు కుల్యాపాకపురమున సోమేశ్వరలింగ సముద్భవుడని సంప్రదాయము. శివాద్వైత సిద్ధాంత ప్రచార మాతడు గావించెను. ఆదిశంకరుని ప్రజ్ఞావిశేషములకు సంతోషించి, చంద్ర మౌళీశ్వర లింగమును బహూకరించెను. కైలాసాది యాత్రల నన్నింటిని దర్శించెను. అతని భార్య దుర్గాదేవి. ఆమెవలన త్ర్యంబకేశ్వరాది పుత్రులు ఆయనకు కలిగిరి.

మరులారాధ్యుడు: ఈతడు భారద్వాజన గోత్రమున సదాశివాంశమున జనించి, శైవసిద్ధాంత ప్రచారము జేసెను. గోకర్ణ క్షేత్రమున దపస్సొనరించెను. అతని భార్య శివ జ్ఞానాంబిక అను నామము గలది.

ఏకోరామారాధ్యుడు: ఇతడు రామనాథపుర లింగ జాతుడై అప్రాకృత దేహధారి అని ప్రతీతి. ఇతనికి ఘంటాకర్ణుడనియు నామాంతరము గలదు. హిమవత్పర్వతప్రాంతవాసి యితడు. ఎక్కువగ గేదార క్షేత్రమున నుండును. అచట తటాకాదులగూడ నిర్మించెను. అచట కర్ణాఘంట హ్రదము నా దటాక మొండు గలదట. ఆ ప్రాంతమున వాతనికి అనేక శిష్యగణములు గలరు. కాశీక్షేత్రవాసియైన హారీతపుత్రుడగు విశ్వేశ్వరునికి నితడు జనించెను. ఇతనికి బల్లినాథుడను పుత్రుడుండెను.

శ్వేతాచార్యుడు: సర్వ వేదాంత తత్త్వదర్శియు, పదవాక్య ప్రమాణజ్ఞుడును అయిన శ్వేతాచార్యుడు అనేక మంది శిష్యులు గలవాడై శివాద్వైత సిద్ధాంత ప్రచారమును విరివిగ సాగించెను.

లకులీశాచార్యుడు: ఇతనికి లకులీశుడు అనికూడ నామాంతరము గలదు వామహస్తమున దబ్బపండును, దక్షిణ హస్తమున లకులీ దండమును ధరించి యుండువాడు లకులీశుడు. అతనికి కుశిక, గర్గ, మిత్ర, కౌరుష్య, నామకులైన శిష్యులు నల్వురు గలరు.

నీలకంఠశివాచార్యుడు: పాశుపతవ్రత దీక్షాపరుడై, శివాద్వైత సిద్ధాంతానుసారముగ బ్రహ్మ సూత్రములకు భాష్యము నతడు

రచించెను. ఇతడు భారద్వాజ గోత్రీకుడు. ఈతని విషయము ముందు గ్రంథమున జూచెదముగాక.

ఉద్భటారాధ్యుడు: ఇతడు కాశీవిశ్వేశ్వరలింగ సముద్భవుడని శైవుల విశ్వాసము. అన్నపూర్ణా విశ్వేశ్వరులు జననీజనకులు. వల్లకపురాధినాథుడైన భోజరాజునకు గురువు. ఇతని భార్య లీలావతీ నామధారి సుందరి యనియు నామెకు నామాంతరము గలదు. ఈతడు చాతుర్వర్ణములకుగూడ గురువుగ నుండెను. శివాద్వైత మతప్రచార మును జేసెను. ఘూర్జర దేశమున భారద్వాజ గోత్రమున జనించెను. అనేక భూపాలురకు గురుదేవుడై విరాజిల్లెను. క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దమువాడని యందురు. జయపీడ మహారాజాస్థానమున సభాపతి పదవిని నిర్వర్తించెడివాడు.

విశ్వారాధ్యుడు: కోటిపల్లి క్షేత్రమున నివశించెడివాడు విశ్వారాధ్యుడు. అందుచే కోటిపల్యారాధ్యుడనియు నతనికి పేరు. భవానీ సోమేశ్వరులు తలిదండ్రులు. క్రీ. శ. పండ్రెండవ శతాబ్దమున నితడుండెను. కాశ్యపగోత్ర సంభూతుడు. చతుర్వేదసార, వృషభాధిప శతక, బసవరాజీయము మొదలగు గ్రంథముల నతడు రచించెను. శైవధర్మముల ప్రచారము గావించెను. అనేక శిష్యప్రశిష్యు లతనికి గలరు. పాలం కాశ్రమమున నుండువాడు. అతడుండెడు గ్రామమును పాలకుర్తి యని అందురు.

వేమనారాధ్యుడు: బేలదేవి గ్రామనివాసి వేమనారాధ్యుడు. అతని తండ్రి మల్లికార్జునుడు, త్రిపురాంత కేశ్వరుడు అతనికి

గురువు. శ్రీశైలమల్లికార్జున లింగ సంభవుడుగ శైవుల నమ్మకము. విష్ణుదేవ భూపాలుడు యితనికి బేలదేవి గ్రామమును అగ్రహారముగ సమర్పించెను. ఇతడు అనేక యజ్ఞముల నాచరించెను. అతని భార్య శర్వాణి. అతనికి జ్యోతిర్నాథ, భీమనారాధ్య, ఘంటానాథ లనబడు అనేక శిష్యులు గలరు. వీరి యింటిపేరు ములుగువారు, కౌండిన్య గోత్రము. వేమనారాధ్యుడని వ్యవహార [illegible]. సంస్కృతభాషలో వ్యోమారాధ్యుడని యందురు. మల్లికార్జున పండితారాధ్యునిచే గురుపీఠమున నధిష్ఠింపబడి శివాద్వైత ప్రచారము సాగించెను. క్రీ. శ. పండ్రెండవ శతాబ్దమునకు ఇతడు చెందును.

శ్రీపతిపండితారాధ్యుడు:- ఇతడు [illegible] యందురు. ఇతని తండ్రి మల్లికార్జునుడు. భ్రమరాంబాదేవి తల్లి. శ్రీశైల మహాక్షేత్రమున అతని వివాహము. జగద్గురు నామమున నేనేక శిష్యకోటిని గలిగి యుండెను. క్రీ. శ. పదునొకండవ శతాబ్దమునకు జెందినవాడు.

మంచన పండితారాధ్యుడు: ఇతడు సాంఖ్యాయన గోత్రజుడు. ఇతని పితామహుడు సోమశంభువు. సోమశంభువు గౌడదేశమున ననేక శైవమఠములకు ఆధిపత్యము వహించెను. మంచనారాధ్యుని గృహనామము శివలెంకయట. ఇతడు కాళహస్తి క్షేత్రమున గొంతకాలము వసించెను. శ్రీశైలమున దప మాచరించెను. క్రీ. శ. పదునొకండవ శతాబ్దమున నుండెడివాడు. బౌద్ధ జైన మతముల ఖండించెడివాడు. కాశీనగరాది క్షేత్రముల దర్శించె నాతడు.

మల్లికార్జున పండితారాధ్యుడు : ఇతడు ద్రాక్షారామ క్షేత్రమున నుండెడువాడు. గౌరాంబా, భీమనపండితుల పుత్ర రత్నము, గౌతమ గోత్రజుడు. చాతుర్వర్ణ్యములకు గురుపీఠము నలంకరించి, త్రిలోక గురువను బిరుదముచే నలంకృతుడయ్యెను. శివతత్త్వసార, లింగోద్భవ దేవగద్య, అమరాష్టకము మొదలగు గ్రంథముల రచించెను. క్రీ. శ. పండ్రెండవ శతాబ్దమునకు నతడు జెందును. గుంటూరు మండల మునగల చందవోలు గ్రామమున మల్లికార్జున పండితారాధ్యుని సంబంధమైన శాసనము గలదట.

—o—

# శైవ మత సిద్ధాంతము

## సామాన్య శైవము

అప్యేక దివసం భక్త్యా యః

పూజయతి శంకరం

సోపి యాతి శివస్థానం

కిం పునః బహుశోర్చయన్॥

పద్మపురాణము – భూమిఖండ – ౧౫ అ॰

భక్తిచే నెవడు [illegible] బూజించునో, వాడు శివస్థానమును బొందును. –

చెప్పనది ఏమి? అని పద్మపురాణ— [illegible]

అద్వితీయ ఆనందభాగ్య గరిమను వర్ణింపజాలరి . వహించెను. అట్టి పరమశివునిగూర్చి అతని గుణ గణములు అతని మహిమా విశేషములగూర్చి, వేదోపనిషత్పురాణములలో గల యనేక విషయముల సమీక్షించియున్నాము. రుద్రునకు శివున కెట్టి తారతమ్యము గానరాదనియు, రుద్రుడే కాలాంతర శివలక్షణముల నన్నింటిచే నంతరముగ శోభిల్లి, యజుర్వేదీయ శతరుద్రీయముతో శివత్వమును బొంది, యట పురాణముల సేవింపబడి, పరిపూర్ణ శివత్వమును బొందియున్నట్లు గాంచియున్నాము. ఈ రుద్ర–శివ పరిణామ చారిత్రమున నెట్టి ఆర్యానార్య విభేదముగాని, ఆర్య

ద్రావిడ ప్రసక్తిగాని లేదనియు దీర్మానించి యున్నాము. రుద్రుడు వైదిక దేవుడై, శివుడు ద్రావిడ దైవమనెడు సిద్ధాంతములు సమీచీనముగాదనియు ద్రోసిపుచ్చియున్నాము. కొందరు దాక్షిణాత్యులు నేటికిని అట్లు భావించి శివుడు వైదిక వాఙ్మయమున గానరాదనియు, నందుచే God Siva is a Tamilian contribution to Aryan literature of the Post-Vedic period 119 వేదకాలానంతర ఆర్య వాఙ్మయమునకు శివుడు తమిళులకు ప్రదానమనియు గొందరి భావము. సంపూర్ణముగ నీ భావమునకు సమ్మతింపకున్నను రుద్ర-శివ విషయమునగాక శైవసిద్ధాంత ప్రస్తావనమున రామస్వామిశాస్త్రి మహాశయుడు Saiva-Siddhanta is one of the choicest products of the South Indian ie, Dravidian genius. But this doesnot mean that the Aryans and the Dravidians belonged to different ethnic stocks or that either of both came into India from outside. Both were autocthonous in India — Aryans in the North and Dravidians in the south. They were one people and developed an interfused and interblended culture which is the Indian culture. Saiva-Siddhanta and Vedanta are but branches from a single stem 120 శైవసిద్ధాంతము దక్షిణ భారతము అనగా ద్రావిడుల పారమార్థిక ప్రజ్ఞావైదుష్యము యొక్క అపూర్వ ఫలము. అట్లనుటచే ఆర్యులు ద్రావిడులు ప్రత్యేకజాతులకు జెందిన

---

119. Sri K. C. Varadachasi : Prabuddha Bharata, 1954, p 394.

120. Sri K. S. Ramaswami sastri : Prabuddha Bharata, 1955, p 430.

వారనిగాని, వారు భారత దేశమునకు బరదేశములనుండి వలస వచ్చినవారనిగాని అర్థము గాదు. వారిరువురు భారతదేశమునకు జెంది, ఆర్యులుత్తర భారతమున, ద్రావిడులు దక్షిణ దేశమున నివసించిరి. వారొక జాతివారై సంయుక్తిక సమ్మిశ్రిత హైందవ సంస్కృతిని అభివృద్ధి నొందించిరి. శైవసిద్ధాంత వేదాంతః ఒకే వృక్ష మూలమునకు జెందియున్నవి అని సమన్వ నెంచెను. కాని యిదియు చరిత్రా విమర్శవశీలుర సమ్మతమో! అయినను శివునకుగాక శైవ సిద్ధాంతమున సంస్కృతి యాధారమగుచున్నదె. వేదశైవ ప్రమాదము కాని శైవసిద్ధాంతముగూడ [illegible] శైవమునుండి జని విషయమును ముందు [illegible] శైవమునకుగా పాశుపత మాధారమని దోచక తప్పదు.

ఏదెట్లున్నను, ప్రథమతః శైవము పరిశుద్ధమై విభేదములులేక, నెట్టి సిద్ధాంత ప్రతిపాదనముల నిడక, పరమశివుని పూజార్చనావిధానమును బోధించు చుండును. భాండార్కరు మహాశయుని అభిప్రాయమున, గృహ్య సూత్రము రుద్రుని వివిధ కాలముల వివిధరీతుల నుపాసించు విధానముల నుపదేశించి యున్నను, అటగూడ నెట్టి మత మతాంతర భావములు గానరావు 121 పతంజలి కాలమునగూడ నెట్టి శైవమతశాఖలు ఉత్పన్నము కాలే దనియే అతని తాత్పర్యము. కాని కాలాంతర పరిణామమున శైవము

121. Sir R. G. Bhandarkar : Collected Works, Vol, iv p 164

It is not a single cult, but a federation of allied cults whose practices range from the serenest form of personal life in the faith to the most repulsive excesses 122 ఒక మతముగాక, అనేక శాఖల కూటమియై వ్యక్తిగత తీవ్రసాధనల నుండి హేయకర సాధనల వరకు గలిగి యొప్పారినది. ఈ శాఖలకు ముఖ్యముగ శివగీత, శివసంహిత, శివరహస్యము, రుద్రయామల తంత్రములును, 28 ఆగమశాస్త్రములును, శ్రీ నీలకంఠాచార్యుని బ్రహ్మసూత్ర భాష్యమును, ఆ యా ఆచార్యులు నిర్మించిన కాలాంతర గ్రంథావళియు ప్రమాణములై శైవ శాస్త్రమును బహుళ మొనరించెను. వీని కాధారముగ పురాణములు, వేదోపనిషత్తులును, ఆధారభూతములై యొప్పారుచున్నవి.

అయినను శైవము శ్రౌతాశ్రౌత విభేదమున ద్వివిధముగ నున్నది. శ్రౌతము పూర్వోక్తచందము శ్రుత్యాగమస్మృతిపురాణేతిహాస సమ్మతమై సకలప్రమాణ సమ్మతముగ నున్నది. అన్యము అశ్రౌతము. దీనికి గ్రంథప్రామాణ్యము లేక, దేశాచారము ననుసరించి వివిధరూపముల యలరారి యున్నది. అందును శ్రౌతము ననుసరించి శివారాధన తత్పరులై, భస్మ, రుద్రాక్ష, లింగ, శివదీక్షను గైకొనియున్న బ్రాహ్మణులను, దక్షిణమున ముఖ్యముగ ఆంధ్ర కర్నాటక దేశముల అరాధ్యులని యందురు. వీరు చాతుర్వర్ణములకు గురుస్థానము నలంకరించి యుందురు.

---

122. Prof. K. A. Nilakantha Sastri : The Cultural Heritage of India, Vol 4, P 63.

అటులే ఉత్తర దక్షిణ విభేదములచే నీ శైవము రెండు విధములు అందు ముఖ్యముగ గుజరాత దేశ ప్రాంతముల ప్రచారమునను న్న పాశుపతము, కాశ్మీర ప్రాంతములగల త్రిక సిద్ధాంతములు ఉత్తరదేశీయములు. ద్రవిడ దేశమున ననేక నాయనారుల ప్రబోధముచే వర్ధిల్లి అనేక భక్తకోటికి ముఖ్యకారణమై వెలసిన శైవసిద్ధాంతము, ఆంధ్ర కర్నాటక దేశముల బసవేశ్వరుని అద్వితీయ తీవ్ర ప్రచారముచే విజృంభించి, విస్తరించి, వీరశైవమనియు, లింగాయతము అనియు పేరుగాంచిన వీరశైవము రెండును దాక్షిణాత్యములు. వీనిమధ్య తారతమ్యము ఆధారభేద వైదికముగలేక శ్రీనివాస అయ్యంగారు వచనములలో "The Saiva System became divided into three different schools in regard to the question how far causal efficiency belong to the will of Siva and how far to the actions of the beings 123" సృష్టికి నిమిత్తకారణము శివసంకల్పమునకు ఎంతవరకు చెందియున్నది, ఎంతవరకు జీవుల కర్మమునకు చెందును, అను ప్రశ్నముపై శైవమతము మూడు విభాగముల పొందియున్నది.

ఆగమ శైవము దక్షిణదేశమున నుండ, పాశుపతము గుజరాతు రాష్ట్రమునను, ప్రత్యభిజ్ఞ యనబడు త్రిక సిద్ధాంతము కాశ్మీరాది ఉత్తరదేశ ప్రాంతముల వ్యాపించియున్నవి. ఈ శాఖలు గాక, కాపాలిక, కాలముఖ, మల్లార, అఘోరి, నాథ, రసేశ్వర

123. Sri V. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy, P 147

మొదలగు సంప్రదాయములు శైవమతమున గలవుగాని, అందు బెక్కు అశ్రౌత విభాగమునకు చెందియున్నవి.

రాష్ట్రపతి రాధాకృష్ణ పండితుని అభిప్రాయమున ముఖ్యములైన దాక్షిణాత్య శైవ సిద్ధాంతమునకును, కాశ్మీర ప్రత్యభిజ్ఞ సిద్ధాంతమునకు అనేకములైన పోలికలు గోచరించినను, We cannot say that the former owes its general structure or essentital dcctrines to the latter 124 శైవ సిద్ధాంతము తన మూలసూత్ర నిర్మాణమునకు ప్రత్యభిజ్ఞపై నాధారపడెను అని వచింపజాలము అని వాకొనెను. అటులే యీ శాఖల తారతమ్యమును బ్రస్తావించి భాండార్కరు పండితుడుగూడ The doctrines of the Saiva School are more moderate and rational than the Pasupata School 125 పాశుపత మతము కంటె శైవసిద్ధాంతము సహేతుకమై, మధ్యమమార్గమున నున్నదని వచించును. కాపాల కాలముఖ విధానములవలె పాశుపతము అతిమార్గికముగ అతని అభిప్రాయము.

విల్సన్ ఉద్దేశ్యమున దండి దశనామ సన్న్యాసులు, జోగులు, జంగములు, పరమహంసలు, ఊర్ధ్వబాహులు, ఆకాశముఖులు, నఖులు, గుడారులు, రుఖరులు, సుఖరులు, ఉఖరులు, కారాలింగులు, సన్న్యాసులు మొదలగువా రందరును శైవ సంప్రదాయమునకు జెందిన

124. Dr. S. Radhakrishnan : Indian philosophy, Vol 2 p 922.

125. Sir R. G. Bhandarkar : Collected Works, Vol. iv, p 180.

వారు. అయినను అతని అభిప్రాయమున ఉత్తరదేశమున శైవము జనసామాన్యముపై నెక్కువ ప్రభావమును జూపింపలేదు. కాశీ మొదలగు శివ క్షేత్రములు చాల ప్రఖ్యాతములై యున్నను వాని ప్రభావము వైష్ణవమువలె ఉత్తరమున లేదని ఆ పండితుని తాత్పర్యము. శైవులలో వేషభాషలలో నెనుమంత విభిన్నత్వము గానుపించినను, సిద్ధాంతములో మిగుల కలిసిపోయినట్లు విల్సను మహాశయుని భావము. శైవులు కరదండములకు లింగధారణము గావింప, రుద్రులు త్రిశూలమును ధరించెదరు. ఉగ్రులు ఢమరుకము బూని, ముఖమున లింగ[illegible] ధరించెదరు. జంగములు లింగమును శిరమున [illegible] దేహముపై లింగాకృతిని ముద్రించుకొందురు అని విల్సను పండితుని పరిశీలనము. కాని వీరికి ప్రత్యేక సంఘములు లేకుండుటచే నెల్లరు కలిసిపోయి యుందురట. 126

ఈ శైవ సంప్రదాయములు ఎక్కువగ ఆగమ శాస్త్ర బద్ధములై యుండినను, కొన్ని విషయములలో విభిన్న భావముల ప్రకటించియున్నవి. పాశుపతమున, జీవుని కర్మమునకు స్వతంత్రముగ సృష్టికి నిమిత్త కారణమైయుండ, నా కర్మరూప క్రియాశక్తి ఈశ్వరేచ్ఛపై నాధారపడి యుండును. శైవసిద్ధాంతమున శివుడు సర్వకారణమైయున్నాడు. అందుచే జీవుని కర్మఫలితము లాతని నెట్లును అంటరావు. అతని కలుషితము జేయజాలవు. ప్రత్యభిజ్ఞ

126. H. H. Wilson : Hindu Religions, P 124.

విధానమున మహేశ్వరుడు సర్వస్వతంత్రుడుగాక, తన సత్య సంకల్పశక్తిచే సృష్టి గావించును. అందుచే వీరి సిద్ధాంతమున నిమిత్తకారణ మితరమున కెట్లును అన్వయింపదు. ఈ విధముగ గొన్ని విషయముల అభిప్రాయభేదములు గోచరము. ఆ యా విషయముల ముందు గ్రంథమున జూచెదముగాక।

## పాశుపతము

'తథా పశుపతి మతం పాశుపతం శాస్త్రం భగవతా పశుపతినా పశుపాశ విమోక్షణాయ అథాతః పాశుపతయోగ విధి వ్యాఖ్యాస్యామః' (7) ఈ విధముగ పశుపతి మతము నాబడు పాశుపత శాస్త్రము పశుతుల్యులైన అజ్ఞ పాశ విమోక్షణమునకై భగవంతుడైన పశుపతిచే వచింపబడినది. ఆ పశుపతి యోగవిధానము వ్యాఖ్యానించెదము అను పుష్పదంతుని శివమహిమ్న స్తోత్రమునకు వ్యాఖ్య రచించిన మధుసూదన సరస్వతీ స్వామి వచించెను. సాక్షాత్ పరమశివుడే జీవోద్ధరణ సంకల్పమున నతి కరుణామయ చిత్తుడై, యీ శాస్త్రమును ప్రతిపాదించియున్నట్లు విదితము.

ఇదే విధముగ మహాభారతముగూడ 'సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా। జ్ఞానాన్యేతాని రాజర్షే విద్ధి నానా మతాని వై॥' సాంఖ్య యోగ పాంచరాత్ర వేద పాశుపత మతములు జ్ఞాన సాధనములు గల్గియున్నవని తెలిపి, 'ఉమాపతి ర్భూపతిః శ్రీకంఠో బ్రహ్మణః సుతః। ఉక్తవానిదమవ్యగ్రో జ్ఞానం

పాశుపతం శివః॥' (శాంతి 349_67) ఉమాపతియు, భూపతియు, బ్రహ్మదేవుని సుతుడును అయిన శ్రీకంఠుడైన శివుడు పాశుపత జ్ఞానమును దెలిపెను అని పాశుపతమునకు గర్త పరమశివుడుగనే వచించినది. కాని Whether this statement is to be understood in the sense that its founder was a human being, afterwards recognised as an incarnation of Siva, or whether it is a mere general statement, .... without any special individual being concerned with it, is a question somewhat difficult to answer difinitely 127 దీని ప్రవక్త మానవుడైయుండి తర్వాత శివావతారముగ దీసికొన బడినవాడను అర్థమువనో, లేక, నే వ్యక్తితో సంబంధము లేదను టకు సామాన్య అర్థమును బోధించు వాక్యముగ నీ వచనముల గైకొనవలయునో అను ప్రశ్నమునకు సువిస్పష్ట సమాధానము కష్ట తరము అని భాండార్కారు పండితుడు సందేహించెను. అవును, సామాన్య రచనములగూడ బ్రశస్తికొరకై దేవతలకు మహర్షులకు అన్వయింపజేయుట సామాన్యముగదా!

కాని ఈ సిద్ధాంతమును స్థాపించిన వ్యక్తి కాలాంతరమున శివునితో నేకత్వమున గ్రంథముల నుపయోగింపబడినట్లు ఆధారములు గలవని భాండార్కారు పండితుని నిశ్చయము. దీని కాధారముగ నా మహాశయునికి వాయుపురాణ (22 అ), లింగపురాణ (24 అ)

127. Sir R. G. Bhandarkar: Collected Works, Vol. iv, p 165-66.

ములలో గొన్ని గాధలు కనుపించెను. కృష్ణద్వైపాయనుని కాలమున, యదూత్తముడైన వసుదేవునికి వాసుదేవుడుగ జనించినప్పుడు, తా బ్రహ్మచారిగ లకులీనుడను నామమున స్మశానమున బారవేసిన శవమున బ్రవేశించి అవతరించెననియు, అది కాయావతారము, కాయావరోహణము నాబడుననియు, నప్పుడు తనకు కుశిక, గర్గ, మిత్ర, కౌరుష్యులను నల్వురు శిష్యు లుండెదరనియు, వీరు పాశుపతులై భస్మధారులై, మహేశ్వర యోగము నవలంబించెద రనియు, సమాప్తమున వారు రుద్ర లోకము నొందెదరనియు, మహేశ్వరుడు బ్రహ్మదేవునితో జెప్పెను. ఈ గాధ నాధారముగ గైకొని యుండనోపు, రాజపుత్రస్థానమున ఉదయపురమునకు పదునాల్గు మైళ్ళ దూరమునగల 'ఏకలింగిలీ' అను నాథసాంప్ర దాయిక ఆలయమున, నొక శాసనము గలదట. భృగుకచ్ఛ దేశమున 'లకుల' యను దండమును ధరించి, శివుడు మానవుడుగ నవతరించె ననియు, నందుకు భృగు ప్రార్థనములు కారణమనియు తెలిపి, అందు కుశికాది పాశుపతయోగులగూడ నా శాసనము బ్రస్తావించిన దట. అదేవిధముగ, 'చింత్రప్రశస్తి' అను శాసనమున, శివుడు భట్టారక శ్రీ లకులేశుడుగ నవతరించెననియు గలదట. లతాదేశమున కారోహణమున నత డుండెను. ఆతనికి కుశిక, గార్గ్య, కౌరుష్య, మైత్రేయ అను శిష్య చతుష్టయము పాశుపత పాలనమునకై యుండెడివారు. చతుర్విధముల బాశుపతమును బ్రచార మొనర్చిరని యీ శాసన విషయము. ఈ శాసనముల కాలము క్రీ. శ. 971 వ సంవత్సరము మొదటిదానికి, క్రీ. శ. 1274–1296 సంవత్సర ప్రాంత

ములు రెండవదానికి భాండార్కారు మహాశయుడు
మరల మైసూరు రాష్ట్రమున శిర తాలూకాలో లకులే
విల్లుకుడుగ జనించెనని క్రీ. శ. 943 వ సంవత్సరమునాట
గూడ గలదట. 127

సర్వ దర్శన సం
పతమునకు లకులేశ పా
సందర్భముల ననుసరిం
of the name Lakuli
who founded a Pasu
అను ఒక వ్యక్తి యొ
పాదించుటయు, తథ్యమ
యము. లకులీశుడే నకులీశుడ...
లేశుడు పూర్వ పురాణ ప్రమాణములరీతిగ కృష్ణద్వై
కాలమున, అనగా కృష్ణ వాసుదేవుని కాలమున నుండినట్లు
సువిస్పష్టము.

అందుచే నీ పాశుపతము కలియుగారంభమున సాత్వత, భాగవత, పాంచరాత్రాది వైష్ణవ సిద్ధాంతములతో సహా శ్రీకృష్ణుని కాలమున జనించిన లకులేశునిచే ప్రబోధింపబడి, నలుగురు శిష్యులచే వ్యాప్తి నొందినట్లు నిస్సందేహము. గురుపరంపరా స్తోత్రమున

127. Sir R. G. Bhandarkar: Collected Works, Vol. iv, p 165-66.

గూడ 'సదాశివం శివం స్కాందం కేశవం పద్మసంభవం' అను దేవతాగణముల తర్వాత 'నందీశ్వరం కుంభయోనిం భరద్వాజ అత్రి గౌతమాన్। దధీచి ముపమన్యుం చమార్కండేయం చ పరాశరం॥' అని మహర్షి సందోహముల స్మరించి, 'శ్వేతం లకులేశం చ నీలకంఠ శివాహ్వాయం' అని లకులేశుని సూచించి యున్నది. అతని తర్వాత ప్రఖ్యాతులైన శివాచార్యులు తెలుపబడి యున్నారు. కాన నీ నిర్ణయము సముచితమని దోచును.

## పాశుపత తాత్పర్యము

'తస్మాత్ పురుషార్థకామైః పురుషధౌరేయైః పంచార్థ ప్రతిపాదనపరం పాశుపతశాస్త్ర మాశ్రయణీయం' అందుచే పురుషార్థముల గోరువారికి, పురుషనాయకులకు, పంచార్థ ప్రతిపాదనపరమైన పాశుపత శాస్త్రము ఆశ్రయణీయమైనది అని మాధవాచార్యుడు తన సర్వ దర్శన సంగ్రహములో లకులేశ పాశుపత ప్రకరణము ముగించి యున్నాడు. ఎందుచేత నీ శాస్త్రము ముముక్షుకోటికి అవలంబనీయము అను విషయమును నిసుమంత జూచెదముగాక.

పండితాభిప్రాయమున నీ పాశుపత మతమే ప్రథమ శైవ సిద్ధాంతమై సర్వేతర శాఖలకు ప్రాతిపదిక యైనది. అందుచే దీనిని ప్రత్యేక శైవశాఖగ గైకొనుట అనుచితమనియు పండిత భావము. దీనినుండియే కాలాంతరమున వివిధ శైవశాఖ లుత్పన్నమగుట స్పష్టము.

మాధవాచార్య వాక్యముల 'పంచార్థ ప్రతిపాదనపరం పాశుపత శాస్త్రం' అని వచింపబడియున్న దీ శాస్త్రము. ఈ శాస్త్ర ప్రబోధితములగు పంచార్థము లెవ్వి? వీనిని సులభముగ క్లుప్తముగ మదుసూదన సరస్వతీస్వామి తన శివమహిమ్న స్తోత్ర వ్యాఖ్యలో ఇట్లు వచించెను. 'తత్రాధ్యాయ పంచకేనాపి, కార్యరూపో జీవః పశుః, కారణం పశుపతి రీశ్వరః, యోగః పశుపతౌ చిత్త సమాధానం, విధిర్భస్మనా త్రిషవణ స్నానాది ర్నిరూపితః, దుఃఖాంత సంజ్ఞకో మోక్షశ్చాస్య ప్రయోజనం। ఏతే ఏవ కార్యకారణ యోగ విధి దుఃఖాంతా ఇత్యాఖ్యాయంతే' అట కార్యరూపుడు జీవుడు పశువనబడును, కారణము ఈశ్వరుడైన పశుపతి. పశుపతిపై జిత్తమును నిల్పుటయే యోగము. భస్మముచే త్రిషవణ స్నానము, దుఃఖాంత మనగా మోక్షము నా ప్రయోజనము. ఈ విధముగ కార్య, కారణ, యోగ, విధి దుఃఖాంతములే యీ పంచార్థములు. వీని వివరములను గొంచెము గాంచెదముగాక.

1. కార్యము : 'పశు శబ్దేన కార్యస్య పరతంత్ర వచనత్వాత్' పశు శబ్దము కార్యమున కన్వయము. అది పరతంత్రము అని మాధవాచార్య నిర్వచనము. కార్యము సదా అస్వతంత్రము. అది విద్యా, కళా, పశు రూపమున త్రివిధము. అందు విద్య పశువు నాశ్రయించి బాహ్యాభ్యంతర రూపమున ద్వివిధము. మరల బాహ్యవిద్య బోధ అబోధకము అని రెండు రూపములు. అందు అబోధ విద్య తదన్య ప్రమాణ జన్యము. బోధవిద్య మరల

వివేకావివేకప్రవృత్తి రూపమున ద్వివిధము. అట వివేకప్రవృత్తి ప్రమాణమాత్రమున జిత్తము నాబడును. ఈ చిత్తముచేతనే సర్వప్రాణుల బాహ్యవిషయ గ్రహణము గలుగును. ఈ చిత్తమునకు ఇంద్రియాది యుపకరణము లవసరము. ఇవి కార్యాకారణ రూపముగ ద్వివిధము అనబడును. అందు గార్యేంద్రియములు పృథివ్యాది పంచభూతము లును, శబ్దాది పంచ తన్మాత్రలును పదియు అగును. అట గార ణేంద్రియములు జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము బుద్ధ్యహంకారమనస్సులును గలసి పదమూడు అగును.

అంత 'పశుత్వసంబంధీ పశుః' అనురీతి పశుత్వముగలవాడు పశువు. వాడే జీవుడు. ఈ పశుత్వము మరల 'సాంజనో నిరంజన శ్చేతి' అశుద్ధ శుద్ధములుగ రెండు విధములు. శరీరేంద్రియ సంబంధము గలిగినది సాంజనమగుచుండ, రుద్ర హితమైనది నిరంజనము. ఇట్లు ప్రథమమైన కార్యరూప పశు లక్షణము అనగా జీవునిగూర్చి తెలుపబడినది.

2. కారణము : సమస్త సృష్టి స్థితి సంహార అనుగ్రహకారి కారణము. అది ఏకమై యున్నను, గుణ కర్మ విభేదముల ననుస రించి విభాగమై నానాత్వమై పతి సాధ్యాది రూపముల బొంది యున్నది. పతిత్వము అనగా నిరతిశయ దృక్క్రియా శక్తిమత్త్వము యుండవలెను. అందుచే నతడు నిత్యపాలకుడు. సాధ్యత్వమును గలిగియుండుటకు అగంతుకము కాని స్వాభావిక ఐశ్వర్యత్వము

గలిగి యుండవలయును. అట్టి పశుపతియే యిట కారణము నాబడు ద్వితీయార్థము.

3. యోగము : 'చిత్తద్వారేణాత్మేశ్వర్య సంబంధో యోగః' అని మాధవ నిర్వచనము అది ద్వివిధము. క్రియా లక్షణము, క్రియోపరమలక్షణమనియు నా విభాగము. అనగా క్రియాపరత్వము మొదటిది, క్రియారాహిత్యము రెండవది. అందు జపధ్యానాది రూప మైనది క్రియాలక్షణ యోగము. రెండవదానిలో నీ సాధనా సంబంధము లేక, కేవలము సంవిత్ సంబంధము. అనగా హృదయతః ఆ స్థితికై భావనా నిమగ్నత నొందుట.

4. విధి : ధర్మాధర్మ సాధక వ్యాపారము విధి. అది మరల ప్రధానభూతమనియు, గుణభూతమనియు ద్వివిధము. సాక్షాత్ ధర్మ ప్రవృత్తిహేతుక చర్య ప్రధానభూతము నాబడును. మరల నిదియు వ్రతము, ద్వారములు అని ద్వివిధము. దేహమునకు భస్మాను లేపనము గావించి భస్మముపై శయనించుట, జపప్రదక్షిణాదికమైన ఉపాహారము కలిగినది వ్రతము నాబరగును. భస్మస్నానానంతరము భస్మశయనమును దినమునకు మూడుపర్యాయములు జేయవలయునని నకులేశుడు తెలిపియున్నాడని మాధవుని ప్రమాణము. మరల నుపా హారము నియమాదిరూపమున షడ్విధము. హసనము, గీతము, నృత్యము, హుడుక్కారశబ్దము, నమస్కారము, జపములు నియ మము. వీనితో నర్చనము గావింపవలయునని సూత్రకార తాత్పర్యము. హసనము అనగా ఆనందమున నవ్వుట. సంగీతశాస్త్రానుసారముగ

మహేశ్వర గుణధర్మాదిక చింతనమే గీతము. నాట్యశాస్త్రానుగుణ్య ముగ అర్ద్రహృదయముతో హావభావములతో నాడుట నృత్యము. వృషభనాదమువలె జిహ్వా, తాలు, సంయోగముచే నాదమును గలుగ జేయుట హుడుక్కారము. హుడుక్ శబ్దము వషట్ శబ్దమువలె అర్థరహితము.

ఇక వ్రతమునకు బిమ్మటగల ద్వారములు షడ్విధములు. క్రాథన, స్పందన, మందన, శృంగారణ, అవి తత్కారణ, అవిత ద్భాషణములు ఆరు. మేల్కొనియుండి నిద్రించుచున్నట్లు నటించుట క్రాథనము. శరీరావయవముల వాయుభూతములవలె గంపింపజేయుట స్పందనము. అశక్తునివలె నడచుట మందనము. ప్రేమలాలసత్వమును ప్రదర్శించుట శృంగారణము. కార్యాకార్య వివేక విహీనునివలె లోకనిందిత కర్మ నాచరించుట అవితత్కారణము. అసందర్భ అనుచిత సంభాషణము అవితద్భాషణము.

ఈ విధిలో ద్వితీయమైన గుణభూతము చర్య అనబడినది. పూజానంతరము భస్మధారణము, భిక్షాటన, దుష్ఫలిత నివారణార్థము భస్మ నిర్మాల్య ధారణము గుణభూతము నా చర్య యగును.

5. దుఃఖాంతము : 'దుఃఖనివృత్తిరేవ దుఃఖాంతః' దుఃఖ నివృత్తియే దుఃఖాంతము. అది దుఃఖముయొక్క అత్యంత నివృత్తియు, పారమైశ్వర్యప్రాప్తియు నని ద్వివిధము. భావికార్య జ్ఞానమునుగలిగి కార్య నిర్వహణము గావించు శక్తి కలిగియుండుట

ఐశ్వర్యము అట్టి గ్రహణము పంచవిధములు. (1) దర్శనము: అనగా నణుపరిమాణ వస్తువుల, గుప్త విషయముల, దూరస్థ పదార్థముల గూడ దర్శించి, స్పృశించుట యగును (2) శ్రవణము: సర్వ శబ్దముల వినగల్గుట. (3) మననము: భావనావిషయగ్రహణము. (4) విజ్ఞానము: సర్వశాస్త్ర సర్వవ్యాఖ్యానజ్ఞానము. (5) సర్వజ్ఞత్వము: వ్యక్తావ్యక్తశాస్త్ర మూల సూత్ర పరిజ్ఞానము. అన్యసిద్ధాంతమున కేవలము దుఃఖాంతముతో బూర్తియగుచుండ నీ శాస్త్రమున దుఃఖ నివృత్త్యనంతరము మహదైశ్వర్యప్రాప్తి పై పంచవిధములుగ రూపొందింపబడియున్నది.

ఈ విధముగ ప్రాచీన శైవము పాశుపత రూపముగ లకులేశ తదనంతర గురువులచే ప్రతిపాదింపబడి ప్రచారములోని కేతెంచినది. కాని లకులేశుని గ్రంథ మెద్దియు ప్రస్తుత మలభ్యమగుట విచార కరము. మాధవా చార్యునికాలమున నేదేని ప్రమాణము గోచరమేమోః కొన్ని లకులేశ వాక్యములుగ నాతడు తన సర్వ దర్శన సంగ్రహ ములో దెలిపియున్నాడు. అదియు అసమగ్ర గ్రంథమే అగుచున్నది.

## కాశ్మీర శైవాద్వైతము

A more important and a much earlier development was a school of monistic Saivism in Kashmir, of which the literature dating from the nineth century came down to us. How much older it may have been in its origin it is not easy to determine. There are elements in

common between the dogmatics of Kashmir Saivism and those of South Indian Saivism. Yet in their philosophy, they differ Perceptibly, the Kashmir School being idealist and the South Indian pluralist in its metaphysic 128 అతి ముఖ్యమును ప్రాచీనతర పరిణామమును అయిన కాశ్మీరశైవాద్వైత సిద్ధాంతము శైవమునకు గలదు. దాని గ్రంథములు మాత్రము క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దమునకు జెంది యున్నవి. దాని ఉత్పత్తి ఎంత పురాతనమో నిర్ణయించుట సులభము కాదు. కాశ్మీర శైవమునకును, దక్షిణ హిందూస్థాన శైవమునకును సామాన్య సిద్ధాంతములు గలవు. కాని వాని తాత్త్వికదృష్టి ప్రస్ఫుటముగ విభిన్నము. కాశ్మీర సంప్రదాయము అద్వైతపరమైయుండ, దాక్షిణాత్యము ద్వైత పరముగ దాత్త్వికముగ నుండును అని నీలకంఠ శాస్త్రి పండితుని భావము. ఈ విషయమును నింకను వివరించుచు, ఈ రెండు శాఖలకుగల చారిత్రక సంబంధమును నిర్ణయించుట కష్టము అని వచించుచు, కాశ్మీర బ్రాహ్మణులు దక్షిణ దేశమునకు వచ్చుటను గూర్చి దక్షిణమున గొన్ని శాసనములు గలవనియు, వాని తాత్పర్యము ననుసరించిచూడ, may lead one to infer that South Indian Saivism is also ultimately derived from Kashmir Literary and epigrapcic evidence from Scuth India and Java and other Indian colonies of the East, also connects the origin and the spread of Saivism with the march of Agastya from the North to the South and

---

128. Prof. K. A. Nılakantha Sastri : The Cultural Heritage of India, Vol. 4, p 77-78.

his further progress towards the Eastern Lands, 128 దక్షిణదేశీయ శైవము పర్యవసానముగ కాశ్మీరమునుండి అరుదెంచి నట్లు తీర్మానింప నవకాశ మొసంగును. దక్షిణభారతము, జావా, భారతదేశముయొక్క తూర్పు వలసస్థానములగు గ్రంథ, శాసన ప్రమాణములుగూడ, శైవ జనవాభివృద్ధులకు, ఉత్తరమునుండి దక్షిణమునకు, అంత తూర్పుతీర దేశములకు అగస్త్యమహర్షి యొక్క యాత్రకును సంబంధమున్నది అని పండిత నీలకంఠశాస్త్రి తెలిపెను.

శివానంద సరస్వతీ స్వామి యీ విషయమున ఆగమములు కాశ్మీర శైవమునకు ఆధారములనియు, అవి యిరువది ఎనిమిదిగ సంస్కృత భాషా రచనములై, కాశ్మీరమునందే జనితములనియు, అవి అంత దక్షిణమునకు ప్రసరించెననియు, ఆ యాగమములు కాశ్మీరమున ప్రత్యభిజ్ఞ దర్శనముగను, పశ్చిమ భారతమున మాహేశ్వర దర్శనముగను, దక్షిణమున శుద్ధశైవ దర్శనముగను పేరొందినవనియు ప్రకటించెను. 129

కాశ్మీర సంప్రదాయ శైవము త్రిక శాసనము, త్రికశాస్త్రము, సామాన్యముగ 'త్రిక' అనియు బిలువబడును. మరియు దీనికి రహస్యసంప్రదాయము అనియు, త్ర్యంబకసంప్రదాయ మనియును

---

128. Prof. K. A. Nilakantha Sastri : The Cultural Heritage of India, Vol. 4, p 77-78.

129. Swami Sivananda Saraswati : Lord Siva and His Worship, p 163.

నామములు గలవు. మొత్తము తొంబది రెండు ఆగమశాస్త్రములలో సిద్ధ, నామక, మాలిని ఆగమములమాత్రము ప్రమాణముగ గైకొనుట చేతగాని, శివశక్తి అణువులగూర్చి అనగా శివ శక్తి నరులగూర్చి ప్రస్తావించుటచేతగాని, పరా, అపరా, పరాపరా శక్తుల ప్రతిపాదించుటచేగాని, అభేద, భేదాభేద భేదముల బరమార్థమునుగూర్చి తెలుపుటచేగాని ఇది త్రికసంప్రదాయము అని ప్రసిద్ధిగాంచినది 130 ఈత్రికవాదము స్వాతంత్ర్యవాదము, స్వాతంత్ర్య, స్పంద అనియు, అభానవాదమనియు, కశ్మీరీయులచే ప్రాచుర్యము నొందియుండుట కాశ్మీర శైవమనియు. ప్రఖ్యాతము.

The Trika is a spiritual philosophy, because its doctrines regarding Reality the world and man are derived. from a wealth of spiritual experiences, and are not constructions based upon an analysis of the ordinary experiences of man 130 పరమార్థ ప్రపంచ, మానవులగూర్చిన దాని భావములు సామాన్య మానవానుభవ విమర్శనములపై నాధారపడక పారమార్థిక అనుభవసంపదనుండి వచ్చినవిగాన త్రికవిధానము పారమార్థికతత్త్వ విచారణముగ ఆచార్య అరవింద బాసుని అభిప్రాయము. వానిని గూర్చి మహాత్ముడైన అరవింద ఘోషుకూడ అనుభవ సిద్ధాంతములు (experience-concepts) అని వచించెనట. Its greatest exponants were yogis of high stature 130 దాని సుప్రసిద్ధ ప్రవక్తలు ఉన్నతస్థానము నొందిన

130. Prof. Arabinda Basu : The Cultural Heritage of India, Vol 4, p 79-80.

యోగివరేణ్యులు అనియు ఆచార్య బాసు మహాశయుని విశ్వాసము. అందుచే The Trika, in short, is a rational exposition of a view of Reality obtained primarily through more-than-normal experience 130 త్రికము, ఒక్కమాటలో, ముఖ్యముగ అలౌకికానుభూతిచే పరమార్థమునుగూర్చిన సహేతుక వివరణముగ అతని గాఢతర విశ్వాసము. ఈ కాశ్మీర శైవమునుగూర్చి పండిత భాండార్కరుగూడ a system of Saivism more human and rational 131 సయుక్తిక దయాపరమైన శైవవిధానముగ నభివర్ణించెను.

కాశ్మీర శివసంప్రదాయము స్పందశాస్త్రము ప్రత్యభిజ్ఞ శాస్త్రములపై నాధారపడుచు, ద్వివిధ శాఖలను బొందియున్నది. స్పంద ప్రత్యభిజ్ఞా శబ్దములు రెండు శాఖలయందును సామాన్యముగ వాడబడియుండినను, నవి ప్రత్యేకముగనే వెలసియున్నవి.

ఈ శైవమునకు ప్రమాణములుగ పరా, అపరా, పరాపరా రూపమున, అభౌతికము, క్రియాదికము, తాత్త్వికము నాబరగును. అయినను ప్రముఖముగ నీ శాస్త్రము ఆగమశాస్త్ర, స్పందశాస్త్ర, ప్రత్యభిజ్ఞశాస్త్ర రూపమునగూడ త్రివిధముగ నున్నది. అందు నీ శైవాగమములు నిత్యములనియు, నవి శ్రీ నీలకంఠ రూపమున శివునిచే దుర్వాస మహర్షికి బూర్వ ముపదేశింపబడినవనియు, నా

130. Prof. Arabinda Basu : The Cultural Heritage of India, Vol 4, p 79-80.

131. Sir R. G. Bhandarkar : Collected Works, Vol. iv, p 183.

మహర్షి తన మానస పుత్రులైన త్ర్యంబక, ఆమర్దక, శ్రీకంఠు లకు అభేద, భేద, భేదాభేదాత్మకమైన యీ శాస్త్రమును ప్రజానీక మున బోధింప నాజ్ఞ నిడెననియు, బురాణ వచనములు. ఆగమము లలో ప్రధానమైన మాలినీ విజయ, స్వచ్ఛంద, విజ్ఞానభైరవ, ఉచ్ఛుష్మభైరవ, ఆనందభైరవ, మృగేంద్ర, మాతంగ, నేత్ర, నైవాస, స్వాయంభువ, రుద్రయామలములు ప్రమాణములు. కాని యివి ద్వైతపరములుగ నుండుటచే దొమ్మిదవ శతాబ్దమునకు జెందిన, వసుగుప్త నాబడు శివయోగికి అద్వైతపరమైన శివసూత్ర గ్రంథము వెలువరింపబడెను. ఈ శివసూత్రము, శివోప నిషత్సంగ్రహ మనియు, శివరహస్యాగమశాస్త్ర సంగ్రహమనియు ప్రతీతి. ఈ సూత్రములకు వృత్తి, భాస్కరాచార్యుని వార్తికము, క్షేమరాజుని విమర్శినీ గ్రంథములు సుప్రసిద్ధములు. సూత్రవృత్తి వసుగుప్తయే నిర్మించినట్లు గొందరి నమ్మకము కొన్ని ఆగమములకు అద్వైత పర వ్యాఖ్యానములు గొన్ని గలవు.

స్పందకారిక నాబడు స్పందశాస్త్రము అనగా స్పందశాస్త్రము పూర్వ శివసూత్రములగల విషయములనే వివరించుచుండును. దీనికి గర్త వసుగుప్తయే యని యందురు. దానికి 'సంగ్రహ గ్రంథ'ము నా నామము. వసుగుప్తుని శిష్యుడు కల్లటుడు యీ సూత్రములపై వృత్తిని నిర్మించెను. సంగ్రహ గ్రంథము, వృత్తియు జేరి 'స్పంద సర్వస్వము' నాబడును. స్పంద సూత్రములకు క్షేమరాజు స్పంద నిర్ణయము, స్పంద సందోహము లనెడు వాఖ్యల రచించెను. మరియు

రామకృష్ణునిచే వృత్తియు, ఉత్పల వైష్ణవునిచే ప్రదీపకము అను వృత్తులు వీనికి గలవు.

ప్రత్యభిజ్ఞాశాస్త్రము యథార్థమున త్రికసిద్ధాంతమునకు దార్శనిక గ్రంథమని తజ్ఞుల నుడి. వసుగుప్తుని శిష్యుడనబడు సిద్ధసోమానందుడు పూర్వపక్ష సిద్ధాంతములతో 'శివదృష్టి' అను గ్రంథమును వసుగుప్తుని భావములపై నాధారపడుచు రచించెను. సోమానంద సిద్ధుడు తొమ్మిదవ శతాబ్దమునకు జెందినవాడని యందురు 'శివదృష్టి'కి అతడే 'వృత్తి'ని నిర్మించెనట. కాని నేడు అది అలభ్యము. అతని శిష్యుడై క్రీ. శ. 930 వ సంవత్సరమునకు జెందిన, ఉత్పలుని 'ఈశ్వర–ప్రత్యభిజ్ఞ' అను గ్రంథము సోమానందుని తాత్త్విక విచారణమును క్రోడీకరించును. దాని 'ప్రత్యభిజ్ఞా సూత్ర' మనియు నందురు. ఈ గ్రంథము అతిప్రాధాన్యము జెంది యీ శైవ సంప్రదాయమునకు 'ప్రత్యభిజ్ఞ' అను ప్రసిద్ధిని సంపాదించినది. 'ప్రత్యభిజ్ఞాసూత్రము'నకు ఉత్పలుడే యొక వృత్తిని రచింప, క్రీ. శ. 993–1015 వ సంవత్సరములనున్న అభినవగుప్తుడు, 'ప్రత్యభిజ్ఞా విమర్శినీ' (లఘ్వీ వృత్తి) 'ప్రత్యభిజ్ఞావృత్తి విమర్శినీ' (బృహత్ వృత్తియు) అనియు రెండు గ్రంథముల నిర్మించెను. అభినవగుప్తుని గ్రంథముపై 'భాస్కరీ' అనునది సవివరణ గ్రంథము. అభినవగుప్తుని 'పరమార్థసార' 'తంత్ర సార' అను గ్రంథములు క్రీ. శ 1030 వ సంవత్సరమునకు జెందిన క్షేమరాజుయొక్క 'ప్రత్యభిజ్ఞా హృదయ' ములు మూడును ఈ సిద్ధాంతమున ముఖ్య

గ్రంథములు. అభినవగుప్తుని 'తంత్రాలోక'ము, దానిపై జయరథుని వ్యాఖ్యానము యీ సిద్ధాంతమున సర్వస్వముగ విజ్ఞుల తాత్పర్యము.

ప్రత్యభిజ్ఞా సిద్ధాంతమున అద్వైతాచార్య శంకరప్రభావము అధికముగ దోచి, రాష్ట్రపతి రాధాకృష్ణాది పండితవర్గ భావమున అద్వైత వాదము దిక్కునకు దిరిగినది. 132 అంతియగాక ప్రత్యభిజ్ఞము శాక్త శైవాగమమూలము గలిగి యుండినటుల శంకరుడును, అతని గురువు గౌడపాదాచార్యుడును, తమ అద్వైత సిద్ధాంతమును ఆగమములనుండియే గైకొనినట్లును వారి వాదము. 133 ముఖ్యముగ సోమానందుని 'శివదృష్టి' ఉత్పలుని 'ప్రత్యభిజ్ఞాసూత్రము' అభినవ గుప్తుని గ్రంథములు, అద్వైతవాదము నభిమానించునని శివానంద సరస్వతీ వచనము. మాధవాచార్యుని అభిప్రాయమున అభినవ గుప్తుని గ్రంథములు ప్రధానములై పూర్వ గ్రంథములు ప్రాథమికములు అని తెలియబడును.

'ప్రత్యభిజ్ఞత్వ'ము అనగా యథార్థమును ఎరుంగుటయే అత్యవసరమని గట్టిగా వక్కాణించుచుండుటచే దీని 'ప్రత్యభిజ్ఞ' యందురు. పశురూపమున గల జీవుడు, తన యథార్థ స్వరూపమును గుర్తించుటయే ప్రత్యభిజ్ఞ నాబడును. ఈ భావము అద్వైత తాత్పర్యమును సూచించును. Pratyabhijna is the discipline

132. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p 731.

133. Sri V. T. Srinivasa Iyangar : The Outlines of Hindu Philosophy, p 173

prescribed by the school, which consists in the unbroken recognition of man's essential identity with Siva and the falsity of everything else 134 ప్రత్యభిజ్ఞ అను సాధన పద్ధతిని యీ శాఖ ప్రతిపాదించినది. మానవునికి శివునితో నేకత్వ అవిచ్ఛిన్నత్వము, అన్యముయొక్క అయథార్థత్వ స్ఫురణముల నిది తెలుపును అని శ్రీనివాస అయ్యంగారు స్పష్టము జేసెను. ఆ విధముగ కాశ్మీర శైవము కొంచెము అద్వైతపరముగ నున్నను, సృష్టి మాయాకల్పితమైన భ్రాంతిరూపముగాక, బింబ ప్రతిబింబ న్యాయమున, అభాసమాత్రమని వచించి, దానికి భ్రాంతిత్వమును ఖండించి, సత్యత్వమును యీ వాదము సమర్థించును. ఈ విషయముల నొకించుక జూచెదము గాక.

త్రిక సిద్ధాంతమునకు ప్రమాణ శాస్త్రము అగమ గ్రంథములు. కాని శాస్త్రము అన కేవలము గ్రంథ రూపముగాక, అది జ్ఞాన రూపమై నిత్యమై యున్నది. అది, పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ రూప చతుర్విధ శబ్దములలో ప్రథమమైన పరా శబ్దరూపమున నుండి. పశ్యంతి శబ్దముగ రూపాంతరము నొంది, అంత మధ్యమా శబ్దరూపమున ఋషీశ్వరులకు గోచరించును.

ప్రస్తుతము అగమశాస్త్రము పంచానన స్వరూపుడైన పరమ శివుని పంచ ముఖముల ద్వారమున మధ్యమా శబ్దరూపమున

134. Sri V. T. Srinivasa Iyangar: The Outlines of Hindu Philosophy, p 169.

ఋషివర్యులకు గోచరించెను. చిత్, ఆనంద, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తుల కనుగుణముగ ఈశాన, తత్పురుష, సద్యోజాత, అఘోర, వామ, నామక పంచముఖములు శివున కలరారినవి. ఈ విధముగ త్రిక సాంప్రదాయిక శాస్త్రము లుత్పన్నములు. ఈ జ్ఞానము స్వయంప్రకాశము గాన ఋషీశ్వరులు తమ తపశ్శక్తిచే గ్రహించి శిష్యకోటికి బోధించెదరు.

త్రిక సిద్ధాంతమున పరతత్త్వము అనుత్తర, చిత్తు, చైతన్య, పూర్ణ, పరా సంవిత్తు, శివ, పరమశివ, పరమేశ్వర, ఆత్మ యను నామముల బరగుచు, బిందువై, అనిర్వాచ్యమై, శుద్ధచైతన్యమై, సద్రూపమై, శివమై, ఆనందమై, పరమాత్మ సర్వాంతరాత్మయై, నిరాకారమై యుండి సాకారాంతరమై నిరవధికమై విరాజిల్లును.

కాని సృష్టికి ఆధారమై కారణమగుటచే నా పరశివుడు, సర్వాతీతమై యుండియు సర్వాంతరమై యున్నాడు. అతీత స్థితిలో శివుడనియు, వ్యక్త స్థితిలో శక్తి యనియు నది అనబడును. శివ శక్తులు రెండు అన్య తత్త్వములుగాక, నొకే తత్త్వము రెండు విభిన్న స్థితులలో గోచరము. శక్తి సదాశివునితో అభిన్నత్వమున నలరారును. అగ్ని దాహక శక్తులవలె శివశక్తులు వ్యవహారమున అన్యము లనిపించునుగాని ఒక్కటిమాత్రమే యగును. శక్తిలేని శివుడు శవతుల్యముగాన, శివ శక్తులు సామరస్యమున నొకే తత్త్వముగ నుందురు. ఆ సంయుక్త రూపమే పరమ శివుడు. శక్తి హృదయమనియు, శివుడు సారమనియు బరిభాషా పదములు.

శుద్ధ చిత్తు జ్ఞానమై ప్రకాశమై, స్వయంప్రకాశమునై యున్నది. చిత్తు చైతన్యమే యగును. ఆ చైతన్యమే శక్తిరూపము. దీనిని చిచ్ఛక్తి అందురు. ఇదియే సర్వ సృష్టికారణము. ఈ శక్తియే చిత్, ఆనంద, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, రూపమున పంచ విధము. చిత్తు స్వయంప్రకాశమై యుండ, ఆనందము నిరపేక్ష కానందము. ఇచ్ఛ శివుని సృష్టి సంకల్ప శక్తియై యుండ, జ్ఞానము వ్యక్తావ్యక్త జీవుల పరస్పర సంబంధ జ్ఞాన మనబడును. క్రియా శక్తి అన నెల్ల రూపముల ధరించుట నాబడును. ఈ పంచశక్తులు గూడ నొకే శక్తియొక్క వివిధ రూపములు. శక్తి, స్వాతంత్ర్య మనియు విమర్శ అనియు నామాంతరముల గలిగియున్నది. శివుడు శక్తిలో ప్రతిబింబింప నాతనికి 'అహం విమర్శ' జనించును. ఈ ప్రతిబింబమునకు ప్రతిబింబరూపములే జగత్సృష్టి. దీనినే అభాన అనియు ననదగును. ఈ 'అహం విమర్శ' యందు 'ఇదం' రూప బాహ్య ప్రపంచము అంతర్గతము. నేను అనుటకు అన్యమొకటి 'నేను'కు గ్రాహ్యముగ నుండవలయునుగదా. ఆ గ్రాహ్యమే ప్రపంచము.. ఈ ప్రపంచమే శక్తియొక్క స్థూలరూపము. బాహ్య ప్రపంచ రూప శక్తి, విమర్శ యగుచుండ, దాని కాధారమైన ప్రకాశము శివుడు మరియు 'అహం'కారమున్ననే విమర్శయగును. అది లేనిచో బదార్థమగును. పదార్థముతో సంబంధించిన విమర్శా రూప 'అహం' కారాత్మక జీవుడు, తన ప్రకాశ స్వరూపమును గుర్తించుటయే యీ సిద్ధాంతమున సాధన.

శక్తియొక్క పంచతత్త్వములే సృష్టికి గారణము. 'చిత్' స్వయం ప్రజ్ఞత్వము నొంద నానందము జనించును. ఆనందము సృష్టి కార్యమునకై యిచ్ఛ జనింపజేయును. దీని నెట్లు సృజింప వలెనో ఆ జ్ఞానముండినగాని సృష్టి జరుగనేరదు. అంత సృష్టి క్రియాశక్తిచే జరుగును. చిదానందముల వేరుగ నుంచి, సృష్టి కార్యమునకు ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, శక్తులే కారణమనియు నందురు. విశ్వము శివునిలో వ్యక్త అవ్యక్తరూపమున నంతర్గతము. అవ్యక్త రూపము శక్తి యగుచున్నది. అదియే విశ్వముయొక్క స్థూల రూపము. అహంకారముతో సృష్టి ప్రారంభము. అందుచే నీ సృష్టి శివునకు బాహ్యముకాక, అన్యమునుగాక, శివాత్మకమై యున్నది. ఈ సృష్టి నాబడు శివ స్వయంవ్యక్తిత్వము ఉన్మేషముగను, ప్రళ యము నిమేషముగను నందురు. ఉన్మేష నిమేషరూప సృష్టి, ప్రళయములు అవిచ్ఛిన్నముగ నిరంతరము జరుగును.

శివునకు తిరోధాన సృష్టి స్థితి లయ అనుగ్రహము లనబడు పంచ నిత్యకృత్యములు గలవు. శివుడు తిరోధానరూప సంకుచిత తత్త్వమను బొందినగాని సృష్టి జరుగదు. ఈ తిరోధాన ప్రభావ ముచే అఖండ శివుడు అణుత్వమును బొంది, సృష్టిరూపు డగు చున్నాడు. దీనినే సంకోచమనియు నందురు.

ఈ విధముగ నణుత్వము నాబడు సంకోచము నొందిన శివుడు మాయాశక్తి సహాయమున మరియొక అవధికత్వము నొందును. అట్లేర్పడినవాడే పురుషుడు అనగా జీవుడు. ఇతడు దేశ కాల జ్ఞాన

కర్తృత్వ అనంద బద్ధుడై యొప్పారును. పంచాత్మకిమైన యీ అవధికత్వము మాయా ప్రాబల్యమున నేర్పడ అతనికి విశ్వము గ్రాహ్యముగ నుండును. పురుష విశ్వముల మూలముగ బూర్వము ఈశ్వరునిలో పూర్వముఃలేని భోక్తృత్వ భోగిత్వ ద్వంద్వము రూపొందును. అవియే పూర్వోక్త 'అహం' 'ఇదం' రూపములు.

అశుద్ధమాయా ప్రావృతుడైన శివునకు అనగా బురుషునకు కళ, విద్యా, రాగ, కాల, నియతి, నాబడు పంచ కంచుకములు అనగా మాయావరణములు గలుగును. శుద్ధ మాయ పురుషునితో సహోత్పన్నము. కాని యీ అశుద్ధ మాయ నానాత్వజ్ఞానమై కాలాంతర జన్యము. సాంఖ్యమున గల నిరువదియైదు తత్త్వములు. పంచ కంచుకములు, మాయ, గలిపి ముప్పదియొక్క తత్త్వములుగ నీ త్రిక సిద్ధాంతమున బ్రతిపాదితము. వీనికి పంచ శుద్ధమాయా తత్త్వములుగూడ జేరి, ముప్పదియారు తత్త్వములు యీ సిద్ధాంత ప్రతిపాదితములు.

పురుషుని అణుత్వమే ఆణవమలము నాబడి, పురుషుని నిజ స్థితి విస్మరింపజేయు అఖ్యాతిరూప మగును. శివుడు పరిమితుడై 'పశు' రూపము దాల్చెను. అంత నాతడు సర్వముగాక, స్వేతర భావ ముత్పన్నమై, యితరముతో నేకత్వముబొంద భ్రాంతిచే యత్నించును. ఆణవమలమునకు మాయాయిమలము కర్మమలములు తోడ్పడును. మాయాయి మలము ముప్పదియారు తత్త్వముల సూచికము. కర్మమలముచే బురుషుడు కర్తయై, పుణ్యపాపకర్మ బద్ధుడై,

జనన మరణముల మునుంగును. సర్వజీవులు యీ మలత్రయములో తరతమ భాగములచే ననుభవించుచుందురు.

త్రికసిద్ధాంతమున జీవుడు త్రివిధము. ఒక అణవమల విశిష్టమైన జీవుడు విజ్ఞానకళ అనియు, అణవ, కర్మ మలముల గల్గియున్నచో ప్రళయాకళ అనియు, మలత్రయ విశిష్టత్వమునౌ సకళ అనియు వ్యవహారము. సకళ జీవులు దేవమానవులలో నుందురు. వీరికి శరీరములు మాయావధికములో అనగా 'మాయాండ'మున నుండును.

మహాప్రళయకాలమున నీ జీవులు, విశ్వము అంతయు మాయలో విలీనమగును. జీవుల కర్మమలము సంస్కార రూపమున నుండుటచే, వారికి బునర్జన్మ గలుగును. కర్మ, మాయాయి మలముల నతీతించినవారు అశుద్ధ మాయను అతీతించెదరుగాని శివతాదాత్మ్యము నొందరు. వారికింకను అణవమలముండును, వారికి ద్వంద్వత్వముండదు, కాని శివైక్యము సిద్ధింపదు. అణవ మలమునుండి విముక్తులైనవారు శివైకత్వమును బొందెదరు.

అణవమలము నాబడు అత్మసంకోచము పురుషప్రయత్నమున గాక శివానుగ్రహముచే నడంగును. శివానుగ్రహముచే మాయా విముక్తినొంది, పురుషుడు ద్వంధముల నతీతించి, దృగ్దృశ్యత్వమును బాసి, శివైక్యమును బొందును. 'ఇదం'త్వము 'అహం'త్వములో నైక్యమగుట అవసరము.

అణుత్వ నిరాసమునకు శుద్ధమాయా తత్త్వములని తెలుపబడు శుద్ధవిద్యా, ఈశ్వర, సదాఖ్య, శక్తి, శివులు సోపానములు. ఈ స్థితికి వచ్చిన పురుషుడు 'ఇదం'రూప జగత్తును, బాహ్యమున అశుద్ధ మాయాబలమున బూర్వము గాంచినట్లు జూడక, దనయందే వీక్షించును. విషయము గోచరముగాని అది బాహ్యము కాదు. కాని వానిలో దాదాత్మ్యమభావము. శుద్ధవిద్యా స్థితిలో 'ఇదం' 'అహం'లు అనన్యములైనను 'ఇదం'త్వము ప్రధానము. అనగా ప్రస్ఫుటము. ఇట 'అహం అహం' అనియు 'ఇదమిదం' అను స్ఫురణము మాత్రముండును. ఈశ్వర తత్త్వస్థితిలో 'అహం' 'ఇదం' తత్త్వములు సామ్యావస్థలోనుండి పురుషునికి 'అహమిదం' అను ప్రజ్ఞ గోచరము. సదాశివస్థితిలో అహంత్వము ప్రధానమై 'అహమిదం' అను ప్రజ్ఞ స్థిరముగ నుండును. శక్తితత్త్వస్థితిలో 'అహం' అను ప్రత్యయము మాత్రము ఉండును. 'ఇదం' అందు లయ మగును. కాని 'ఇదం' బీజాకృతి యిందు నిమిడి యుండును. అందుచేతనే శక్తిస్థితిని 'బీజభూమి' అని అందురు. ఈ అవస్థలో వ్యక్తము అవ్యక్తముగ నుండుటచే 'శూన్య' మనియు మహాశూన్యమనియు నందురు. అచట నే సృష్టియు లేదు. అందుచేతనే 'నిషేధవ్యాపార రూప'మనియు నందురు.

పంచ శుద్ధ తత్త్వములలో బూర్వోక్త చిదానంద ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, శక్త్యంతరములు. శివునిలో 'అహం' రూప ప్రథము స్పందనము చిదంశము, చిచ్ఛక్తి. 'అహం' భావమున

నానందముండును. అనగా శక్తితత్త్వములో ఆనందము ప్రధానము. సదాశివతత్త్వమున ఇచ్ఛాశక్తియు, నీశ్వర తత్త్వమున జ్ఞానశక్తియు, శుద్ధవిద్యాతత్త్వమున క్రియా శక్తియు ప్రధానములు. ఆ యా స్థితులనున్న పురుషులకు వివిధ నామములు తెలుపబడినవి. శుద్ధ మాయనుండి శివునివరకు, మంత్ర, మంత్రేశ్వర, మంత్రమహేశ్వర, శాక్త్య, శాంభవ అని క్రమముగ వారి నామములు.

ఈ విధముగ సృష్టి శివాత్మకము. శివ సుప్తావస్థలో సృష్టి కార్యము జరుగ, శివజాగరణమున విశ్వ లయము ఏర్పడును. విశ్వ అన్యత్వ స్ఫురణము అట అభావము. ఈ శివారోహణ అవరోహణ కార్యము శివునిక్రీడగ వచించెదరు. అది స్వాభావికము.

శివుడు అవరోహణ ఫలితముగ బశుపైనట్లు చూచియున్నాము. అతడే జీవుడు సంసారియుగూడ నగుచున్నాడు. అత్మానాత్మ ఏకతా భావము పరిమిత జ్ఞానాది శక్తులు యీ పశు లక్షణములు, సర్వా వధికముల నిరాసమొనరించి, అపరిమితాత్మత్వజ్ఞానమే, అనగా 'శివోహం' అను జ్ఞానమే పర్యవసానము.

జీవునికి పౌరుష బౌద్ధ రూప ద్వివిధ అజ్ఞానములున్నవి. అందు పౌరుష అజ్ఞానము అణవమల అంతరము. ఇది శివ సంకల్ప రూపము అందుచే జీవయత్నమున అనివార్యము, కాని శివానుగ్రహ ముచే రూపుమాయును. అనగా 'శివ శక్తిపాత' బలమున పౌరుష అజ్ఞానము మాయమగును. తత్ఫలితముగ పాశక్షయము శివయోజనము

గలుగును. శివయోజనముచే నణుత్వభంగము గలుగును. కాని 'దృఢ శక్తిపాతవిద్ధ'ముగాక ఆ స్థితి జీవుని కేర్పడదు. శివత్వమును బొంది నను అనగా శివయోజన స్థితి లభించినను, తత్స్ఫురణ ముండదు. అణుత్వ నిర్మూలనమున నది ఘటిల్లును. పూర్వముగల అహం కారము అనగా కర్తృత్వమును ద్రోలి, 'అహంత' స్థితికి అరుదెంచినగాని శివత్వము పురుషునికి సంప్రాప్తింపదు.

శివానుగ్రహరూప శక్తిపాత ప్రభావముచే పురుషుడు సద్గురు సన్నిధానమునకు జేడును. సద్గురు సన్నిధిని బొందిన దీక్షచే క్రియా శక్తి జాగరణమగును. క్రియాశక్తిచే 'ఇదం' విశ్వము 'అహం' రూపముగ గ్రహింపబడి, 'పూర్ణాహంత'చే ఆనందము గలుగును. శాస్త్ర విచారములచే బరిశుద్ధమైన బుద్ధిచేగాని యిది గ్రహింపబడ నేరదు. అనగా కేవలము పాండిత్యముగాక, నది అంతర గ్రహ ణము. అటు బుద్ధిలో ముక్తిస్థితి బోధపడును. ఇట్టి స్థితిని జీవన్ముక్తి అందురు.

పౌరుష అజ్ఞానముతోడ పౌరుషజ్ఞాన ముద్భవించును. జీవుని లోని జ్ఞానముచే నిది పరిణమించును. ఇట శివ శక్తులకు సమాన త్వము గోచరము. దీనినే యామలము అందురు. ప్రకాశ, విమర్శల సామ్యావస్థ అది. పరమశివత్వప్రాప్తి యన శక్తి, చక్రము నాబరగు శక్తుల బొందుట యందురు.

ఈ స్థితిని సాధింప ఉపాయములు నాబడు చతుర్విధ మార్గ ములు బోధింపబడినవి. అనుపాయ, శాంభవ, శాక్త, అణవ,

ఉపాయము వాని నామములు. అందు ప్రథమము ఉపాయమే కాదు. శక్తిపాత ప్రభావమున సాధకుడు ఎట్టి సాధనగూడ లేకయే సద్గురు బోధతో 'జీవేశ్వరైక్య పరమార్థ'మును బొందును. అతడు తన నిజ స్వరూపమును గ్రహించును. శాంభవ ఉపాయమున, దీక్ష సహాయమున సాధకుడు నిర్వికల్పక జ్ఞానమును బొందును. అందు అహంకారము అహంతలో లీనమైపోవును. 'ఇదం' విశ్వము 'అహం'తలో మగ్నమగును. ఇచట జీవుని ఇచ్ఛారూప సంకల్పము ప్రధానము గాన దీని ఇచ్ఛోపాయమనియు నందురు. శక్త్యోపాయమున, నిర్వికల్పక స్థితి నొందుటకు వికల్పములు పరిశుద్ధము గావింపబడవలెను. దీనికొరకు సత్తర్క, సదాగమ, సద్గురువు లవసరము. గురు సన్నిధి అగమశాస్త్ర శ్రవణము సత్‌తర్క మనబడును. ఇది నిర్వికల్ప పరామర్శమునకు మార్గము. జపధ్యానములు సంవిత్ జాగరణమునకు మార్గములు గావని యిచట సిద్ధాంతము. సత్తర్కమే దీనికి మార్గము. కాని అందులకు యాగ, హోమ, వ్రత, జప, యోగములు సహకారములు. అణవ ఉపాయమువ వికల్ప పారిశుద్ధ్యమునకై పురుషకార మవసరము. దానికై ధ్యాన, ఉచ్చార, వర్ణ, బాహ్యవిధుల రూపముగ నిది యుండును. హృదయాకాశమున సర్వతత్త్వాంతరమైన పరమార్థమును సంకల్పించి, అందు వాహిని, అర్క, సోమము లనబడు జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములను లయింపజేయుటయే ధ్యానము. దీనిచే జ్ఞేయము జ్ఞాత యందు మగ్నమగును. ఉచ్చారమన ప్రాణశక్తిని ఊర్ధ్వముఖము గావించుట. వర్ణమున సూక్ష్మ ప్రాణము సాధన రూపమగును. ఉచ్చారమున కించిన్మాత్ర

శబ్దము గోచరముగాని వర్ణమున నది శూన్యము. వర్ణమున బీజాక్షరములు ప్రధానము.

జీవుడు సర్వకాల సర్వావస్థల శివునే అనుభవించుచున్నను, పరిమితత్వముచే గ్రహింపజాలకుండును. ఆత్మస్ఫురణముపై బుద్ధి ప్రసరింప, నది శివుడేకావున, దానే సర్వమనియు, నతీతుడననియు దృఢస్ఫూర్తి దోచును. దానినే ప్రత్యభిజ్ఞ అందురు. ఆ పరమ శివత్వమున విశ్వముయొక్క సంకోచ వికాసములు లేవు. ఆ స్థితియే జీవుని గమ్యము.

త్రిక సిద్ధాంతమున శక్తి, జ్ఞానములు సమన్వయింపబడెను. సాంఖ్యమున ప్రధానమునకు స్వాతంత్ర్యము గలదు గాని యిచట బరమశివ పరిణామమున నది యొక సోపానము. అద్వైతమువలె నది భ్రాంతిరూపము కాదు. ఇందు నిమిత్తోపాదాన కారణములు సృష్టికి శివుడే అగుచున్నాడు. కాని సృష్టి ఛాయామాత్రము. అందుచే నతడు సదా అతీతుడై, యీ పరిణామములోని సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతుడై యుండును. అట్లు పరమశివుడు సర్వమై, సర్వాతీతమైన స్థితి నుండునని త్రిక సిద్ధాంతము.

త్రిక సిద్ధాంతమున జీవుడే శివుడను అద్వైత భావము లున్నను, మాయాశక్తి అజ్ఞానమనియు, భ్రాంతి యనియు గాక, శివశక్తియై, పరిణామావస్థలో ప్రపంచ మగుటచే, నీ విశ్వముగాని, పశువనబడు జీవుని జీవత్వముగాని, భ్రాంతి రూపములుగాక, శక్తి

యొక్క పరిణామరూపములే యగుట యిందు సువిస్పష్ట గోచరము వివర్తవాదము ఇచట అంగీకార్యము కాదు. కేవల శివుడే జీవ, జగత్తులుగ బరిణమించుటయు కాదు. శివుడు నిర్వికారి. బింబ ప్రతిబింబవాదమున బింబము నిర్వికారమై యుండుట యిట సూచితము.

ఈ విధముగ నీ త్రిక సిద్ధాంతము శైవమత పరిణామమున నొక అతి ప్రధానపాత్రను వహించి, భారతీయ సంస్కృతి కొక అలంకారముగ నున్నదనియు విదితము, ఇట్టి పారమార్థిక సిద్ధాంతమును బ్రతిపాదించియున్న త్రిక సిద్ధాంత ఆచార్యులు పూజనీయులు వారికెల్లరకు భారతీయులు సదా కృతజ్ఞులు.

## శైవ సిద్ధాంతము

శ్లో॥ నమ స్సోమాయ రుద్రాయ శంకరాయ మహాత్మనే।
బ్రహ్మావిష్ణు సురేంద్రాణాం ధ్యానగమ్యాయ శూలినే॥
భక్తిగమ్యాయ భక్తానాం విదుషా మాత్మరూపిణే।
స్వానుభూతి ప్రసిద్ధాయ నమస్తే సర్వసాక్షిణే॥

స్కాంద-సూతసంహిత-శివమహాత్మ్యఖండ. (1-56)

ఉమాసహితుండును రుద్రరూపియు శంకరుడగు మహాత్ముండును, బ్రహ్మ, విష్ణు దేవేంద్రాది దేవతల కెల్ల ధ్యాన గమ్యమును, త్రిశూలధారియు, భక్తులకు భక్తి గమ్యమును, విద్వాంసులకు ఆత్మ రూపియు, స్వానుభూతి ప్రసిద్ధుండును సర్వసాక్షియునై వెలయు మహాదేవునకు నిరంతర మసంఖ్యాక నతులొనర్చెదను.

The Saiva Siddhanta system is the distilled essence of Vedanta 135 వేదాంతముయొక్క సారమే శైవసిద్ధాంతము అని శివానందునిచే నుతింపబడిన శైవసిద్ధాంతము పండిత వరదాచారి వాక్యములలో The attempt to call this system 'Siddhanta' could perhaps be referred to the intention that it is the conclusive truth of which the other schools of religion and thought are but Purvapaksha 136 అన్యమతములు, అభిప్రాయములు, పూర్వపక్షములుమాత్రము అయి యిది పర్యవసాన పరమార్థము అను భావమును వ్యక్తపరచుటకే యీ శైవము సిద్ధాంతము నాబడినది. అనగా ఇది యథార్థ శైవ సిద్ధాంతమై styles itself so in contrast to the other schools of Saivism like Sivadvaita, Pasupata, Mahavrata, Kapala Bhairava and the rest 137 శివాద్వైత పాశుపత, మహావ్రత, కాపాల, భైరవాది శైవమత వాదములతో బోల్చి, ప్రత్యేకించుకొనుటకై అట్లు పేరు పెట్టుట అని తపస్యానంద స్వామియు వచించెను. అతని అభిప్రాయమున నది stands for all that is more sublime in the Saiva cult 137 శైవవాదములోని ఉత్కృష్టతా స్వరూపము On the religious side it is a lofty monotheistic cult which elevates Siva in to the Supreme Godhead, who is all-pervading and immanent 137

135. Swami Sivananda Saraswati: Lord Siva and His Worship, p 98.

136. Sri K. C. Varadachari: Prabuddha Bharata, 1954, p 394.

137. Swami Tapasyananda: The Vedanta Kesari, 1956, p 225.

మత పద్ధతిని అది ఒక మహత్తర ఏకేశ్వర సిద్ధాంతవాదమై సర్వవ్యాపక, సర్వాంతరుడైన పరబ్రహ్మస్థానమునకు శివుని గొంపోవును. Philosophically it is uncompromising realism, taking up a position that is midway between monism and pluralism 137 తాత్త్వికముగ ద్వైతాద్వైతములకు మధ్యమ మార్గము అనియు తపస్యానందుని దృఢ నమ్మకము.

కాని శైవ సిద్ధాంతము మహత్తర ప్రాశస్త్యము నార్జించి, దక్షిణాపథమున వ్యాప్తమై, దాక్షిణాత్యమే అని కీర్తినార్జించి యున్నను, అది has richly affileated itself with the great stream of Indian philosophy expressed in Sanskrit language. The main tenets of this school are traced to the great body of literature known as the Agamas 138 సంస్కృత భాషలో నభివ్యక్తమైయున్న భారతీయ తాత్త్విక విచారణా ప్రవాహములో నధికతర విధానమున ననుసంధించుకొని యున్నదనియు, అయినను అది తన వ్యక్తిత్వమును బెంపొందించుకొని, దక్షిణా పథమున నసంఖ్యాక భక్తాగ్రగణ్యుల, తత్త్వవేత్తల రచనములచే, భక్తితత్త్వముచే బోషింపబడి, అభివృద్ధి గాంచినది. దాని భక్తి ప్రపూరిత రచనములగూర్చి సర్ చార్లెస్ ఇలియట్ In no literature with which I am acquainted has the individual religious life - received a delineation more frank and

137. Swami Tapasyananda : The Vedanta Kesari, 1956, p 225.

138. Sri K. C. Varadachari : Prabuddha Bharata, 1954, p 394.

more profound 139 నేను ఎరిగియున్న యే యితర వాఙ్మయ ములో వ్యక్తిగత మత జీవన విధానము యింత విస్పష్ట అద్భుత వివరణము నొందియుండలేదని వ్రాక్కుచ్చెను.

ఉత్తర హిందూస్థానమున జైన, బౌద్ధములకు వ్యతిరేక శక్తులు ప్రబలిన కాలములో, ననగా క్రీ. త. నాలుగైదు శతాబ్దము లలో బౌద్ధ, జైనములు దక్షిణము నాక్రమించి యుండగ, మరల నా మత ద్వయమును నివారించుటకై దక్షిణమున శైవ, వైష్ణవ ప్రచార మవసరమై యుండెను. ఆ కాలమున నీ రెండును ప్రత్యక్ష సగుణ దైవారాధన ప్రార్థన సేవాదులతో ప్రజానీకము నాకర్షించి, బహుళ ప్రచారమున వ్యాప్తిజెందెను. ఈ కాలమునకు పూర్వమే శైవము దక్షిణమునకు జేరెను లేదో తీర్మానించుట కెట్టి ఆధారములు లేవని భాండార్కరు పండితుని అభిప్రాయము. 140 ఈ భావమునే శ్రీనివాస అయ్యంగారు వెలిబుచ్చుచు These monotheistic movements, the Vaishnava and Saiva inspired by the need of a single, supreme personal God felt by those who couldnot rise to the high levels of meditation on the absclute, spread to South India, when they received a great accession of strength, especially when opposed to Buddhism 141 పరబ్రహ్మముపై ధ్యానము జేయగల అత్యు

139. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p 727.

140. Sri R. G. Bhandarkar : Collected Works, Vol. iv, p 202.

141. Sri V. T. Srinivasa Iyangar : The Outlines of Hindu Philosophy, p 126.

న్నత స్థాయికి బోజాలని సామాన్యుల కవసరమైన ఒక సగుణ దైవముయొక్క అవశ్యకతచే ప్రోత్సాహము నొందిన వైష్ణవ, శైవసగుణదైవారాధన మత శాఖలు దక్షిణాపథమున వ్యాపించి, ముఖ్యముగ వ్యతిరేఖ శక్తిగగూడ శక్తినార్జించినవి అని అతడు వాకొనెను. ఆ విధముగ నీ శైవసిద్ధాంతము జైన బౌద్ధముల నెదుర్కొని తానొక మహత్తర శక్తిరూపమును దాల్చినది.

అట్లు జైన బౌద్ధముల కెదురై నిలచి జయించిన శైవము అధిక ప్రాబల్యమును సంపాదించియు, దీనితో సమాన బలమును గడించి, జైనబౌద్ధముల నడంచిన వైష్ణవమునుగూడ నెదుర్కొన వలసి వచ్చెను. శైవవైష్ణవములు రెండింటికి అగమ శాస్త్రములు ప్రమాణములై యుండ, వైష్ణవమునకు విష్ణువు, శైవమునకు బరమేశ్వరుడు అధిష్ఠాన దైవములుగ స్వీకరింపబడిరి. వైష్ణవమున అళ్వారుల గ్రంథములు దివ్య ప్రబంధమై వారికి ప్రమాణభూతము కాగ, శైవమునకు నాయనారులు రచించిన గ్రంథములు ప్రమాణములై యొప్పారినవి. అంతియగాక వీని తాత్వికదృష్టియు నొక్కే మార్గమున నడచి, విశిష్టాద్వైత సిద్ధాంతమును ప్రాతిపదికగ బొంది యుండుట గమనార్హము. అందుచే నది సులభగ్రాహ్యమై సగుణ దైవారాధన తత్పరమై, డాక్టరు పోవు వచించుచందము the most elaberate, influential, and undoubtedly, the most intrinsically valuable of all the religions of India 142

142. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p 722.

అది మిగుల సవివరణమై, ప్రభావవంతమై, నిస్సందేహముగ భారతీయ మతముల నన్నింటిలో అత్యధికసారభూతమైనదిగ వెలు గొందినది. అది ప్రత్యేకముగ శైవ సిద్ధాంతము నా ప్రఖ్యాతి నొందినది. దీనినే, శంకరాద్వైతమున ప్రబలముగ నున్న భ్రాంతి రూప మాయను దొలగించి, దాని శివశక్తిగ నిది రూపొందించి యుండుటచే, శుద్ధాద్వైతవాద మనియు నందురు.

శైవ సిద్ధాంతము దక్షిణభారతము నంతటను ప్రాకి, తిరున ల్వేలి, మధుర, మాయావరములలో ముఖ్య కేంద్రముల నెలకొల్పు కొని, స్వీయ సిద్ధాంత ప్రచారము సాగించుచున్నది. మాయావర ములో గల ధర్మవరము, అధినామ్ యిందు ముఖ్యము. తంజావూరు మండలమున దిరువనందార్‌లో కాశీమఠము, తిరువవదుతురై అధినామ్, ఉత్తర అర్కాటు మండలములోని తిరువన్నామలై లో గల శైవసిద్ధాంత మఠములు ప్రధానములుగ వ్యవహరించుచున్నది.

ఇతఃపూర్వము వచింపబడినట్లు శైవ సిద్ధాంతమునకుగూడ శైవాగమములు ప్రమాణములు. 'సిద్ధాంతో వేదసారవత్' సిద్ధాంతమన వేదసారమనియు, 'వేదాంతార్థం ఇదం జ్ఞానం సిద్ధాంతం పరం శుభం' సిద్ధాంతమనెడి యీ జ్ఞానము వేదాంతార్థమై, పరమై, శుభప్రదమైనది అనియును ప్రభేద, మకుటాగమములు వచించుచుండుట నీ శాస్త్రము వైదికమైయున్నను, ఔపనిషదమైన పరబ్రహ్మమును సగుణ సాకారముగ నొనరించి, పారమార్థికతను సులభతరము గావించినది. అందులకై

యిరువది ఎనిమిది ఆగమముల నాధారముగ గొని, వాని సంపూర్తిగ గ్రహించి, అసమాన క్రియ దమిళములోనికి అనువదించి, సామాన్య ప్రజానీకమునకు అందించి, శైవ సిద్ధాంతము ప్రాబల్యమును గడించినది. పూర్వమే మనము గాంచియున్నట్లు యీ శైవము శివప్రోక్తము. దీని ప్రస్తావనము బ్రహ్మసూత్రములగూడ (2 2. 35–38) బాదరాయణ మహర్షి చంద్రునిచే గావింపబడియున్నది.

ఇట్లు వేద, ఆగమ శాస్త్రములేగాక, శ్వేతాశ్వతరాది యుపనిషత్తులు, నాయనారుల రచనములును, శైవసిద్ధాంత నిర్మాణమునకు మిక్కిలి సహాయకారులైనవి. ముఖ్యముగ దిరుమూల నాయనారు రచించిన తిరుమంత్ర గ్రంథము, తర్వాత శైవ సిద్ధాంత నిర్వచనమున కెక్కువ కారణమై యున్నదని తజ్ఞుల భావము. ఈతడు ప్రత్యభిజ్ఞ స్థానమునుండి, అనగా గాశ్మీరమునుండి శివయోగిగ నరుదెంచినట్లు పూర్వము చూచియున్నాము. అతని గ్రంథమును తిరుమందిరము అనియు నందురు. తమిళదేశమున శైవమును ప్రథమతః బోధించినవాడితడని కొందరందురు. ఇతడు క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దమునకు జెందినవాడని నుడి. తమిళదేశీయ శైవ గ్రంథముల నొక పద్ధతిపై గ్రోడీకరించినవాడు నంబి అండార్ నంబి. ఇతడు పదునొల్గవ శతాబ్దమునకు జెందును. ఆ సాహిత్యమును పది గ్రంథములుగ రూపొందించెను.

అందు మొదటి మూడు గ్రంథములు తిరుజ్ఞాన సంబంధుని 384 పదిగములును, నాలుగునుండి ఆరువరకు గల మూడు గ్రంథ

ములు తిరునావుక్కరసుయొక్క 307 పదిగములును, సుందరమూర్తి యొక్క 100 పదిగములు నేడవ గ్రంథముగను, మాణిక్క వాచ గారుని 'తిరువాచకం' ఎనిమిదవ గ్రంథముగను, తర్వాత తొమ్మిది రచయితల తిరురిశైప్పములు తొమ్మిదవ గ్రంథముగను, తిరు మూలారుని తిరుమందిరము పదియవ గ్రంథముగను అతడు విభ జించెను. అంత నా నంబి, యితర రచనముల జేర్చి పదునొకండవ గ్రంథమును నిర్మింప, నాయనారుల చరిత్రలతోగూడిన 'పెరియ పురాణము'ను పండ్రెండవ గ్రంథముగ శైవులు స్వీకరించిరి. ఈ క్రోడీకరణము కాలసూచికము కాదనుట స్పష్టము.

శైవమునొక సిద్ధాంతరూపమున దీర్చిదిద్దుటకు 'శివజ్ఞానబోధ' అని మైకండార్ పదమూడవ శతాబ్దమున కృషిజేసెను. ద్వాదశ సూత్రములతోడను, వృత్తులతోడనున్న యీ గ్రంథమున బశు, పాశ, పతుల వివరించి, శైవసిద్ధాంత మూలమును జిత్రించిన యీ రచయిత మైకండార్, వేదము గోవుగను, ఆగమము దాని క్షీరము గను, అప్పార్, తిరుజ్ఞాన సంబంధార్, సుందరమూర్తి, మాణిక్క వాచకారు గానముచేసిన పద్యములు అందలి ఘృతముగను, దాని నతడు రుచిచూచినట్లు రచించికొనియున్నాడు.

ఈ విధముగ నీ తమిళ గ్రంథ వ్యాపకము జరుగగ, నీ శైవ సిద్ధాంతమునకు బరమాధారముగ నీలకంఠాచార్యుని బ్రహ్మసూత్ర భాష్యము ప్రధానముగ నున్నది. ఈతడు ఆ భాష్యమును శివపరముగ నిర్మించెను. కాని నీలకంఠుని కాలనిర్ణయమున అభిప్రాయ భేదములు

గలవు. కొందరు యీతని క్రీ. శ. పదునాల్గవ శతాబ్దమునకు జెందిన వాడని అభిప్రాయమును వెలువరింప, నతడు అద్వైతాచార్యుడైన శంకర భగవత్పాదునకు ప్రాచీనుడని నీలకంఠభాష్య పీఠికా రచయిత ముదిగొండ వీరేశలింగారాధ్యుని అభిప్రాయము. భారద్వాజస గోత్రీకుడైన నీలకంఠుడు, హైదరాబాదు రాష్ట్రమున గల కాళేశ్వరక్షేత్రవాసి యని కొందరును, కాళహస్తి క్షేత్రవాసి యని కొందరును, భావించెదరు. గౌరీదేవి విశ్వారాధ్యులు అతని జననీ జనకులు. శ్వేతాచార్యునినుండి శాంభవీ దీక్ష గైకొని, శైవమత ప్రచారమును నీలకంఠుడు కావించెను. అతనికి సర్వమంగళాదేవి భార్యగ నుండెను. వారికి సోమేశ్వర, అఘోరనాథ, కాళేశ్వర, శ్రీగిరి అను నల్వురు పుత్రులు జనించిరి. నీలకంఠాచార్యుడు వేదవేదాంగ పాండిత్యము నార్జించిన పిమ్మట శ్వేతాచార్యుడు తన గురుపీఠమునకు బట్టాభిషేకము గావించెను. అంతట హరదత్త, సోమశేఖర, భవదేవ, భీమేశ్వరులను నల్గురు శిష్యులు ప్రధానముగ నేర్పడిరి. నీలకంఠాచార్యుడు బ్రహ్మసూత్రములకేగాక, శివపరముగ ఉపనిషద్గీతలకుగూడ భాష్యముల రచించి, ప్రస్థాన త్రయముల బూర్తిజేసెను. వేదాగమముల సమస్థాయినుంచి, రెండింటి సమన్వయింప నెంచి, శివాద్వైతమును బూర్తి సనాతన మొనరింప నీలకంఠాచార్యుడు భాష్యత్రియ రచనమునకు బూనెను. అతనికే శ్రీ కంఠుడనియు నామాంతరము కలదు. నీలకంఠాచార్య నామధేయులు పెక్కురు చరిత్రలో

143. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p 723.

గానుపించుటచే, నీ భాష్యకర్త నీలకంఠు డెవరు అను సంశయము విమర్శకులలో గోచరము. కాని విద్యారణ్య విరచిత శ్రీ శంకర విజయమున, బ్రహ్మసూత్ర భాష్య కర్త నీలకంఠాచార్య డొకడు శంకరాచార్యునితో వివాదము సల్పి, పరాజితుడైనట్లు తెలుపబడి యున్నది. ఇచట నీలకంఠుని శంకర కాలమువానిగ గావించి, శంకరోత్కర్ష మునకై నీలకంఠుడోడినట్లు విద్యారణ్యుడు రచించెను గాని, భాష్యకర్తయగు నీలకంఠుడు శంకరునకు ప్రాచీనుడని వీరేశ లింగారాధ్య అభిప్రాయము. 144 అంతియగాక నీలకంఠ భాష్యమును బింబముగ నుంచుకొని శంకరాదులు భాష్యముల చిత్రించినట్లుగూడ ఈతని తాత్పర్యము. ఇతడు రామానుజుని కాలీనుడనియు నందురు. అప్పయదీక్షితుని ఉద్దేశ్యమున నీలకంఠుడు రామానుజ పూర్వమువాడై యుండుటచే, నీలకంఠ భాష్యము ననుసరించి రామానుజుడు తన భాష్యముల నిర్మించెనట.

నీలకంఠ తాత్పర్యము జూచినచో నది కేవల వైదిక శివా ద్వైతముగ గొందరి నమ్మకము. శివాద్వైత మనగా శంకరా ద్వైతమువలెగాక, శివ విశిష్టాద్వైతమనియు, అది రామానుజీయ విశిష్టాద్వైతమువంటిదే యగుననియు దోచును. విష్ణుపదమునకు శివపద ముపయోగింపబడినట్లు కనుపించును. కాని శివ విశిష్టాద్వైత మనిగాక, విశిష్ట శివాద్వైతముగ దీనికి నామాంతరము గలదు.

144. శ్రీ ముదిగొండ వీరేశలింగారాధ్య పీఠిక : శ్రీ నీలకంఠ భాష్యము, 7.

రామానుజీయ విశిష్టాద్వైతముతో గొన్ని విషయముల బోలికలున్నను, దన ప్రత్యేకతను శివాద్వైతము కాపాడుకొనెను. నీలకంఠునకు అద్వైతము ప్రధానమై, శివుడు చేతనాచేతనాత్మకముచే విశిష్టుడు అని వచించును. కాని అతడు అత్యంత భేదాభేద, అత్యంతాభేదాభేద, అభేదభేదాభేద వాదముల నంగీకరింపడు. బ్రహ్మ జగత్తులకు అత్యంత భేదమునుగాని, అత్యంత అభేదమునుగాని నీలకంఠాచార్యుడు గైకొనడు. ప్రపంచ మిథ్యాత్వము అంగీకార్యముకాదు. కాని అప్పయ దీక్షితుని తాత్పర్యమున నీలకంఠుడు సంపూర్ణ అద్వైతవాదియై యుండి, సామాన్యులకొరకు విశిష్ట శివాద్వైతమును బ్రతిపాదించెను. రామానుజునివలె నద్వైత వాదమును నీలకంఠుడు ఖండింపలేదనియు అప్పయ దీక్షితుని సమర్థనము. సామాన్యులకొరకై అతడు సగుణా రాధనమును బోధించెనట.

నీలకంఠుడు శైవసిద్ధాంతమునుండియు గొన్ని విషయముల భేదించును. ఈతని భావమున జీవుడు అణువుగనుండ, సిద్ధాంతమున నతడు విభువు. అటులే ఈశ్వరుడు కేవలము నిమిత్తకారణము మాత్రమని సిద్ధాంతము బోధింప, నీలకంఠుడు ఉపాదాన కారణత్వమునుగూడ శివుని కొసంగును. నీలకంఠునికి శివుడు జ్ఞానస్వరూపుడగుటయేకాక, జ్ఞాతయునై యున్నాడు. పరమ శివునకు అభౌతిక కాయమున్నట్లు అతని విశ్వాసము. ప్రపంచము సత్యమై, నిత్యమై, శివుని శక్తిరూపముగ నున్నది. అది పరమశివుని పరిణామ స్వరూపము. అయినను అత డతీతుడని స్పష్టపరచును. ఈ విధముగ

నతని ముఖ్య సిద్ధాంతము లెవ్వియో తీర్మానింప గష్టసాధ్యము. అయినను అతనిని శైవసిద్ధాంత ఆచార్యులలో నొకనిగ వారు గైకొనిరి.

ఈ విధముగ నీలకంఠాచార్యుడు వేదాగమములకు, సంస్కృత ద్రావిడములకు, ప్రాచీనార్వాచీనములకు సమన్వయాచార్యుడై, దాక్షిణాత్య శైవ సంప్రదాయమున ప్రముఖస్థానము నలంకరించెను.

## శైవ సిద్ధాంత తాత్పర్యము

సామాన్య శైవమునకువలె శైవసిద్ధాంతమునకు ఆధారము పతి, పశు, పాశము లనబడు తత్త్వత్రయము. సిద్ధాంత వివరణమున నీ తత్త్వత్రయ వివరణమును ప్రథమ భాగముగ నేర్పరచి, దానికి విద్యాపాదముగ నామకరణ మొనర్చినది. అంత క్రియా, యోగ, చర్య లనబరగు మూడు పాదముల జేర్చి, శైవసిద్ధాంతము మొత్తమునకు పాద చతుష్టయముతో నలంకృతము.

ప్రథమపాదమున దత్త్వత్రయ విచారము సల్పి, మంత్ర ప్రాముఖ్యతను బోధించి, మంత్రాధిష్ఠాన దైవమును నిర్ణయించుచు, అనుష్ఠానమునకై దీక్షాక్రమము నుపదేశించును. శైవసిద్ధాంతము ద్వితీయ పాదము దీక్షావిధిని బోధించును. తృతీయ పాదము ధ్యానాదిక్రమ వివరముల వ్యక్తపరచును. సాధన మనబడు చతుర్థ పాదము అవసరానవసర అనుష్ఠానముల వెలిబుచ్చును.

శైవ సిద్ధాంతమునకుగూడ పతి శివుడే యగుచున్నాడు. అతడు జీవుని పుణ్యపాప కర్మానుసారముగ ప్రవృత్తు డగు చుండును. అందుచే నతని సృష్టి కార్యము జీవ కర్మాధీనముగ నుండును. అతడు సర్వజ్ఞుడు. అభౌతిక శక్తిస్వరూపుడు. అతనికి సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానుడను మంత్రరూప శరీరములు గలవు. ఇవియే అతనికి బంచ ముఖములుగూడ నగును. ఇవి శివునకు వివిధావయవములనియు నందురు. వానిని పంచ భూతములకుగూడ నన్వయించెదరు. ఈ ముఖముల ద్వారమున బరమ శివుడు, సృష్టి స్థితి లయ తిరోధాన అనుగ్రహముల నిర్వహించును. 'సర్గస్సంసార సంరంభ స్తత్ప్రతిష్ఠా స్థితి ర్మతా। సంహారో మర్దనం తస్య తిరోభావ స్తమప్యమః। తన్మోక్షోఽను గ్రహ స్తన్మే కృత్యమేవం హి పంచకం।' సంసారారంభము సర్గము అనగా సృష్టి యనియు, సంసారవృద్ధి స్థితి యనియు, సంసార నాశనము సంహారమనియు, సంసారము నుద్ధరించుటయే తిరోభావ మనియు, ముక్తి నొసంగుటయే అనుగ్రహమనియు బంచ కృత్యములు తెలుపబడునని శివపురాణ వాక్యము. పృథివి యందు సృష్టి, జలములందు స్థితి, అగ్నియందు సంహారము, వాయువునందు దిరోధానము, ఆకాశమునందు అనుగ్రహము గోచరము అనియు శివ పురాణమున విశ్వేశ్వరసంహిత (10.8) తెలుపుచున్నది. మంత్ర, మంత్రేశ్వర, మహేశ్వర, ముక్తులు పరమశివుని స్వభావములుగ బరిగణింపబడును.

జీవుడు పశు వనబడును. అతడు క్షేత్రజ్ఞ నామకుడై అణు రూపమున నుండును. కాని అతడు నిత్యుడు, సర్వవ్యాప్తుడు. జీవు లసంఖ్యాకములు. ముక్తదశలో జీవుడు నిత్య జ్ఞాన క్రియా శక్తులతో శివుడే యగును. శివత్వము నొందియున్నను ముక్తులు, శివునిపై నాధారపడుచు అస్వతంత్రులై విరాజిల్లెదరు. విజ్ఞానకళ, ప్రళయాకళ, సకళ రూపముగ జీవులు త్రివిధము. విజ్ఞాన, యోగ, సన్యాసము లచే కర్మ సంస్కార నాశ మొనరించి మలశేషము గలిగియున్న వారు ప్రథములు. మహాప్రళయమున ఇంద్రియాది యుపకరణముల బాసి, సంస్కారమలముల గలిగియున్నవారు ద్వితీయులు. మల కర్మ మాయ లనబడు పాశత్రయమును గలిగినవారు సకళులు. విజ్ఞానకళ జీవులు, సమాప్తకలుష అసమాప్త కలుష రూపమున ద్వివిధము. అనంత, సూక్ష్మ, శివోత్తమ, ఏకనేత్ర, ఏకరుద్ర, త్రిమూర్తిక, శ్రీకంఠ, శిఖండులను విద్యేశ్వరాష్టక రూప సాధనముల సమాప్త కలుషులు పొందెదరు. అసమాప్తకలుషులు సప్తకోటి పరిమిత మంత్రస్థానములను శివునిచే అధిష్ఠించెదరు. ప్రళయాకళ జీవులును, పక్వపాశద్వయులు, తద్విలక్షణులు అని ద్వివిధము. అందు ప్రథములు మోక్షము నొంద, ద్వితీయులు పుర్యష్టక బద్ధులై జననమరణ పరంపరలో మునిగియుందురు. పుర్యష్టకము సూక్ష్మ శరీరమునకు నామాంతరము. అంతఃకరణ ధీ, కర్మ కారణములు పుర్యష్టకము నాబడు సూక్ష్మ శరీరము. శబ్ద స్పర్శ రూపరస గంధ పంచకము, బుద్ధి మనస్సు అహంకారములు అష్ట పురులనియు నందురట. ఈ విధముగ పుర్యష్టకము గలిగి పుణ్యసంపన్నులైన

వారు మహేశ్వరునానందముచే భువనపతిత్వమును బొందుదురు. సకళజీవులుగూడ పక్వకలుష అపక్వకలుష విభేదమున ద్వివిధము. పక్వకలుషుడు అష్టోదశోత్తరశత మంత్రములకు మంత్రేశ్వరత్వమును బొందును. అతనికి బరమేశ్వరుడే గురువై మోక్షమును కలుగ జేయును. సూక్ష్మరూపులై అపక్వ కలుషులుగ నున్న జీవులు కర్మానుసారము సుఖదుఃఖ ద్వంద్వముల భోగభాజనుఁగుదురు.

పాశము, మల కర్మ మాయా రోదశక్తి రీతిగ చతుర్విధము. పురుషుని, దృక్ క్రియాశక్తులచే, ధాన్యముపై పొట్టువలె నావరించు నది మలము. ధర్మాధర్మరూపమై ఫలాభిలిషితమై, బీజాంకురన్యాయ మున ప్రవాహరూపమై, అనాదియై యున్న కర్మసంస్కారము కర్మ యందురు. 'భాత్యస్యాం శక్త్యాత్మనా ప్రళయే సర్వం జగత్, సృష్టౌ వ్యక్తిం యాతీతి మాయా' ప్రళయకాలమున సృష్టి ఎందు లయించునో, ఎందుండి ఆవిర్భవించునో, అది మాయా అని నిర్వ చనము. రోదాశక్తి శివశక్తియై ముందుగల పాశ త్రయమును ప్రగమపరచి, పురుషుని నైజమును మరుగుపరచుటచే నదియు పాశమైనది.

ద్వితీయ పాదము క్రియాపాదము నాబడును. ఇందు మంత్ర సిద్ధి, సంధ్యావందన, అర్చన, జప, హోమ, నైమిత్తిక కర్మ, పాశుపత వ్రతము, శాంభవీ వ్రతము, శిరోవ్రతము నాబడు దీక్ష, మొదలగు విషయములు బోధితము. వీనివలన నుపాసకునకు శివ

యోగము, శివోపాస్తి, శివధ్యానము, శివ జ్ఞానము, శివభక్తి యనెడి సమాధి నిష్ఠ సుకరమగును.

తృతీయమైన యోగపాదము షట్త్రింశతి (ముప్పదియారు) తత్త్వములు, తదధిష్ఠాన దేవతలు, లోకాధిపతులు, జీవుడు, పాలకులు, శక్తి, విశ్వకారణమైన మాయ, మహామాయ, అష్టసిద్ధులు, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి, ఆసనముల గూర్చి వివరించును.

చర్యాపాదమైన చతుర్థము, తపస్సు, పవిత్రీకరణము, ప్రాతి పదికలు, శివలింగ తత్త్వములు, ఉమామహేశ్వరులు, స్కంద నందీశ్వరాది గణపతులు, రుద్రాక్షమాల అంత్యక్రియలు మొదలు గాగల విషయముల బోధించును.

పాశుపత సిద్ధాంత శాఖలు ద్వైతములై, శివజీవ విభేదమును దెలుపును. ముక్తదశలో జీవుడు అజ్ఞానశక్తుల బాసి, సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వముల నొందునని పాశుపతము వచింప, శివాద్వైతము సృష్టిశక్తిలేని శివుడుగ ముక్తుడగునని బోధించును.

ఇందు బ్రహ్మచర్య గార్హస్థ్యములు మాత్రము నియమితములై, వానప్రస్థ సన్న్యాసములు ఐచ్ఛికములుగ నున్నవి. అందును హంస, పరమహంస, సన్న్యాసములు కలియుగమున నిషిద్ధములని వీరి తాత్పర్యము. కుటీచక, బహూదక, సన్న్యాసములు గ్రాహ్యములని

వీరి సమ్మతము. ఇవియు నైచ్ఛికములు మాత్రమే యగును. జ్ఞానము ప్రత్యేకముగ లేనిదై, ఉపాసనమే జ్ఞానము నాబడును. ఇదియే భక్తియనియు అభిప్రాయము. పాశుపతులకు శిఖా యజ్ఞోపవీత లింగధారణ సహితమై త్రిదండధారణాత్మకమైన బహూదక సన్యాసము అంగీకార్యము. అదియే త్రిదండి సన్యాసము.

ఇట్లు కొన్ని విషయముల నన్యమతములతో విభిన్న భావముల గలిగియు, నీ శైవ సిద్ధాంతము దక్షిణాపథమును సంపూర్తిగ నాక్రమించి, దక్షిణ భారతమున శైవముగాక అన్యము లేదేమో అని యనిపించు విధానమున సర్వవ్యాప్తి నొందినది.

## వీర శైవము

శుద్ధశైవమితి ప్రోక్తం వీరశైవ మతః శ్రుణు।
సర్వేషామపి శైవానాం వీరశైవం మహత్తరం॥

వీరశైవము శుద్ధశైవమని చెప్పబడును. సర్వ శైవములలో వీరశైవము మహత్తరమైనదనియు నుతింపబడిన నీ వీరశైవము, పూర్వోక్త శైవమత శాఖలలో నొక ప్రముఖవిధానమై, ఆంధ్ర కర్నాటక మహారాష్ట్రముల నధికఅవలంబకుల గలిగియున్నది. ఇది లింగాయత మతమనిగూడ ప్రఖ్యాతము. పంద్రెండవ శతాబ్దమున వీరశైవమును దక్షిణాపథమున ప్రబల మతముగ నొనరించిన బసవేశ్వరునివలన పూర్వ వీరశైవమునకు లింగాయత మతమని నామాంతరము గలిగినట్లు కొందరి అభిప్రాయము. అది కేవలము

పారమార్థిక సంస్థ యగుటయేగాక It was spiritual as well as social institution, organised by Basava and presided over by Allama Prabhu, a great saint 145 అది యొక సాంఘిక సంస్థయై, బసవదేవునిచే నిర్మింపబడి, అల్లమప్రభు అధ్వర్యమున నుండెను.

పండ్రెండవ శతాబ్దమున శైవము దక్షిణమున క్షీణించి, జైన వైష్ణవములు విజృంభించిన గాలమున వాని నిరోధించి, శైవము నుద్ధరింప అదనుకాల మాసన్నమయ్యెను. అట్టి అవకాశము అతిమానుష ఘటికుడైన బసవునకు లభించినది. కాని ప్రాచీనత ఒక ప్రమాణ హేతువుగ విశ్వసించి, కొందరు లింగాయతులు వీరశైవ ప్రారంభమును బసవునకు అన్వయింపక, పంచాచార్యులనబరగు రేవణారాధ్య, మురళీధరారాధ్య, ఏకోరామారాధ్య, పండితారాధ్య, విశ్వారాధ్యులను వారు దీని స్థాపించినట్లును, ఆ ఆరాధ్య పంచకము, మైసూరులోని బలిహాళ్ళి, బళ్లారిజిల్లాలోని ఉజ్జయిని, హిమాలయములోని కేదారము, ఆంధ్ర ప్రదేశములోని శ్రీశైలము, ఉత్తరరాష్ట్రమునగల వారణాశి ప్రదేశములగల లింగములనుండి జనించిరనియు విశ్వసించెదరు. వారు వివిధ కాలముల వివిధ స్థితులలో జనించిరట. కాని అది సత్యదూరమని విజ్ఞుల వాదము. అందు కొందరు బసవదేవుని సమకాలికులును, గొందరు అతని తర్వాతవారును అని గ్రాహ్యము. అందుచే వీరశైవ మతి ప్రాచీనము

145. Sri Kumaraswami: The Cultural Heritage of India, Vol. 4, p 99.

గాక, That this institution, so important in the religious history of India was founded by Basava about A.D. 1160 145 భారతీయ మతచారిత్రమున నతి ప్రాధాన్యమైన యీ సంస్థ క్రీ. శ. 1160 వ సంవత్సరమున బసవేశ్వరునిచే సంస్థాపితమని, ఆచార్య కుమారస్వామి నిశ్చయము.

అట్లుగాక వీరశైవము పండ్రెండవ శతాబ్దమున బసవదేవుని చేత గ్రమబద్ధమైనదని కొందరి అభిప్రాయము. 146 అతడు వీర శైవ సంస్థాపకుడుకాక, తన అధికార ప్రాభవమున దాని అభివృద్ధి గావించెనని భాండార్కారు మొదలైన పండితవర్గము యొక్క నిశ్చయము. 147 ఈ శాఖను ముఖ్య తాత్పర్యముగ బ్రాహ్మణ ధిక్కారము ను, వర్ణవ్యవస్థ వినాశము నుంచుకొని ప్రచారము సాగించుటచేతను, ఆగమాదిశాస్త్రములు సంస్కృతభాష నుండుటచే వాని సర్వజన గ్రహణముకొరకు స్థానికమైన కన్నడభాషలో రచించుటచేతను, వర్ణవిచక్షణలేక నెల్లర సమానత్వమును బోధించుట చేతను నీ వీరశైవము సుకరమై తక్షణ వ్యాప్తి నార్జించినది. తాత్త్వికముగ దోచు శుద్ధ సంఘసంస్కరణోద్యమము లింగాయత మనియు, నందుచే నది త్వరితముగ బ్రాహ్మణేతర సంఘముల వ్యాపించెననియు గొందరి అభిప్రాయము. మరియు ఆచార్య కుమార

145. Sri Kumaraswami : The Cultural Heritage of India, Vol, 4, p 99.
146. Sri Prabhu Shankar : The Vedanta Kesari, 1957, p 155
140. Sri R. G. Bhandarkar : Collected Works, Vol. iv, p 189.

స్వామి అభిప్రాయమున నీ సంస్థకు అసాధారణ ప్రజ్ఞ ప్రదర్శించు కన్నడ వచన సారస్వతము కర్ణాటకులకు గర్వకారణముగ గలదగుటచేగూడ నీ లింగాయత మతము బహుళ జనాదరణమును పొందినది. 148 బసవేశ్వరుని 'వచనములు' నా కన్నడ గ్రంథములు are full of life and wisdom and full of a burning devotion, which they embody. Indeed, the Vachanas of Basava, Mahadevi and Allama are some of the most luminous utterances of the human spirit 149 సంపూర్తిగ సజీవనములై వివేక, జ్ఞానపూర్ణములై, తీవ్ర భక్తియుక్తములై యున్నవి. యథార్థమున బసవ, మహాదేవి, అల్లముల వచనములు మానవత్వముయొక్క అత్యంత ప్రకాశమాన వచనములు అనియు పండిత సీతారామయ్య వచించును. అంతియగాక, లింగాయత మతమునకు ముఖ్య ప్రవక్త బసవేశ్వరుడు, నాటి భూపాలకునికి ముఖ్య అమాత్యస్థానము నధిష్ఠించియుండి, తన అధికారమునుగూడ నుపయోగించుటయు ముఖ్యహేతువు కానగును. బ్రాహ్మణాధిక్యతను నిరసించు నీ వీరశైవమునకు జాలవరకు సంస్థాపకాచార్యుడైన బసవేశ్వరుడు బ్రాహ్మణ జాతివాడై యుండుట గమనార్హము. అతని తర్వాత ఆచార్యుడు చిన్న బసవుడు, తన సోదరి నాగలాంబిక పుత్రుడు.

---

148. Sri Kumaraswami : The Cultural Heritage of India, Vol. 4, 99.

149. Sri V. Seetharamaiah : The Hindu, 26-10-1958

కాలాంతరమున శ్రీకరు డుద్భవించి, లింగాయతమును సనాతన మొనరింప, బ్రహ్మ సూత్రములకు నీ మతానుసారముగ భాష్యమును సంస్కృతమున రచించెను. అటులే మరల లింగాయతమున వర్ణ వ్యవస్థ పూర్వస్థితి నొంది, బ్రాహ్మణాది విభాగముల నుద్ధరించుకొని యుండుట విచిత్రము. అయినను, తన కాలమున అచంచల సంస్కరణ దీక్ష గలిగి, ఆచార్య రాఘవ వచించునట్లు Basava was a good reformer, a resolute and an independent thinker. He had a rare combination of a powerful will and a powerful intellect. He was an idealist in philosophy and a realist in his out look upon life 150 గొప్ప సంస్కర్తయై, నిశ్చిత స్వతంత్ర ధీకుశలుడు. శక్తివంత మైన సంకల్పము, ప్రబలమైన బుద్ధియు, నతనిలో అసాధారణముగ గలసియున్నవి. తాత్త్వికముగ యోచనాపరుడు, జీవన వ్యవస్థా దృష్టికి అనుష్ఠానపరుడుగ బసవుడు రూపొందుటచే, నాటి సంఘము నెదుర్కొని, జైన, బౌద్ధ, వైష్ణవాదుల నరికట్టి, అసంఖ్యాక ప్రజానీకమునకు దన విశాల దృక్పథముతో దోడు నీడయై, అండ దండయై నిలచి, ఉద్ధరించియున్నాడు. యథార్థమున నత డొక శక్తి స్వరూప మన్నను అతిశయోక్తి కానేరదు. అతని నామము ఆంధ్ర కర్నాటక మహారాష్ట్రములలో నింటింట వెలసి, కాలక్రమమున నాతడే ఆరాధ్య దేవుడై, జంగమ నామము వహించిన శైవుకుల నందీ శ్వరుని అవతారమై, సుస్థిర యశోవిరాజితుడు కాగలిగెను. అది అతని అపార అద్వితీయ ప్రతిభాయుత జీవిత విశేషమేగదా!

150. Prof. T. S. Raghavan: The Vedanta Kesari, 1958, p 155.

బసవ, బస్వ, బస్వన, బస్వప్ప, బసవన్న, బసవదేవ, బసవేశ్వరాది నామాంతరములతో విరాజిల్లు నీ ప్రవక్త శ్రీశైల మహాక్షేత్రమునకు బశ్చిమముగనున్న హింగుళేశ్వర పార్వతీ అగ్రహారమున, మాధవీ మాదిగరాయ లను బ్రాహ్మణ దంపతులకు జనించెను. ఆ భక్తదంపతుల భక్తి ప్రభావముచే నానందమొందిన శివుడు, నందీశ్వరుని అట జనింప నాదేశించినట్లు బసవపురాణ వచనము. ఉపనయన కాలము ఆసన్నముకాగ, నతడు శివునే గురువుగ భావించి, విశ్వసించి యుండుటచే, సామాన్య మానవుడు తనకుపదేశింప నియ్యకొనడయ్యెను. అట్లు అచంచల శివభక్తితో విద్యా బుద్ధుల నార్జించి, తన గ్రామమునుండి, కళ్యాణ పట్టణమునకు వలసపోయి, అట నా దేశమును బాలించుచున్న బిజ్జలరాయని ఆస్థానమున గల ఒక దండనాయకుని కుమార్తెను వివాహమాడెను. ఆ ప్రభువు క్రీ.శ. 1157 నుండి 1167 వరకు పాలించెను. బసవదేవుని సోదరిని ఆ బిజ్జలరాయనికిచ్చి పరిణయము జేసినట్లు కొందరు వచించెదరు.

కాని బసవదేవుడు బారమార్థిక తృష్ణచే సంగమేశ్వర క్షేత్రమునకేగి, అట సంగమేశ్వర స్వామిచే వీరశైవమును నుపదేశముగ బొందెను. మరల బసవుడు తన మామ మరణించుటచే బిజ్జలరాయనిచే నాహ్వానింపబడి, దండనాయక పదవి నలంకరించెను. ఈ కాలమున దన సోదరి చెన్నబసవుని గనెను. ఈతడే తన మాతులుని మరపించు శక్తిసామర్థ్యముల, విద్యావైదుష్యముల గడించి, లింగాయత ప్రచార కార్యక్రమమున గాలాంతరమున ప్రబల శక్తుడై రూపొందెను.

కళ్యాణ నగర ప్రభువైన బిజ్జలరాయుడు జైనమతావలంబకుడై యుండ, దన పరిసరములుగూడ జైనులచే ప్రావృతము. కాని బసవుడు వీరశైవమునకు జెందినవాడై, తన ప్రభావ శక్తుల దాని అభివృద్ధికై యుపయోగించుచుండెను. మరియు, జంగములు నాబడు వీరశైవులకు నితడు అనేక విధముల దోడ్పడుచు, నందులకై ప్రభుత్వ ధనమునుగూడ విరివిగ నుపయోగింపజొచ్చెను. ఇంత ప్రతిభాసంపన్నుడై యుండియు బసవేశ్వరుడు మాత్రము, ప్రభువును దన శైవమునకు త్రిప్పుకొనలేకపోయెను. అటులే నిరువురిమధ్య నంతరము లేర్పడెను. బసవునికి బిజ్జలరాయనికి మధ్య అభిప్రాయ భేదములు పెరిగి, యుద్ధములుగూడ స్వల్పముగ జరిగినట్లు చరిత్ర.

అంత బసవేశ్వరుడు కళ్యాణ పురమును వదలి, సంగమేశ్వర మును గేంద్రముగ నుంచుకొని, తన వీరశైవ ప్రచారము నుద్ధృతముగ సాగించుచుండెను. శైవుల బాధించుచున్నాడని వీరశైవుడైన జగద్దేవుడు, కొందరి సహాయమున రాజా స్థానమును జొచ్చి, సభా మధ్యమున బిజ్జలి ప్రభువును జంపెను. అంత నా పురమున నరాచకము ప్రబలి పట్టణ మంతయు నశించెను. దీనికంతటికి కారణము బసవుడే యని కొందరందురు.

బసవుడు సంగమేశ్వరముననే యుండుచు, దన శివారాధన ప్రచారముల జేయుచుండెను. తన అసాధారణ వ్యక్తిత్వమున నా వీరశైవమును దక్షిణమున నొక శక్తివంతమైన మతరూపముగ నొనర్చి, ఆ మహానుభావుడు, సంగమేశ్వరమున శివసాయుజ్యము

నొందెను. ఇతడు పూర్వాచార్యులచే నెలకొల్పబడిన వీరశైవమును తన అసమాన శక్తిసామర్థ్యములచే మహాసంస్థగ రూపొందించి, అతడే దాని సంస్థాపకుడు అను సంశయము నెల్లరకు జనించు నంతటి ప్రాధాన్యము నందు సాధించి, వానికి లింగాయత మతముగ గూడ నొక ప్రత్యేక నామము నొసంగి కన్నుమూసెను. కాని అతని దివ్య తేజము లింగాయత హృదయముల నేటికిని నిండి, వారికి దగు ప్రోత్సాహ శక్తుల నొసంగుచు, నా మతమును ఉజ్జీవింప జేయుచున్నది. బసవేశ్వరుని మహత్కార్యములలో శివానుభవ మండప స్థాపనము చాలముఖ్యము. అదియే వీరశైవమునకు మూల కేంద్రము. దానికి అల్లమ ప్రభువును అధ్యక్షునిగ నేర్పాటుజేసెను. దాని క్రీ.శ. 1160 వ సంవత్సరమున స్థాపించెనట. దీనిమూలముగ వీరశైవము సజీవరూపము నొందినది. దీనిని రాజులు, పౌరులు, వ్యాపారులు సామాన్యులు మొదలగు వారెల్లరు ఆశ్రయించి, తా మభివృద్ధి జెంది, సంస్థకు బుష్టి గలిగించిరి. అట మూడువందలకు బైగ పండితులుండి సిద్ధాంత చర్చలు సాగించుచుండెడివారట. అందు అరువదిమంది స్త్రీ విదుషీమణులుగూడ నుండెడివారట. వారిలో ప్రముఖురాలు అక్కమహాదేవి కన్నడభాషకు భూషణముగ బ్రసిద్ధి గాంచిన వచన గ్రంథములు యీ కేంద్రస్థానమునుండియే వెలువడి నవి. అనుష్ఠానముల జేయుట, జేయించుటయందుగూడ నీ సంస్థ ముఖ్య కేంద్రముగ నుండెడిది. సాంఘిక సమస్యల నిర్ణయించుట, స్త్రీ జనోద్ధరణము, వర్ణ వ్యవస్థా నిర్మూలనము, అస్పృశ్యతా నివారణము, కార్మికజీవిత గౌరవము, నిరాడంబర జీవనముల !

కేంద్రము ముఖ్య కార్యములుగ నుంచుకొనెను. కేదార, శ్రీశైల, బాలెహొన్నూరు, ఉజ్జని, కాశీలలో వీరికి సుప్రసిద్ధ పంచ మఠములు గలవు. కర్ణాటకమున వీరికి శతాధిక మఠములున్నవి. ఈ మతము నకు ప్రవక్తలు, ప్రచారకులు, రచనములు, సర్వము కర్ణాటక ఆంధ్రముల మాత్రమే యుండుటచే, నిది అన్యరాష్ట్రముల వ్యాపించి యుండలేదు. ఈ సిద్ధాంతముయొక్క ముఖ్యవిషయము గమనించెదము గాక.

## లింగాయత తాత్పర్యము

వీరశైవము పూర్వోక్త పంచారాధ్యులచే ప్రతిపాదింపబడినదను విశ్వాసము వీరశైవులలో ప్రబలము. శైవమువలె వీరశైవమునకు గూడ శివలింగము ప్రధానమై యున్నది. కాని లింగమును శరీరముపై ధరించుటయు, నది యొక తేజోరూపముగాన సాధకునిలో గల అజ్ఞానాంధకారము విచ్ఛేదమై పరిశుద్ధత గలుగుననియు, నది దేవతా స్వరూపమగుటచే, లింగధారణమున ముముక్షువు సర్వదా దేవసన్నిధాన మహాభాగ్యమున జీవించుననియు బోధించి, అనుష్ఠించుచుండుటచే దానికి లింగాయతమనియు నామాంతరము.

ఆణవమల ప్రభావమున జీవుడు అల్పజ్ఞుడయ్యెగాని, యథార్థమున నతడు సర్వజ్ఞుడే. ఈ మల మహిమచే నతడు దృక్ దృశ్య ద్వంద్వమునకు జారును. అది మాయామలము. ఈ మాయా మలశక్తిచే బాహ్యాభ్యంతర సృష్టియంతయు జరుగును. ఇందుచే

ధర్మాధర్మ ప్రవృత్తుడై సంసార చక్రమున జీవుడు పడిపోవును. ఇది కర్మమల మనబడును. కర్మమల జనితములు జాతి, ఆయు, భోగములు. ఈ మలత్రయ పాశబద్ధుడై జీవుడు పశువనబడును. శివుడు పతి నాబడును. జీవుడు పశుత్వమును బాసి అనంతత్వముతో ననుసంధింపవలెను.

అందులకై వీరశైవము దీక్షను గైకొన బోధించును. దీక్షతో లింగధారణము జేయవలయును. దీక్షాకాలమున గురువు శిష్యునికి శక్తిపాతము నొసంగును. దీక్ష, క్రియా మంత్ర వేధా రూపముల త్రివిధము. క్రియాదీక్షలో లింగధారణము జరుగును. మంత్రదీక్షలో మంత్ర ముపదేశింపబడును. వేధాదీక్షలో ఆ గురువు జ్ఞానమును శిష్యునికి బోధించును.

లింగాయతుల అనుష్ఠానము పంచాచార అష్టావరణములతో గూడియుండును. లింగాచార, సదాచార, శివాచార, భృత్యాచార, గణాచారములు పంచాచారము లనబడును. నిత్య లింగార్చనము లింగాచారమైయుండ, ధార్మిక ప్రవృత్తితో జీవించుట సదాచారము నాబడును. జంగమ పోషణముగూడ నిందంతర్గతము. వివిధ వృత్తులలో నున్నను లింగాయతులు వర్ణవిచక్షణలేక సపంక్తి భోజన, వివాహముల గావించుకొనుట శివాచారమగును. శివునియందును గౌరవమున భృత్యునిచందము వ్యవహరించుట భృత్యాచారము. సంఘ నిందా ద్వేషముల సహింపకుండుట గణాచారము అగును.

అష్టావరణములచే అల్పత్వమునుండి వి మోక్షమునొంద సాధకు నకు సాధ్యమగును. ప్రాపంచిక విషయాఘాతముల నుండియు నాతని నివి రక్షించును. గురు, లింగ, జంగమ, పాదోదక, ప్రసాద, భస్మ, రుద్రాక్ష, మంత్రములు ఆవరణాష్టకము. ఈ ఆవరణములే శైవేతరులనుండి వీరశైవుల వేరు పరచుచున్నవి. ఈ విధముగ లింగాయతుడు శివయోగి అనియు, శివశరణుడనియు ప్రసిద్ధి.

వీరశైవమున 'స్థల' పదము ప్రత్యేక ప్రాధాన్యతనొంది యున్నది. పరమార్థమును నిట 'స్థల' మందురు. 'స్థ' అనగా సృష్టి, స్థితుల సూచింప, 'ల' ఉపసంహారమును దెలియబరచి, సంపూర్ణ పరమాత్మను 'స్థల' శబ్దము బోధించును. అదియే పర బ్రహ్మము పరమశివుడు. విమర్శాశక్తి సహాయమున సృష్టి స్థితి లయ కార్యములు పరబ్రహ్మమున జరుగును పరమాత్మయొక్క ఆత్మ విమర్శయే పరామర్శముగ నాబడి శక్తి అగుచున్నది. అది శివునితో సామరస్యమున శక్తి శాక్తులవలె నవినాభావ సంబంధమున నుండును. ఈ శక్తి ప్రాబల్యమున శివునిలో లింగ, అంగ, ద్వంద్వము. శక్తిలో శక్తి భక్తియునేర్పడును. భక్తి యనగ నిట ఉపాసనమగును. లింగముపాస్యమై యుండ, అంగ ముపాసకుడై యుండును. లింగాంగముల మధ్య అనగా ఉపాస్య ఉపాసకుల మధ్య అంతరము నశించి, సామరస్యమును బొందుటయే సత్ స్థలముగ వీరశైవము వచించును.

'స్థలము' లింగ అంగములుగ ద్వివిధమై మరల నొక్కొ క్కటి త్రివిధముగ మారును. అంగము, త్యాగాంగ భోగాంగ

యోగాంగములగుచుండ, లింగము, యిష్ట ప్రాణ భావ లింగములుగ రూపొందెను. జీవునికి జాగ్రత్ స్వప్న సుష్తావస్థలలో, విశ్వ తైజస ప్రాజ్ఞులని నామములు గలవు. విశ్వుడు స్థూల ప్రపంచముపై మమకారమును బోనాడి, త్యాగాంగు డగును. అతనికి ఇష్ట లింగ మారాధ్యమగును. అటులే తైజసుడు సూక్ష్మ శరీరమున బ్రవర్తించు చుండుటచే నావిషయ ప్రవృత్తులపైగూడ బుద్ధి పోవకుండనుండు పరిశుద్ధ డగుటచే నతడు భోగాంగు డగును. అతనికి ప్రాణలింగము పూజ్యము. అంత ప్రాజ్ఞుడు కారణశరీర విశిష్టుడై, వాసనాచయమున శివేతరముగ నుండును. కాని మనో ప్రవృత్తులు తమ సహజ ధర్మముల బాసియుండుటచే శాంతి నొందియుండును. అతనికి బూర్వ శరీరము నశించి, నూతన కారణశరీరము పరిశుద్ధముగ గల్గును. అతడు యోగాంగుడై యుండ ఇచట లింగాంగ మేళనము జరుగును. ఈ యోగాంగునికి భావలింగము అర్చామూర్తి. ఈ విధముగ ఇష్ట ప్రాణ భోగ లింగములు పరమాత్మ యొక్క తత్త్వములు. ఇష్ట లింగము వ్యష్టిరూపమునను, ప్రాణలింగము సమష్టిరూపమునను, భావలింగము అనంతరూపమునను నా పరమాత్మ తత్త్వమును బోధించును.

మరల ఇష్టలింగము ఆచార, గురు లింగములుగ ద్వివిధము. ప్రాణలింగము శివ, చర లింగములుగ రెండు విధములు. అటులే భావలింగము, ప్రసాద, మహాలింగములై యొప్పారును. అదేవిధముగ త్యాగాంగుడు భక్తుడుగ 'శ్రద్ధాభక్తు'ల గలిగియుండ, నాతనికి ఆచార

లింగము పూజపీయమైయుండ, నతని స్థితిని 'భక్తస్థల' మందురు. గురులింగముపై నిష్ఠాభక్తి గలిగి, మహేశుడై, అతడు, 'మహేశస్థల' మనబడును. అంత భోగాంగుడు, శివలింగమందు 'అవధానభక్తి' గలిగి 'ప్రసాది' అయి 'ప్రసాదస్థల'ము నాబడును. చరలింగమున అతడు 'అనుభవభక్తి' గలిగి, ప్రాణలింగమై, 'ప్రాణలింగ స్థల' మని అందురు. యోగాంగుడు ప్రసాదలింగ ధ్యానపరుడై, ఆనంద భక్తి' గలిగి శరణుడై, 'శరణస్థల' మనబరగును. 'సమరసభక్తి'తో మహాలింగముతో నైక్యమై, ఏకుడై 'ఐక్యస్థల' మని వ్యవహారమును బొందును.

వీరశైవముగూడ నితర శైవశాఖలవలె ముప్పదియారు తత్త్వ ముల బోధించును. ఇవి చిత్, చిదచిత్, అచిద్రూపమున త్రివిధములై, ప్రథమ పంచకము చిత్ రూపముగను, ద్వితీయము చిదచిదాత్మకమై, తర్వాత తత్త్వసప్తకమును గలిగి, తృతీయము చతుర్వింశతత్త్వము లతో అచిద్రూపముగ నున్నది. మరియు నిందు ప్రథమ పంచకము లోని ప్రథమ శివత్వము పరాశక్తితో ప్రసాదలింగముగను, ద్వితీయ మైన శక్తి ఆదిశక్తితో చరలింగముగను, తృతీయమైన సదాశివ తత్త్వము ఇచ్ఛాశక్తితో శివలింగముగను, నాలుగవది యగు ఈశ్వ రత్వము జ్ఞానశక్తితో గురులింగముగను, పంచమమైన సద్విద్యా తత్త్వము క్రియాశక్తితో ఆచార లింగముగను వీరశైవము సూచించును.

లింగాయత తాత్పర్యమున నీ తత్త్వములలో నున్న ప్రపం చము అనభివ్యక్త స్థితిలో సముద్రమున దరంగ, ఫేనబుద్బుదాదులు

లయించి యున్నట్లు పర శివునిలో లయించి యుండుననియు, సముద్రమున మరల నవి ఉద్భవించునట్లు ఇవియు అభివ్యక్తమగు ననియు, నందుచే నీ సృష్టికార్యమున నెట్టి వినూత్నత్వము గానరాక, అవ్యక్తముయొక్క రూపాంతరము మాత్రమే అని విశ్వసించెదరు.

ఈ చందము వీరశైవ సిద్ధాంతము చాలవరకు పూర్వ శైవమునే తాత్త్వికముగ ననుసరించుచు, గొందరు పండితుల తాత్పర్యమున, రామానుజుని విశిష్టాద్వైతమునుబోలి, శక్తికి అధికతర ప్రాధాన్యత నొసంగియున్నది. అంతియగాక సమాప్తమున మనము గాంచినట్లు యీ మతము కొన్ని నూత్న పారిభాషిక పదముల నిర్మించి, వానికి వినూత్న నిర్వాచనముల ఆన్వయముల గావించి యున్నది. మరియు నది పారమార్థికముగ నెంతకృషి సల్పియున్నదో అంతవరకు సాంఘికముగగూడ నంత శ్రమ దీసికొని సంఘ సంస్కరణము గావించియుండుట గమనార్హము. ఇంత సువిశాల మతశాఖను నిర్మించి, వ్యాపింపజేసిన అసమ ప్రజ్ఞాశీలుడు బసవ దేవుడు మననీయుడు, మాన్యుడు, పూజ్యుడు. అతని అచంచల దీక్షాయత్త చిత్తమునకు నమోవాక సహస్రములు.

## సమాప్తి వచనము

నాగేంద్రహారాయ త్రిలోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ।
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
తస్మై 'న'కారాయ నమః శివాయ॥

మందాకినీ సలిల చందన చర్చితాయ
నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ।
మందార పుష్ప బహుపుష్ప సుపూజితాయ
తస్మై 'మ'కారాయ నమః శివాయ॥

శివాయ గౌరీవదనారవింద
సూర్యాయ, దక్షధ్వరనాశకాయ।
శ్రీనీలకంఠాయ వృషధ్వజాయ
తస్మై 'శి'కారాయ నమః శివాయ॥

వశిష్ఠ కుంభోద్భవ గౌతమార్య
మునీంద్ర దేవార్చిత శేఖరాయ।
చంద్రార్క వైశ్వానర లోచనాయ
తస్మై 'వ'కారాయ నమః శివాయ॥

యజ్ఞస్వరూపాయ జటాధరాయ
పినాకహస్తాయ సనాతనాయ।
దివ్యాయ దేవాయ దిగంబరాయ
తస్మై 'య'కారాయ నమః శివాయ॥

ఇట్లు శివ పంచాక్షరీ స్తోత్రము, ఇంతవరకు ఈ గ్రంథమున మీమాంసించియున్న శివస్వరూప లక్షణముల నన్నింటిని గ్రోడీకరించి, మధుర శ్లోకముల రూపొందించి, వేదముల మధ్య హృదయ రూపమున వెలుగొందినదై, అజ్ఞానాంధకార నిర్మూలనపరమైన మహా జ్యోతి నాబరగు శివ పంచాక్షరీ సంస్మరణము గావించియున్నది. అభ్యుదయ నిఃశ్రేయస రూప సుఖశాంతుల సాధకులకు ప్రసాదించు శివ శంకర స్వరూపుడై, ఎందెందు సాధకకోటియున్న నందందు, భౌతికావధుల దాటి, జాతి వర్ణ లింగ విభేదముల నతిక్రమించి ప్రత్యక్షమై, సాధకుల కోర్కెలెంతటివైనను వర ప్రదాన మొసంగు నా పరమ శివుని యెంతని కొనియాడగలము! సర్వ దేశముల నా మూర్తి చిహ్నములే గోచరముగదా! ఎల్ల

శాస్త్రముల నా చిన్మయుని గాథాలహరి భూషణములే గదా! ఏ కవి హృదయము పరికించినను నా సర్వ కళా స్వరూపుని సంస్తుతి పరంపరలేగదా! ఏ యోగి దహరము ప్రవేశించి చూచినను ఆ మూర్తామూర్త విదూరుని లింగస్వరూప ప్రదర్శనమేగదా! ప్రతిమగ, ప్రతీకముగా, నిరాకారముగ, నిరామయముగ, నెన్నెన్ని యుపాసనా రీతులు ప్రపంచమున గలవో అన్నింటికి దానే యన్ని తత్త్వములలో దోచి, శాంతి దాత యగుటగదా శివనామ విభూషితు డయ్యెను! తాత్త్విక విచారణమున ముఖ్య రీతులుగ ప్రఖ్యాతి నొందిన ద్వైతాద్వైత విశిష్టాద్వైతముల కాధారమైన తత్త్వము తానెయై, నెల్లరకు దానే గమ్యమై, పరతత్త్వమై, ప్రదర్శించు పరతత్త్వము శివత్వముగాక వేరెద్ది యీ జగతి గలదు! కేవలము మూఢదశలలో నుండి, పశుత్వమున మునింగి, పశువే అనబడు అజ్ఞానమునుండి, అలౌకికానంద నిమగ్న చిత్తముల ప్రపంచోపశమన ఉన్మనీ స్థిత ప్రజ్ఞులవరకు నెల్లర దృక్పథముల దోచు నసమాన తత్త్వము యిదిగాక అన్య మెక్కడిది?

అట్టి శివంకర తత్త్వమునుగూర్చి గ్రహించుటకై యత్నించితిమి. అందులకై వేదవేదాంగ, ఉపనిషదాగమ, పురాణేతిహాస, వచన, కీర్తనాది శాస్త్రగ్రంథముల జొచ్చితిమి. ఆ సర్వాతీతుని సర్వాత్మకాన దివ్యమంగళాకారమును మనసా జింతించుకొని ముగ్ధులమైతిమి. స్థూల లింగాకారముల వెంట బయనించి, ఆకాశలింగమువరకు అతని మూర్తి వెంటనంటి, ఆత్మతత్త్వముతో నతని ఐక్యతను గమనించి, అందును మనమైక్యము నొంది శివత్వమునుగూడ బొందియుంటిమేమో!

ఈ మూర్తి నాశ్రయించి పరిణమించిన శైవ మతము వేదముని వలె అనాదిసిద్ధమై, వేదముతో సహోత్పన్నమై, గాలక్రమమున

ననేక శాఖోపశాఖలుగ మూర్తీభవించి, ప్రపంచముయొక్క నలు మూలల నాక్రమించి యుండుటయు గాంచియున్నారము. అట్లు అతని విశ్వతోముఖ విశ్వరూపము ఏరిని ఆకర్షించి చకితుల గావింపదు! ఆ దివ్యమంగళాకారుని జుట్టును పూర్వోక్తచందము సకలవిధ జీవులు, పన్నగ, నగ, వ్యాఘ్ర భూత, పిశాచాది గణములుగూడ జేరి, ఆనందించి తరించినవి గదా! ఇక నితరుల విషయము తెలుపనేల?

ఆ మూర్తినిగూర్చి చింతించి, ధ్యానించి, అనేక తాత్త్విక సిద్ధాంతముల జిత్రించిన లకులేశాది బసవేశ్వరుని వరకుగల సర్వ విజ్ఞులు ధన్యులు. వారిననుసరించి, నియమపాలనమున శివ సాక్షాత్కార సాయుజ్యముల నొందిన అసంఖ్యాక శివయోగులు ధన్యాతి ధన్యులు. వారు శివనామ మహాత్మ్యముచే బునీతులై తరించి, సర్వ జగతిని బవిత్రము గావించిరి. వారి శక్తి అజేయము అద్భుతము. వారెల్లరకు 'సౌరభము' సహస్రాధిక నమస్కృతు లొనర్చుచున్నది. వారినెల్లరు గ్రహించి అనుసరించి, తరింతురుగాక అని విశ్వసించు చున్నది.

నమ స్సచ్చిదంభోధిహంసాయ తుభ్యం
నమః కాలకంఠాయ కాలాత్మకాయ।
నమస్తే సమస్తాఘ సంహారకర్త్రే
నమస్తే మృషాచిత్తవృత్త్యైక భోక్త్రే॥

శివగీత - 7.37.

ఓ దేవదేవా! సచ్చిదానంద సముద్రమున హంసవైన నీకు నమస్కారము. గరళకంఠునికి, కాలాత్మునికి, సమస్త పాపసంహారునికి, మిథ్యాభూత చిత్తవృత్తులందు భోక్తవగు నీకు నమస్కారము.

హరిః ఓం తత్ సత్